శ్రీ

# ఆంధ్రగ్రంథరత్నమాల

7-వ రత్నము.

# సన్మార్గప్రదర్శనము.


కర్త

పామర్తి బుచ్చిరాజు

కాకినాడ.





కాకినాడ:

శ్రీసావిత్రీముద్రాక్షరశాల ముద్రింపఁబడినది.

1921.




వెల రు 1-12-0

# అవతారిక

సోదరసోదరీమణులారా!

ది 17-11-1915 (రాక్షసనామ సం॥ కార్తిక శుద్ధ ౧౧ బుధవారము) నఁ బ్రసంగమధ్యమున నన్నొకపరిచితుఁడు హేత్వంతరమునఁ బ్రోత్సహింప నే నీనవలను నానాఁడే ప్రారంభించి దినమునకు నొకటి, రెండు, ప్రకరణములచొప్పునఁ బదునేనుప్రకరణముల నవలగా ముగించితిని. అకారణముగఁ బ్రచురణాభంగము గలిగినను సరకుసేయక మఱికొన్ని ప్రకరణములు చేరిచి ప్రస్తుతనవలగా నొనరిచితిని. మొత్తమున నిరువదినాళ్లలోనే దీని ముగించుట భ్రమప్రమాదములు దీనఁ గలుగకపోవు.

పేరు వినినంతనఁ దమ రందు సర్వజ్ఞులుగా నెంచికొని నిర్లక్ష్య మొనరుచున్నైజము మనవారిలో నధికము. ఏది యెవ రెన్నివిధముల వ్రాసినను గించిత్తైన విశేషము చొప్పింపకుండరని నానమ్మకము. కావున నీనడించుటకుఁ బాత్రము లుండునే!

బుద్ధిమంతులు మాఱుపేరున నున్నను దీని సారంగధరగనే గ్రహింతురు గాక. సత్ మార్గ ప్రదర్శనము = చంద్రబింబము — సారంగధరనామమే. దీనఁ గలపాత్రోచిత్యము,

పాత్రపోషణ, భాష, భావములు, నీతి, రసపుష్టి మున్నగు నవి చదువరులకు విశదము.

మ॥ రా॥ రా॥ శ్రీ హానరబిల్ దివాన్ బహద్దరు కొమ్మి రెడ్డి సూర్యనారాయణమూర్తిగారియొక్కయు, వారిసోదరుల యొక్కయు, బ్రహ్మశ్రీ దర్భా వేంకటశివరామశాస్త్రిగారి యొక్కయు సమాదరణప్రోత్సాహోచితసాహాయ్యముల నీ నవలావణ్యవతీరత్నము మఱియాంధ్రగ్రంథరత్నమాల నలంక రించుచు విలసిలు చున్నది.

ఇట్లు,

విబుధవిధేయుఁడు,

సామర్తి బుచ్చిరాజు.

# విషయసూచిక

# సవరణపట్టిక

| పుట | పంక్తి | ప్రమాదము | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 11 | గోదావరీ | గోదావరి |
| 4 | 19 | నిర్మలజలములఁ | నిర్మలజలముల |
| 13 | 10 | నారీమణులందరి | నారీమణులందఱి |
| ,, | 14 | అందరి | అందఱి |
| ,, | 17 | అందరు | అందఱు |
| 14 | 21 | సర్వరసప్రధానం | సత్వరసప్రధానం |
| 16 | 5 | చిరంజీవి | చిరజీవి |
| 22 | 4 | తలఁపోయు | తలపోయు |
| 23 | 14 | పరమాన్నములకు | పరమాన్నము మున్నగువానికి |
| 24 | 15 | గలచదలు కెంపు | గలచదలునఁ గెంపు |
| 32 | 7 | దల్లిఁగండ్రులఁ | దల్లిదండ్రులఁ |
| 38 | 5 | సిరియాలువకు | సిరియాళునకు |
| ,, | 16 | నిర్దయ | నిర్దయా |
| 42 | 2 | దుర్గుణములవల్ల యీ | దుర్గుణము వెల్ల యీ |
| 62 | 4 | గొజ్జంగి | గొజ్జంగి |
| 63 | 18 | మనోహారిసీ | మనోహారిణీ |
| 78 | 9 | మేది ! | యేది ! |
| 112 | 2 | దెలపినను | దెలిపినను |
| 117 | 12 | బగవంతు | భగవంతు |
| 138 | 20 | పీనులజికి— | పీనులజకి— |
| 161 | 4 | మలిపిన | మలిచిన |
| 207 | 1 | కాన్యనిగ్రృప | కాన్యనికృప |
| 216 | 4 | పెదిరింపులు | బెదరింపులు |






శ్రీరస్తు.

# సన్మార్గప్రదర్శనము.

## మొదటిప్రకరణము.

### సంతానచింత.

సీ॥ సంతానరహితసంసారంబు నాయక
రత్నంబు లేనిహారంబు గాదె?
పుమపత్యదూర మానమితసామ్రాజ్యంబు
ధాత్రిఁ జంద్రుఁడు లేనిరాత్రి గాదె?
యాత్మజవ్యతిరిక్త మగువర్తనముఁ జూడ
నారి లేనిశరాసనంబు గాదె?
సుకుమారకన్యా మానకళంకజీవనం
బల మరాళము లేనికొలను గాదె?

తే॥ గీ॥ నందనవిహీన మైనసేనావితాన
మరయ శిఖరంబు లేనిగోపురము గాదె?
నేత్రపర్వంబు గావించుపుత్రుఁ డింక
మనకు నెన్నఁడు గల్గునో వనజగంధి!

(చేమకూర వేంకటపతిసారంగధర.)

శ్రీనిలయము లగుకమలములు క్రమక్రమముగఁ గళల విలసిలు చుండెను. కలువలు తలలు వంపు చుండెను. కొక్కురో కో యని హ్రస్వదీర్ఘప్లుతములఁ గుక్కుటము లొక్క టొక్కటిగఁ బెక్కు లఱచు చుండెను. దిక్కు లెల్లఁ దెలివి గాంచు చుండెను. శకుంతసంతానరవంబుల దివంబు పిక్కటిల్లు చుండెను. బాలభాస్కరుఁ డుదయగిరి నలంకరించి కిరణపరంపరలఁ దుఱఁగలించు చుండెను. జక్కవ లొక్కటిగ నక్కఱమై మక్కువతోఁ దిరుగ సరస్తీరములఁ గలిసికొనియెను. అరుణకిరణునిచిఱుకిరణముల కలరి చిఱుమీనులు మిడిసిపడు చుండెను. ప్రభాతశీతవాతపోతములఁ గలిగినచిఱుకరంపములు తెమెంపఁ దళుకు లీను చుండెను. పావనగోదావరీనదియు నాప్రభాకరు కరప్రసారమునఁ గరము మనోహరమై నిర్మలజలపూరితమై మందమందగమనమున సుందరమై యుండెను. నది కెదురుగ నరసెడమా కొన్నికొండలవరుసలు కనఁబడును. అవియ తూర్పు కనుమలు. దూరమున నుండి యారయువారి కవి గజశుండములుగఁ దోఁచు చుండు. నల్లఁగఁ గనుపట్టునవి తెల్లవాఱిన కొలఁదిఁ జెల్లఁగను వెనుకఁ బ్రభాతప్రభాకరునిప్రభల బంగారు నీరు పూసినట్లు పచ్చఁగను మెచ్చు లొలుకుచుఁ గ్రమముగ నినుముపై వెండినీరు రానించి వెండియు నద్దానిపైఁ బైఁడిపూఁత పూసి చక్కఁగఁ జికిలి చేసినట్లు ప్రకాశించు చుండెను. కాని కృత్రిమవర్ణ మెంతయోకాల ముండనట్లు ఖరకరునిగమనము

ననుసరించి యారుణ్మపృష్టిగోచరములు వెండియు వెండి
వన్నెను నీలవర్ణమును దాల్చు చుండెను. ఆగౌతమి కావల
గోవూరును నీవల రాజరాజనరేంద్రపురమును వరలుచుండెను.
గోవు నావేదనపడ నొనర్చి గడించినయావిల మడంచుకొన
గౌతముఁడు పాఱించిన నది యగుట నది గోదావరియు గౌత
మియు నాఁ బడు చుండెను. గౌతముఁడు నాఁడు గోవుఁ దును
మాడినచోటే నేఁడును గోవూరు నాఁ బడు చున్నది. నేఁటికిని
నాఁటి వేసవివాసరముల శుష్కించినగోదావరీతీరమున గోవు
పాదము లనుగుఱుతులను జనులు గనుఁగొను చుందురు. ఈవలి
గట్టున నిర్వక్రపరాక్రముఁడు వైరివీరగర్వాపహారుఁడు రాజ
నీతిపారంగతుఁడు నీతిసంతుఁడు కందర్పనిభసుందరుఁడు సర్వ
జనస్తుత్యస్వాంతుఁడు ఆంధ్రభాషాయోషాలలామ కాదిప్రియుఁడు
చంద్రవంశజుఁడు పాండుసంతతివాఁడు విష్ణువర్ధనుఁడు రాజరాజ
నరేంద్రబిరుదాంకితుఁడు కట్టెకట్టిపట్టము రాజరాజనరేంద్ర
పురము వెలసిలు చుండె. నేఁ డదియు రాజమహేంద్రవరము
రాజమంఢ్రి యనుపేరులం బిలువం బడు చున్నది.

ఇదె యీయెడ గుడారములు గనుపించు చున్నవి. దాన
దాసికలచే నవి సందడించు చున్నవి. అవి యెల్లయు నాయుధ
హస్తులగురక్షకభటులచేఁ గాపాడఁ బడు చున్నవి. వారు
పైవా రెవరును లోన కేగ కుండ నరికట్టు చున్నారు. ఆచెంతఁ
గలవింత లేమో విలోకించితివా? అచ్చో నెచ్చోటఁ గనుఁ

గొన్నను నున్న నినల్లనిగుండ్రాళ్లే! అవి యసంఖ్యాకములు. మలిచి చేసిన ట్లని పొడకట్టు చున్నను నవి నరులనిర్మాణములు కావు. లింగాకారములం గనుపట్టుట నవి యన్నియు లింగములు నాఁ బడు చున్నవి. కొంచె మించుమించుగ నవి కోటి యని ప్రసిద్ధి. కావుననే యిది కోటిలింగపుణ్యక్షేత్రంబనం బరంగు చున్నది. మజ్ఝారే! దీనిప్రభావము! ముక్తిదాయకము! కాశి కన్న మిన్న యనం దగు నీగౌతమీతీరక్షేత్రము! సమస్త నిర్మలచిత్తులకు నభీష్టసిద్ధి యొసఁగుచు నన సందేహమా! అఖిల కలికల్మషాపహరము. ఆకారణముననె యీయెడఁ బావన గోదావరి స్నాన మొనరించి శుచులై పుష్పపత్రముల ధూపదీప నైవేద్యములఁ జందనతాంబూలముల నారికేళహారతుల నర్పించి కంబువులం బోలుకంఠంబుల శంభో! యని యఱచుచుఁ గొన్నిరే లయ్యెడఁ గడపుచుఁ దమమనఃకోర్కె లీడేర్చుకొని నడచెద రఁట! మహాదాశ్చర్యము కాదే! ఏమి మహేశ్వర మహిమలు!

ఇచ్చట రక్షకభటులు చేరి నాలింగములఁ జేర నీయ కున్నారు. కారణ మేమొ కనుఁగొనుదము. అల్లదే చల్లని జలములఁ దానము లాడి తెల్లనిపట్టుబట్టలు కట్టి భూదేవశిఖామణులు మంత్రాక్షతలు తలల నిడ నిర్మలజలములఁ దోసిలిపట్టి ప్రదక్షిణపూర్వకముగఁ బ్రభాకరున కర్ఘ్య మిడు చున్నా రెవరో యిరువురుదంపతులు. వారి కావలివల ముందు వెనుక వేత్ర

హస్తులు వస్త్రశస్త్రధారులు నడుచు చున్నారు. వీ రెవో
కులీనులై యుందురు రాను రాను పరీక్షింప నాభటవర్గముల
వలువల రాజముద్రలు గుఱుతడు చున్నవి. ఆముద్రలఁ గలయక్ష
రము లిక్కడకు స్పష్టము గా కున్నను బిక్కను గుజగుజలు
వోవు చున్న యీపౌరజనులను లేమో యాలించి సంగతి
నెఱుంగుదము. ఏమి వీరుమాత్రమే మనుకొను చున్నారు.
ఎఱుక కలవా రేమో వినిపింప సాశ్చర్యులై "ఆ! రాజ
రాజ!" యనియును "నరేంద్రుఁడ!" యనియును దృష్టి
సారించు చున్నా రెఱుఁగనివారు. "ఔను రాజరాజనరేం
ద్రుఁడే" యని ప్రత్యుత్తర మిడు చున్నారు. ఔరా! వీఁడే
యాతఁడు వేంగీభూపతిలకుఁడు రాజరాజనరేంద్రుఁడా! యని
మనమును విస్మయకలితుల మగుటకు సందేహము లేదు.
ఏలయనా యాతనియాబలుపుభుజములు, సువర్ణచ్ఛాయా, సహస్ర
కిరణుఁ బురుడించుముఖవర్చస్సు, కండలు దండిగఁ గలబాహు
దండములు, రాజశ్రీపుంలు కొఱఁతవడియే యున్నవి. నెఱికురుల
మున్నింటియాసువర్ణరత్నకోటీరముగాని మెఱుగుభుజముల బాహు
పురులు గాని గళమున వ్రేలుపచ్చలపతకహారములు గాని
మఱియు నేయలంకారములు గాని లేవు. అతఁడు దివ్య దౌశ
సామాన్యపురుషునిభాతి రిక్తపాదముల నున్నాఁడు. భక్తాగ్రే
సరునిమాడ్కిఁ జూడ్కిం బడు చున్నను రాజకళ యింతయుం
బెసం బాయ కున్నాఁడు. అయ్యారే! రాజ రాజే! అతఁడ

మెక్కడ కేగు! ఆతనివామభాగమున నాతనిధర్మపత్ని యల
రారుచున్నది. సరిగంగస్నానము లాడి యున్నారు కాఁబోలు
నారాజరాజోత్తరీయమున కాయంగనామణియొక్క చీరచెఱంగు
ముడి యిడఁబడి యున్నది. రత్నహారముల నిండారి రత్న
కాంతులఁ దులకించునాయంగనామణి రత్నాంగి. చదువరీ!
యాపె సార్థకనామధేయ యని శంకింపకుము.

అనంతర మాసతీపతులు శంకరు నారాధింపఁ జనుదెంచి
విశాలమై పరిశుద్ధమై రంగవల్లులఁ దుఱంగలించుసమప్రదే
శమున నుపవిష్టు లైరి. వారియెదుటఁ గాంచనరత్నాలం
కారముల వెలుంగుచు బంగారుగంటల రంగారుచు సాంబ్రాణి
యగరు ధూపములఁ బరిమళించుచుఁ జట్టు నిడిన జోతులఁ దేజ
రిలుచు జంగమస్థావరముల వెలయు లింగరూపు నామహేశ్వరు
నడుమున నిడుకొని కలరూపున నందికేశ్వరుం డుండె. భక్తి
యుగ నారాజదంపతు లానందమున నానంది పండితాగ్రణులు
కైవారములు సేయ భూమిబృందారకులు మంత్రములు పఠింపఁ
బురంధ్రీరత్నములు మంజులస్వరముల మంగళము లాసంగం
గడుం గడుం బూజించిరి.

నందిపూజానంతర మాభార్యాభర్తలు నిర్మలచిత్తులై
నిశ్చలముగఁ బద్మాసనములు వైచి చేతులు మోడ్చి నయన
ములు మూసి భవిష్యదామోదమునకై సత్కుమారసంభవ
మునకై భగవంతునిపై భక్తి నెలకొలిపిరి. ఆహా! యేమి
వారి దగుతదేకధ్యాననిష్ఠాగరిష్ఠ!

పాపము పుత్రఫలప్రాప్తికై వారు—ఆయాశేషవిశేష సంతర్పణలు—పడినపాటులు పరిగణింప నెవరి కగు! తిరుగ రానిదేశములు తిరిగిరి. చేయ రానిపూజలు చేసిరి. అనుపమ జపతపములు సలిపిరి. ఉగ్రోపవాసముల సుక్కిరి; చిక్కిరి; సొక్కిరి; కాని యింతపర్యంతము నభీష్టసిద్ధి కాదయ్యె. ప్రభుభృత్యన్యాయానుసరణముగఁ బాపము ప్రజలును నంతగా సంతోషతరంగితాంతరంగులుగ నుండ రైరి. దివ్యస్థలములా! దేవస్థానములా! దేవాలయములా! తీర్థయాత్రలా! తిరిగి తిరిగి విసివిరి. రాజస్థానమును జేరిరి. పెరటిచెట్టు మందునకుఁ గా దనునట్లు స్వస్థానమాహాత్మ్యము నెఱుఁగ రైరి. వెనుక నేమునియనుగ్రహముననో స్వస్థలమహత్వముఁ దెలిసి యిట్లుగా మూఁడహోరాత్రములు కఠినశుష్కోపవాసములును జపతపములును బూజాపునశ్చరణములును సలుపుచుండిరి. కడచిన రేయి శివరాత్రి జరిపిరి. జాగర మొనరిచిరి.

క్రమక్రమముగ నరుణకిరణుఁడు ఖరకరుఁ డగుచు శిరము మీఁది కరుగుదెంచు చుండెను. మందేహుల మ్రందింప నా చండకరమండలుం డుగ్రుండై నడిమింట నుండెను. దారుణ తీక్ష్ణవీక్షణములు రూఢిగా నున్నయాసహస్రకిరణు నెవరును దేఱిపాఱి చూడ లేరైరి. కాలాంతకునిఁబగిది సారంగధరుని రూపునఁ బొలుచుమధ్యందినమార్తాండు నెవరు చూడంగలవారు! కనుఁగొన భయంకరుఁ డయినను నాహారునిమనము

మృదువు. బాపురే! యేమి యింతపర్యంతము ముకుళితము
లయిన యీరాజదంపతులముఖపద్మములు నేత్రకమలములు
కరకంజములు వికసితము లయినవి! "మహాప్రసాదము
స్వామీ! ధన్యోస్మి! ధన్యోస్మి! నేఁటికి మాజన్మము సాఫల్య
మయినది. మావంశ ముద్ధరింపఁ బడినది. మాకు ముక్తిమార్గ
[illegible]నది. శంభో! శంకర! అఘనాశంకర! ఓం హర!
హర! హర! హర!" యని యమందకందళితహృదయాం
తరంగు లై యానందపారవశ్యమున నాసతీపతు లూర్ధ్వముఖు
లై స్తోత్ర మొనర్ప [illegible] బడిరి. తోడ్తోన నందలిజంతువర్గ
మంతయు నకారణసంతోషపారావారమున నోలలాడెను.
ఆమోఘకారణమునఁ బ్రజల నడుమ నుండి జయజయధ్వనులు
చెలరేగెను. ఆప్రజానికవీచికలు కొంతపర్యంత మష్టకోణములఁ
గాంచి వైచెను. వారి నారసి వీరు వీరి నారసి వారు హాసన్న
ముఖు లై జయజయధ్వను లొనరించిరే కాని నిజమైనకారణ
మెరుఁగ నేరరు.

చీకటి నుండి యొక్కపరి వెలుతురునకును వెలుతురు
నుండి యొక్కపరిఁ జీకటికిని వచ్చువారి రీతి తెలియఁగ రనునట్లె
[illegible]కష్టము లోర్చి సమస్తద్వంద్వముల సమతఁ బరిశీలించియు
మనోరథ మీడేరక సంతతదుఃఖాంధకారనిమగ్ను లయినవా
రేలాఁగో యిపుడు యాదృచ్ఛికముగఁ బులకరించినయొడళ్లతో
ధర నారఁగిరి. ఆఁకలిదప్పులకుఁ గలఁగి నలిగి సొమ్మసిల లే తను

కొన వారియొక్క భక్తిరసపూరితము లగునట్టులును ప్రఫుల్లాననములును దార్క్షణములు.

తత్క్షణమే సేద దేరినయాభార్యాభర్తల నమాత్యశిఖామణు లుదంతము సాంతముగ నెఱుఁగఁ బఱుప వేఁడిరి. నావుఁడాభూవిభుఁడు "సచివాగ్రిణులారా! నేఁటికి మాదురంతసంతాపమున కంత మలవడినది. ఈదినమే సుదినము. నేఁడు చింతాసాగరాంతరము నుండి యుద్ధరింపఁ బడితిమి. మాయొనరిచిన పూజల కలరి హరుఁడు నేఁడు వర మొసఁగెను. వరతనయు ననుగ్రహించెను. తమ భక్తుల మము పరిపాలించెను. ఆపుట్టు పట్టికిఁ దనదగు పావననామము పెట్టు మని యాజ్ఞాపించెను. తనపరిపూర్ణకరుణాకటాక్షముల నతఁడు వృద్ధి గాంచు నని వచించెను. దీవించెను. ఇఁక మనము మహజనసగ [illegible] మనియెను. చిత్త మని యామాత్యశ్రేష్ఠులును వార్షచిత్తులై యాటపాటలతో వాద్యవిశేషములతో వేడుకె మెయి వీడునకుఁ దరలిరి.

## రెండవ ప్రకరణము.

---

### కుమారసంభవము.

మ॥ జిలుగుంబల్కులు విన్నఁ జిన్నిగొనబుం జెయ్వుల్ గనుంగొన్న నాఁ
దల మూర్కొన్నను ముద్దుగొన్నఁ దనువుం దార్కొన్న నూహింపఁగాఁ
బలుకన్ రానిసుఖంబుఁ జెందు నటుగాఁ బంచేంద్రియోత్సాహమై
తలిదండ్రుల్ విలసిల్లఁగాఁ దనయుఁ డేతత్పాత్రుఁడై యున్నఁగన్.

( చేమకూర వేంకటపతి సారంగధర. )

బాపురే! యీపురరామణీయకము! కలుములచెలికిఁ గాఁపురమై యలకాపుర మనఁ దులకింపుచుండె. మిక్కిలి చక్కనిపేటలు; సన్నని తిన్నని బాటలు; ఎత్తుగ నెత్తినగోడలు; గగనమున కెగసిన మేడలు; నందనవనముం గేరు వనములు; ఇందిరావాసములై కడుం గడుసుందరములై యున్న భవనములు; ఎచ్చో నారసినఁ బచ్చనితోరణములే! నగర మెల్లయు మిగుల సొగసుగ నలంకరింపఁ బడి యున్నది. అది యేమి! రాజవీధి మంగళతూర్యరవములు చెలంగుచున్నవి! తెరు వంతయుఁ బ్రజలచేఁ గిక్కిరిసి యున్నది! చీమ చొర సందు లేదు. ఎవరు వీరందఱు! అందఱు వేదవిదులే! సుశుద్ధశ్రోత్రియు లెల్లరి కెల్లకో యుల్లములు పల్లవిల్ల నుల్లాసభరితులై పెల్లుగ నుప్పతిల్లుచున్నారు. గుంపులు గుంపులుగఁ జేరి "దాతృత్వమున కాయన కెన యెవరు! మహారాజు! మహానుభావుఁడు! ఆయన కడుపు ఫలించుట మనకోర్కులు ఫలించినవి. పదులు తెక్క

గొన్నమానకు నూఱులువరహాలు చేఁ జిక్కినవి. బారసాల మహోత్సవము బాగుగ జరిగినది. బిడ్డఁ డేమిబిడ్డఁడు! ఏకం దును లేనికందు. కానక కానక కన్నందులకుఁ గఱవు దీరఁ గలిగినాఁడు. సారంగధరనామము సార్థకము. ఆచిన్నముద్దు మొగము, కస్తూరిబొట్టు గలిగి కళలఁ దొలుకాడు నాచిఱు మొగము, సారంగధరు జ్ఞప్తికిఁదెచ్చునుగాదే! ఈపవిత్రాకళం కచంద్రవంశ మీసారంగధరునిచే స్థిరయశమున నాచంద్రా ర్కము వరలుఁ గాక! ఇట్లే సకలశుభావహకార్యముల నీసా లము వాసి గాంచుఁ గాక!" యనుకొనుచు నె తమతమ నెలవుల కరుగు చుండిరి. ఆహాహా! చదువరీ! ఆరాజరాజనరేంద్రునకుఁ జాలఁగాలమునకు నేఁటికిఁ జిన్నకొమరుఁ డుదయించె నఁట! సారంగధరుఁడే యఁట! కాదు కాదు నుదుటఁ దిలకము దిద్ద కున్న నాముద్దుపాపనిచిఱుమొగమున కాసారంగధరుఁ డుద్ది కాఁ డఁట! మనము నవశ్యముఁ జూడ నగుఁ గాదే! అదుగో నా బుడుతఁ డరయుఁడు. ఏమి కనుఁగొను చున్నావా సోము నెక్క నెక్క మాడునామోముగోముఁ, గొదమతేఁటికదుపులమద మణఁచునీలాలకలను, గలువలఁ దలలు వంపఁ జేయువిశాలనయ నములను, లేతకెంపువన్నె వలెఁ బొలుచుపాలబుగ్గలను, దీరిచి చేసినస్వర్ణకలశము నా నొప్పు బొజ్జను, మొలచిన ట్టున్నయవ యవములను? ఎంతో జాగ్రత్తతోఁ బోఁతపోసి ప్రాణము పోసిన బంగరుబొమ్మ యేమొ! జీవకళ గలచిత్తరువో! కాదు సారంగ

ధరుఁడే. అయ్యారే! జ్యోతి నుండి జ్యోతి యుద్భవించునట్లు శాదరాజనరేంద్రున కీయువరా జవతరించినాఁడు. భళిరే! యీనెలబాలుఁ డిప్పు డుయ్యాల నిద్రింపు చున్నాఁడు. నిద్రయో! యోగనిద్రయో! అంతలోన సెలవులు వాఱఁ గిలకిల నగు చున్నాఁడు. అంతలోన మొగము చిట్లించి వగచు చున్నాఁడు. ఏమి వానిచేష్టలు! ఆయానందతేజోమయు నవలోకించి యా నందనుఁ డానందపడు చున్నాఁడా! ఆమాయావి మఱుఁగుపడుట విచారించు చున్నాఁడా! ఏమో యెవరును నెఱుఁగఁ బలుకఁ జాలరు. అదుగోఁ గెందామరలం గేరుపాదాంగుష్ఠముం గెంగేలఁ బట్టి నోటఁ బెట్టి చివ్వున నెట్లు చీఁకు చున్నాఁడో! దాని మాని చేతిబొటనవ్రేలిఁ జీఁకు చున్నాఁడు. పసివారల కంగుళమున నమృత ముండు నంటారు నిజమా! ఆహా! పాలకడలి సుతుఁ డమృతకరుఁడె కాఁడే! జోలలు పాడి జోకొట్టి కొంతకాల మైనఁ గా లేదే యిప్పుడే లేచి కోకిలలు చీకాకుపడఁ గలకంఠ ములు కలఁగుఁదు పడఁ గేక లిడు చున్నాఁ డేమి చెప్పుమా! పాపము పాలు ద్రావుటకుఁ గాఁ బోలు! ఔ నందులకే. బొజ్జ వెలితి యయినది. పరుండి యుండిన పైఁడితొట్టి డోలాయమా నముగాఁ జిన్నికాళ్ళేతులఁ గొట్టి యల్లరి సాపింపు చున్నాఁడు. దగ్గర నెవ్వరును లే రేమి! లే రేమి. అనయము నయనపక్ష్ము ములవలె దాసిక లేమఱక యామహారాజకుమారుఁ గాచియే యున్నారు. పిల్లఁ డేడువ నుల్లము తల్లడిల్లఁ దల్లిరత్నాంగి

బుడిబుడి "నాతండ్రి! నానాయన! నాపెన్నిధానమ! రార రార" యనుచుఁ జేతు లల్లనఁ జాఁచి మెల్లఁగ నెత్తి యొడి నిడుకొన్నది. ఔరా మాతృప్రేమ! ఏమి భగవద్విలాసము! కన్నతల్లిఁ గన్నుఁలఁ గనఁగనె యాతనయుఁడు నేఁడు పుడిగినాఁడు. పాలు త్రాగినాఁడు. ప్రక్క నున్నవారిఁ బరికించి పకపక నగు చున్నాఁడు. అఁ—ఊఁ—యనుచు నదిరించి బెదరించు చున్నాఁడు. దా దా యనుచుఁ జప్పట్లు చఱచుచుఁ జేతులు చాఁచు వెలుల కాశ గొలుపుచు నె జనని బిగ్గఱఁ బట్టు చున్నాఁడు. మందిర మంతయు నాపసిపాపనియాటచే సుందరం బగు యుండె. అ దేమియాశ్చర్యమో యాకుమారుం డానారీమణులందరియెడఁ దల్లియందుఁ బోలె సమభావమునె వహించి యున్నాఁడు. చిఱు గజ్జెలు గల్లుగల్లురనఁ జిన్నిమొగము తల్లుతల్లుమనఁ గుల్లుచుఁ బ్రాఁకుచు నొక్కొక్కప్పుడును దప్పటడుగు లిడుచుఁ బడుచు లేచుచు మఱియొక్కప్పుడును మసలు చున్నాఁడు. అందఱకెం దమ్ముల నందమ్ము వహింపు చున్నాఁడు. తొక్కుపలుకులఁ జలించు నారాకుమారుని తోరంపుకెమ్మోవి నూత్రాఋలు ముద్దులు గొననిముద్దియ లందు లేరు లేరు. అందరు నానందాబ్ధి నోలలాడు చున్నారు. అహాహా! సంతతి గలగృహము సం తోషాతిశయమునకు నిలయ మని వేర నొక్కి వక్కాణింప వలయునా! ఇంతపర్యంత మశేషవిశేషభూషణముల నలరియు నందము వహింపని యామందిర మిప్పు డాసచ్చిదానందమయ

స్వరూపుం డగునందనునికతమున జీవకళ గలిగి విలసిల్లు చుండె. సారంగధరునిసమక్షమునఁ బ్రకాశమానము కానిపదార్థ మెం దుండునా!

మొలమువ్వలు చలియింప ముంగురు లల్లలాడ ముసి ముసినగవులు పెచ్చు పెరుఁగ ముద్దుముచ్చటలు నెరపుచు మృదు వై మనోహర మై నేత్రానందకర మై యొప్పు మెకమాలున రత్నకంబళమునఁ దళుకు లీనునానూనుని శైశవక్రీడ వర్ణింపఁ దరమా! జిలిబిలిపలుకులు పలుకుచుఁ జిఱుచేతులు చఱచి చప్పటులు గొట్టుచుఁ జిఱుగజ్జియలు మ్రోయఁ దప్పటడుగు లిడుచుఁ బడఁ బోవుతఱిఁ గరపల్లవము లందు నిచ్చురమణీమణిపై నొరగుచుఁ దనతల్లిచీరచెఱంగు ముద్దుమొగమునకు మఱుంగిడి తొంగి తొంగి చూచి దూబూచి యనం గికాగిక నగుచుఁ దల్లి వెనుక కరిగి డాఁగుడుమ్రూఁత లాడుచు నడుమనడుమఁ బాలు గ్రోలుచు నెడతెగనిముదమున నాబుడుతఁ డుబుసుపుచ్చు చుండె. ఆసారంగధరోదయమున నాసంసారసాగరము పెల్లుబ్బి వెల్లివిరి యు చుండెను. దిగంబరి యై నిజతేజంబున దిక్కులు వెలిఁగిం పుచు సదానందంబున డంబు మీఱునాతని నాసారంగధరు నెన్న నన్నిలింపులును జాలరు.

కొలకొలఁ గూయుచుఁ బక్కిగుములు కులాయములకుఁ బలాయనము లగు చుండె. లోకబాంధవుఁడు సిందూరతిల కంబు చందంబున నందంబు వహించి సత్వరసపరిధానుం డయి

యుండె. అంబరంబునఁ గుంకుమం బిడి యాఱఁ బైచినచందంబున నంబరం బెల్ల సంజకెంజాయలచే నందం బయి యుండె. మం దేవాలయములోఁ బోరి ఘోర వారి ప్రమందించి రక్తసిక్తుఁ డయినదిన మణి దేహ మెల్లఁ బరిశుభ్రము కాఁ బశ్చిమాంబురాశిఁ గ్రుంకు చుండెను. ప్రదోష వేళ నీశ్వరునకుఁ బుష్పఫలపత్రము లర్పిం చినఁ దమదోషములు తొలంగు నని మనీషులు పూజించుటఁ గాఁ బోలు నీశ్వరదేవాలయములలోనిగంట లెల్లఁ గంగు కంగు మని మ్రోయు చుండెను. "జయ! మహాదేవ! శంభో! హర! హర! హర! హర!" యనుపదములతో దేవాల యాంతర్భాగములును మాఱుమ్రోఁగు చుండెను. మందా నిలుండు పగ లంతయుఁ బనిపాటుల నలసి సొలసి విరామమున కరుగుదెంచుపురుషులఘర్మబిందువుల హరియించుచు సార్థక గంధవహానామమున జరియించు చుండెను. ఆలమందలతో గోపాలబాలకు లానందనందనుని బాడుచు నాడుచు నమందా నందకందళితహృదయారవిందు లై మందిరముల కరుగుచుండిరి. కుముదములు ముద మందు చుండెను. కోకములు వికావిక లగు చుండెను. సారంగములు బారులు తీరి పాఱు చుండెను. శీఘ్ర లరుగఁ జిన్నవోయినమాడ్కి బ్రహ్మాండ మంతయుఁ జీకటులు గ్రమ్ముచుండ నిశ్శబ్ద మగు చుండెను. ధూమరాజి గేముల నుండి వెలువడు చుండెను. గౌతమీతీరమున సంధ్యావందనధురంధరు లై విప్రవరులు పొలుచు చుండిరి. జారచోరులకోరిక లూరు చుండెను.

పిల్లలతల్లులు తమపిల్లలఁ గాళ్లపైఁ బరుండఁ బెట్టుకొని యుగ్గుఁ బెట్టి పా లిచ్చుచుం గన్నుంగవం గాటుకయు నుదుట మృగమదతిలకమును దృష్టిదోషము దగులకుండ దిద్ది లాలిఁ బెట్టి జోలలు పాడుచు జోకొట్టు చుండిరి. అంతయు కాక యా పరంజ్యోతివరప్రసాదమునం జిరంజీవి యగుచుం జిరతరయశము గడింపుము నన్నుఁ గన్నయన్న! నాచిన్ననాన్న! యనుచు జ్యోతులు వెలిఁగించి దృష్టి దీసి వీధివేదులపైఁ బెట్టు చుండిరి.

సాయంసమయ మగుడు గృహములకుఁ బనిపాటులు నుండి మగిడినగృహస్థులు తమతమకొమరులఁ గొమరారఁ నెత్తి బింబితము లగు చున్నచిన్నిబుగ్గలు చుంబించి చుంబించి యటు నిటుఁ బచారించు చుండిరి. కొందఱు సతిపతులు తమసుతులతో ముద్దుముచ్చటలు నెరపుచు డాబాలపై సంచరించు చుండిరి.

బాల్యకౌమారదశలు గడువ యౌవనమధ్యమున హరుని వరమునఁ దనకుఁ బొడమినబుడుతని జేతుల నిడుకొని యొడయుఁడు రాజరాజనరేంద్రుడును సతీసంయుక్తముగ సాలోపరిభాగమున సంబరంబునం బరిఢవిల్లు చుండెను. ఆశ లెల్లయు ముప్పిరిగొన నతనిపై నునిచి యతికుతుకమున నలరునాయువనీపురందరుని నెన్నఁగఁ బన్నగేశ్వరునకును వశము గాదు. జాంబూనదంబుడంబు మీఱునాసుకుమారకుమారుని మేనిపై నీఁగదైన వాలకుండ నల్లారుముద్దుగ వృద్ధి గావింపు చుండిరి.

ఆచిఱుతయు జనకుని మెడ నున్న సువర్ణరత్నహారముల నొడిసిపట్టి లాగుచు బుగ్గలు పులుముచుఁ బులుకుపులుకునఁ జూచుచు మీసములు పట్టి లాగుచు రెండుచేతుల గుండెను వీఁపును దట్టుచు మఱియుఁ బలువిధముల బాల్యవికారచేష్టలు సలుపుచుఁ గులుకు చుండెను. జనకునికడ నుండి యమ్మ! యమ్మ! యని జననికడకును జననికడ నుండి యయ్య! యయ్య! యని జనకునికడకును నిట్టుఁగ నిరువురిసందునం దిరుగుచుఁ బక్షపాతము లేక తల్లిదండ్రులకుఁ బరమసంతోషము నొనఁ గూర్చు చుండెను. అప్పు డప్పుడు మారాము సేయు చుండెడివాఁడు; కాని వారి కేమిలోటు! కావుననే కోరిన వెల్ల నిచ్చుచు నూర కుండఁ బెట్టువారు. క్రిందఁ బెట్టినఁ గిసలయకోమలాంఘ్రులు కందు నని యూకందు నత్యంతమృదుసూర్యపటములం దక్క నెందునుం దింపుటయే లేదు. ఎప్పుడును దల్లిదండ్రులయొడిలోను బోరుకాడింపుచు రంగారుబంగారుతూఁగుటుయ్యెల నుంచి బాగుగ జోకొట్టి జోలలు పాడుచు నిద్రపుచ్చుదాదులయొడిలోను మృదుమధురగీతములు వెలయఁ జేతులు తట్టుచు నాట లాడించుచుం బెంచిరి. దినదినప్రవర్ధమానుఁడై యాపాప యొకయేఁడు గడచునప్పటికి మెల్లమెల్లగఁ బ్రాఁకెడు వాఁడయ్యెను. [illegible]

లెట్టుచు నడుచుచు నడుచువాఁడు కిశాకిక నగుచు నగించుచుఁ గేరించి డాఁగుడుమూఁత లాడుచు గంతు లిడుచు గంతు లిడు వాఁడు తన యీడువారితోడఁ గూడి యాడుచుఁ బాడుచు నున్నవాఁడు. ఇట్లు క్రమక్రమముగ జౌలోపనయనాదిసత్కర్మలువడసి సద్గురులయొద్దశాస్త్రాభ్యాసము లొనరింపుచుండెను.

ఇవ్విధముననె రాజరాజనరేంద్రప్రధానామాత్యపుత్రుఁడు సుబుద్ధియుఁ బెరిఁగి పెద్దయై విద్దెలకై సారంగధరునకు బోధించు గురులయొద్దనే శిక్ష వడయు చుండెను. ఆకారణమువనె చిన్ననాఁట నుండియు నిర్మలహృదయు లగువారిచెలికార మింతయై యింతింతయై మఱింతయై మఱిమఱి యింతయై గాటముగ నలము కొని తుదకు దేహంబులు రెండు భావంబు లొక్కటి యనం బొడకట్టెను. గడియతడ వతఁ డితని విడిచియు నితఁ డతని విడిచియుఁ గడుపఁ జాలరైరి. ఒక్కకంచమున భుజించి యొక్కమంచమున శయనించి రన వచ్చు. సాముగరిడీల నారితేఱుచు సకలశాస్త్రసంపన్నత వహింపుచు సిరికొమరుకొమరు హసింపుచు ధర్మమార్గావలంబనులై భూతదయాపరులై ప్రజలకందఱకానందంబుఁ బెంచుచు దినదినప్రవర్ధమానులై శుక్లపక్షక్షపాకరుని సొడ్డుపెట్టుచు శివకేశవులమాడ్కి నరనారాయణులపోల్కి నశ్వినులభాతిఁ గవలరీతి వెలయు చుండిరి.

# మూఁడవ ప్రకరణము.

## కాంతాన్వేషణము.

సంతతి పొడముపర్యంత మొకచింత ; కలిగిన వెనుక నే యిడుములఁ బడ కుండఁ గడుఁగడుగారాబమునఁ గాంచుట రెండవచింత ; కాంచినపిదపఁ దగుగురునొద్దఁ గులాచారప్రకారము విద్యాభ్యాసము లలవరించుట మూఁడవచింత ; యలవరించినంత నీడు జోడై నిష్కళంకమై స్తోత్రపాత్రమై వరలువరబాంధవ్యాన్వేషణమునకై నాల్గవచింత; తరువాత నాసతీపతులయన్యోన్యానురాగమును సంతోషజీవనమును గూర్చి యైదవచింత. గృహస్థాశ్రమము పూనినవారెల్ల రథమ మీయైదుచింతల ననుభవింప వలసినవారే. వీని నైదుచింత లనుటకన్న నైదగ్ను లనుట మంచిది. ఔను వాస్తవముగ నవి పంచాగ్నులే. గృహస్థ పంచాగ్నులనడుమఁ దపోధనునిమాడ్కిఁ గ్రాఁగి క్రాఁగి విడివడ వలయును.

సంతానవంతు లగుసతీపతుల సుతులఁ గలవారికన్న సుశీలఁ గలవారిసంతాన మధికము. పలుగుతనము పట్టుపడకుండ నిలుకడఁ గలవారిచెలిమి గలిగి తగువిద్దెల నియమితకాలమునఁ గడతేర్చి గృహకృత్యముల నిష్ణమై, జ్ఞానవతి మానవతి యయి పుట్టినింటికి మెట్టినింటికి వన్నె దెచ్చుకన్నెలఁ బెం

చుట కష్టకార్యము కాదే! వివాహిత లయిన వెనుకను సారె చీరల లోప మింతయు లేకుండ సారెసారెకు నారయుచునె యుండ వలయును. కాలము గడచినను స్త్రీలకుఁ బుట్టినింటిపై నాస వీసమ్ముఁ దగ్గదు. స్త్రీజాతి కది సహజము.

వర్ణధర్మముల ననుసరించి యౌవనాంకురముననో యౌవన మంకురించిన యనతికాలముననో పురోభివృద్ధికై సాంప్రదాయ ముల బాగుగఁ జర్చించి మఱియుఁ గరగ్రహణ మొనరుపవలెను. కాలాతిక్రమణము కాఁగూడదు. అతిక్రమించినఁ గుఁ మ చెడును. అపవాదులు పడును. నలుగురలోఁ దలవంపు లగును. వెనుక గొయ్యి ముందు నుయ్యి. అసిధారావ్రతము. అయిదు చింతల నత్యధిక మిది. ఆహేతువుననె భూరిసారగౌరవములఁ గొరువారు—భార్యాభర్తలు—తద్విషయమున నిద్రాహార ములు పూర్ణముగ లేక చిక్కి సగమై జీవచ్ఛవంబులు నా నుం దురు. ఎన్ని యున్న నేమి?

వివాహవిషయ మేమి సామాన్యమా! కులముఁ దలఁప వలయు, నకళంకమై యుండవలయు; నీ రెండునుం గలిగినఁ గలుములు గలుగవలయు; నీమూఁడునుం గలిగిన సాంప్రదా యము మంచిదై యుండవలయు; నీనాలుగునుం గలిగినఁ జూపరు లయియుండవలయు; జూపరులై యుండిన సుగుణంబు లుండ వలయు; సుగుణంబు లున్నఁ బూర్ణాయురారోగ్యవంతులు గా వలయు; నీయేడునుం గలిగిన నీడు జోడై యుండవలయు;

నీడు జోడై యుండిన నన్యోన్యానురాగ ముండవలయు; నన్యో
న్యానురాగ మున్న వారికిం గలచుట్టములు మేలువారలై యుండ
వలయు. ఈపదియుం గలిసివచ్చిన వారిపదిపదుల్లు—శతసంవ
త్సరములు—చక్కఁగ జరుగునని మఱి వ్రాయ వలయునా!
కనకహారముల పుణులు పొదిగిన ట్లుండు. కాని యదేమియో
యాకమలభవుఁడు నూటనాట నొక్కంటఁ గాక యివి యన్నియు
గుదిఁ గూర్పఁడు. కావుననే కాకిముక్కునకు దొండపండు
గట్టిన ట్లున్నవి మిథునవిశేషములు.

ఘూర్జరదేశము హిందూదేశమునకు వాయవ్యమూల
నున్నది. అది ఫలవంతమై,పాడిపంటల నోలలాడుచు శ్రీకరమై
సురతరులకును బుధకుఁదొడుకులకును నెనయయినవరతరులకును
దొడ్డగిడ్డులకును నాకరమై సన్మార్గవర్తనులఁ గ్రిక్కిఱిసి మిగుల
సొగ సగునగరములఁ జక్కనై కోటలఁ జేటల నాటలఁ బాటల
బాటలమనోహరమై నిర్మలజలపూరితము లగువాపీకూపనదీన
దతటాకాదులకుఁ గాఁపురమై శుకపికకలరవములకలరవములఁ
గలకలమై భూమండలమునకు మండన మనఁ బరఁగుచుండె.

అద్దాని ధవళచంద్రుండు పరిపాలించుచు నుండెను.
ఆతండు శాంతుండును నీతివంతుండును నుదాత్తుండును నప్ర
మత్తుండును మేరుధీరుండును మారాకారుండును యావనమధ్య
స్థుండును నయి యుండెను. ఆధరణీపురందరునకు లేక లేక
పెక్కేండ్ల కొక్కతనయ జనియించెను. ఆపె తారసారుఁ గేడు

చుండెను. యౌవనప్రాదుర్భావమున నలరారు చుండెను. కన్య;
కావున భూవరుండు చింతానిమగ్నుం డయి యుండెను. చిం
తల నెల్ల నెక్కు డిదియ యని నే నిదివఱకె వ్రాసితి. వరకాం
తాన్వేషణమునకై పెక్కులు తలపోయు చుండెను. దివ్యో
పాయ మొక్కటి తోఁచెను. తోడ్తోఁ దనయానుఁగుఁదనయను
జాయను రావించెను. తనభావం బెఱిఁగించెను. వారియనుమతి
గ్రహించెను. కనకగాత్రియుఁ గమలనేత్రయుఁ గంబుకంధరయు
బింబాధరయు బిసరుహపాణియు నసితవేణియు నగుతనపుత్రి
చిత్రాంగిరూపముఁ బటములఁ జిత్రింపించి యాఁతీఱినవారలును
నిష్ఠాగరిష్ఠులును వేదవిదులును బలుకులవెలఁది గెలువఁ దగు
పలుకు లాడువారును శాస్త్రపారంగతులును నగుబ్రాహ్మణుల
రావించి తనమతము వెల్లడించి పటముల నందించి "ధారుణీ
బృందారకులారా! నామనోరథము మీవలన నీడేర వలయు.
నాయుఁజడి వాఁరించి సత్వరముఁ దగువరు విచారించి వివాహంబు
గావించి వంశపారంపర్యము వచ్చుచున్న నామర్యాద నిలువ
రించుటకు మీరు గాక యెవరున్నారు!" అని వచించెను.

అంత నాధారుణీరమణునికోరికప్రకార మాసారధరామ
రేంద్రులును ధవళవస్త్రధారులై మంగళతూర్యరవములు
చెలఁగ నందలము లారోహించి వందిమాగధులు కైవారములు
సేయ నోంకారరవములు మాఱుమ్రోయ నూరుమేర దాఁటిరి.
ఊరిలోనివారును గుంపులుగుంపులుగఁ జేరి మనరాకుమారికి

వరవరు సమకూర్పనిపాటులు చేయుచున్నారఁట యని సాశ్చ
ర్యులై యూరయుచున్నారు. పొలిమేర మీఱినవెనుక నాయం
దళిముల నున్నఛాందసులు "శామశాస్త్రీ! సోమశాస్త్రీ!
వీరన్నశాస్త్రీ! పేరన్నశాస్త్రీ! సుబ్బావధానీ! వెంకావధానీ!
ఈకార్యమునఁ గృతార్థులమైతిమా వరవరుఁ గనుఁగొంటిమా
భూవరుఁడు మనకు వరహాలు కుప్పలు గురిపించఁడే! మనమం
దిరములు సుందరములై యిందిరారమణితోడఁ జిందులాడు
చుండవే!" యనుచు నొకరి కొకరు వినుచు చుండిరి. దిద్దేశ
ములు తిరుగుచుండిరి. రాజన్యమూర్ధన్యులమన్ననలు గొని
రాజపుత్రిచిత్రఫలకములకు రాజపుత్రులరూపపటములు మా
ఱ్ఱాలు గొనుచుండిరి. ఆచారప్రకారము కాపదోవతులును
సరిగంచుదువ్వాలువలును జరతారుపంచెలును బట్టుబట్టలును నం
దుకొనుచుండిరి. వడియమప్పడము పప్పుదప్పళము మఱియుఁ
బంచభక్ష్యపరమాన్నములకు లోపము లేదు కదా! ప్రజల
ముఖముల నాయాయువరాజులగుణగణములు విద్యావిశేషము
లు చమత్కారముగ గ్రహియించుచుండిరి. కని వినినసంగ
తుల నెల్ల నాకొమ్మ తెలియునటులు వ్రాసి చిత్రఫలకమ్ముల
కంటించి యుంచిరి. తిరుగుమొగమై చనుదెంచిరి. ధవళచం
ద్రునిమన్ననలు వడసిరి. తెచ్చినరాజులపటములనెల్ల నిచ్చిరి.
ప్రయాణప్రకారములు ప్రసంగించిరి. బహుమానములఁ బ్రశం
సించిరి.

గభీరనీరపూరితమై తుంగభంగతరంగములం గడుం గడుం గమనీయమై పావనగోదావరినది ప్రవహించు చుండె. కోకిలలు మాకులనుండి కో కో కో యనుచుఁ గూక లిడు చుండె. రాయంచలు నిర్మలగోదావరీవీచికలఁ దోఁగాడుచుండె. జలపక్షు లప్పుడప్పుడు తల లగుపఱచి మునుఁగుచుండె. బేడిసలు మిడిసి పడుచుండె. నడుమ నడుమఁ గలపులినములు తళుకు లీనుచుండె. చల్లనిమెల్లనికమ్మతెమ్మెరలు జలములనుండి చను దెంచుచుండె. తీక్ష్ణరూక్షణవీక్షణములు ప్రసరింప మాని ఖర కరుఁ డరుణకిరణుఁడై యుండె. సత్త్వరసప్రధానుండై సాయం సమయమున విష్ణురూపు ధరించు ననుటకుఁ దార్కాణముగ విష్ణుచక్రమురీతి, శక్రుఁడు నిర్వక్రపరాక్రమమునఁ బడమటి కొండతెక్కలఁ గూల్చి పశ్చిమవారాశి శుభ్రపఱుప నున్న వజ్రా యుధముభాతిఁ, బ్రభాకరుఁడు పఱఁగు చుండెను. గోదావరి కడ్డముగ నున్నట్టు లుత్తరదిశఁ బొడకట్టుగుట్టలు నిప్పులు గ్రక్క నలమినరీతి వానిపైఁ గలచదలు కెంపువన్నెఁ బొదలు చుండెను. విశ్వేశ్వరాలయములోని జేగంటలు బాగుగ మ్రోఁగు చుండెను. విశ్రాంతికై పురజనులు గౌతమీతీరమున నడచు చుండిరి.

రాకాసుధాకరుఁ గేరుమోములును గైరవములసౌరు మీఱుకన్నులును నిందిందిరములయందమును హసించునూ నూఁగుమీసములును నాజానబాహువులును గలిగి వెలగలరత

నములు వెలుఁగుభూషణములు ధరించి శిరముల హురుముంజి ముత్తెముల రంజిల్లెడునోరగుపాగలు మెఱయఁ జలువపలువలు దాలిచి హారాంబట్టుదట్టీలఁ బెట్టినకటారిపసిఁడిపిడులు మిగుల వెలుఁగ నేకాంతముగ నిరువురు యౌవనులు కోటిలింగపుణ్యక్షేత్రప్రాంతమున విజనప్రదేశమున నొకచో నుపవిష్టులై యుండిరి. ఒకఁ డీదిగువ వ్రాసినట్లు తనతలఁపుల వెలువడింప రెండవవాఁడు సమాధాన మిచ్చుచుండెను.

ప్రథముఁడు:—మిత్రమా! మాతండ్రిగారు నాయూపపటము వ్రాయించి ఘూర్జరమునుండి వచ్చినబాఁపల కిచ్చి యాభూపుని కడ కనిపినారఁట!

ద్వితీయుఁడు:—ఔను సుహృద్వరా! నవయౌవనమునఁ దాలుకాముని న్నాసర్వాంగసుందరి వరియించు నేమొ!

ప్రథముఁడు:—వరియించుటా! నెచ్చెలీ! కరగ్రహణమా! అయ్యో! నే నొల్ల. పరరమణీమణులతోఁ బాటుగ నామెయు నామాతయే—

ద్వితీ:—శివశివా! ఏ మిట్లు పలికెదు రాజపుత్రా!

ప్రథ:—అమాత్యాపత్యా! ఎన్నిట నెన్నినను బ్రహ్మచర్యమే యుత్తమోత్తమము. నిశ్చింతమైన సంతతుఁ జింతింపుచు జననీజనకుల సేవింపుచు నార్యవర్యులఁ బూజింపుచు శేముషీధురంధరులతోఁ బ్రసంగింపుచు నిహపరములు సుఖింప నిదియ తగు నాశ్రమము. పరమేశ్వరస్మరణము నేమఱి పామరత్వమునఁ

బడి సంసారపారావారమున నీఁదులాడుచుఁ గలశతసంవత్సర
ముల నగము నిద్రతోడను బాతికపాలు బాల్యకౌమారజరా
వస్థలతోడను దక్కిననాలుగవభాగము రోగాదివిపత్తులతోడను
మాయాహేయతనూయాత్రతోడను గడపి గిట్టి పుట్టుటకే యొక
కన్యఁ బెట్టపట్టుట. జవ్వనమూ కలకాల ముండదు. కలుముల
చెలియూ నిలుకడ లేనిది. జననజరామరణములా జీవులకు
సహజములు. ఈసకలచరాచరములు ననిత్యములు. కామ
క్రోధలోభమోహమదమాత్సర్యములకు లోనయి మానవు
లీమాయావిశ్వమునఁ దగులుకొని పట్టుపురుగు తన్నుఁ దాన
చుట్టఁబెట్టుకొని మట్టుపెట్టుకొనువిధమున నా లనుచుఁ జూ లనుచు
నాది యనుచు నీది యనుచు బా గనుచు నో గనుచు సొంతవా
రనుచు వింతవా రనుచు మిత్రు లనుచు శత్రు లనుచు భ్రమలు
పడు చున్నారు. కర్మఁ గూడఁ బెట్టు చున్నారు. ముప్పుఁ
దెచ్చుకొను చున్నారు. ఇది నిజముగ స్వయంకృతాపరాధము.
గృహస్థున కన్నియుఁ జింతలే. సతి పతివ్రత గా కున్నఁ జింత;
సంపదలు గలుగ కున్నఁ జింత; సంతు లే కున్నఁ జింత; ఇ
ట్లింతయు నిరంతరచింత సంతాపింప వలయు. వీని కన్నిఁటికిఁ
గారణము పరిణయము. కావున సఖుఁడా! నే నీబ్రహ్మచర్య
మునే పాలింప నున్నాను. సత్వర మా సర్వేశ్వరసాన్నిధ్యమును
బడయఁ గోరు చున్నాను.

ద్వితీ:—హర! హర! అమంగళ మడంగుం గాత! భూపాల

బాలకా! నీవు వచించిన దెంతయు సమంజసము. ఐనను వర్ణ ధర్మములఁ బో నాడి బోడి వై జపతపములఁ గాలము గడపి మడియుట నీకుఁ దగదు. సాటిరాకన్నెమిన్న నుద్వాహమై దేవేంద్రుఁ బోలి తేజరిలుచు దుష్టశిక్షణశిష్టరక్షణ మొనరిం పుచుఁ బ్రజలఁ బ్రజలఁ బోలి పాలింపుచు ధర్మంబు నాల్గుపా దంబులు నడుపుచు సర్వజనమాన్యుండవై ధన్యుండవై యుం డుట నీకర్హము. ముక్తిమార్గమునుమాత్రము వెదకఁ గూడ దని నేను నుడువను. మంటిలో సదా మసలు చున్నను మ న్నంటని కుమ్మరపురుగులాగున గృహస్థాశ్రమమున నున్నను సంసారమునఁ దగులుకొనక యాసర్వేశ్వరుని భజింపుము. కర్మ యందుమా విత్తు ముందో చెట్టు ముందో యనునట్లు కర్మ ముందో జన్మ ముందో నేరము. అయిన నీ వనిన ట్లీభవమున నేభవము లేకుండ నరయుట మేలు. భవదంతరరిపువర్గము నణఁచి పరమాత్మస్వరూపమగు నీయంతరాత్మను బెనిచి ధర్మార్థ కామమోక్షముల నలవరచుకొనుము. నీ కిహపరముల సుఖమే యలవడును.

ప్రథ:—ఏమో సుబుద్ధీ! నా కిది యేమియుఁ బ్రియము కాక యుండె. ఈపరిణయము నాకు జరుగ కుండుఁ గాత మని నాయాశయము.

సుబు:—సారంగధరా! పలుకుపలుకునకు నేల యీయశ్లీల ములు! నీ వింకను జాలఁ బొఱఁ బడు చున్నావు.

అనునంతఁ జీఁకటిమిత్తి లోకమును హత్తుకొను చుండె. వశాలమునకు సాలముఁ జేర నాయువద్వంద్వము లేచెను. ఆలోచనాన్వితము లగుచుని యడుగులు మెల్లమెల్లన వైచెను.

మసనియరదములు నా నూతన జాతకిసలయములతోడ రసాలసాలములు క్రాలు చుండెను. పొన్నలు పోగడలు పూల తోడఁ బొలుచు చుండెను. గోరంటలు నల్లగోరంటలు చేమంతులు బంతులు అరంటు లేడాకులయారంటులు గన్నేరులు బిల్లగన్నేరులు మల్లెలు బొడ్డుమల్లెలు జాజులు విరజాజులు అందం దంచము వహించి యుండెను. ప్రొద్దుదిరుగుడులు తద్దయు మోములు వంచెను. పద్మినీపతి పడమటికొండ నలంకరించెను. అంగజు ననంగు నొనర్పఁ జిచ్చఱకంటిదేవర విప్పినమూఁడవ కన్ను నా నరుణకిరణుఁడును దాన వెలువడినశిఖశిఖ లన సంజకెంజాయలును బొలుచు చుండె. కీరశారిక లాహారము గొనుచు సారు మీఱఁ గేసు చుండెను. అది యొకప్రమదవనము. ఏ ప్రమదవనమో చదువరులు ముందుముం దెఱుఁగుదురు. ఆసుందరోద్యానవనమున సుందరు లిరువురు చంద్రశిలావేదికపైఁ గూర్చుండి యీక్రిందిరీతి సంభాషించు చుండిరి.

ప్రథమసుందరి:—ప్రియసఖి! ఈపాంచాల నేపాళ అంగ వంగ కళింగ వేంగి మున్నగు దేశభూమీశుల నెల్ల నా కీ చివర—

ద్వితీయసుందరి:—నగము నుడివి లజ్జించెద వేల బాల! సారంగధరు వరియించితివా! అతఁ డసామాన్యుఁడే! అద్వి

తీయుఁడే! అయిన సత్వర మఱిగి దేవరవారికి భవదాత్మజు వేంగి రాజు—

ప్రథ:—ఛీ! ఛీ! వదరకువే! వేంగిరాజునా నే వరించినది?

ద్వితీ:—చిడిముడిపడి బొమముడి నిడకువే చిత్రాంగీ! రాజనామము సారంగధరునకుఁ జెల్లుట సుప్రసిద్ధము నీ కెందుల కీయులుకు! మఱియు నీరూపపటము పనుపుదుము కదా! అబ్బా! రే పిట్లు కాఁపురము కడతేర్చెదవో కాని యెంత కోపమే నీకు! పెదవి కదుప నీయవు. ముందు నిట్లే పలుకు పలుకున కలుక వహించు చుందువా?

చిత్రాం:—చాలుఁ జాలు నీసరసము మనోరమా!

మనో:—జాల మేల రమ్ము రమ్ము సరగున నీవరము తెఱంగు ధరణీవరున కెఱింగించి శ్రీవేంగిమహారాజునకు శ్రీముఖము వ్రాయించి పంపించు నట్లొనర్చెదము.

ఇరువురును లేచిరి. చీరచెఱఁగులు జీరాడ సవరించు కొంచు భర్మహర్మ్యమును సమీపించిరి. లోఁ బ్రవేశించిరి.



## నాల్గవ ప్రకరణము.

---

### సుప్రబోధము.

మధ్యందినమార్తాండుఁడు క్రమక్రమముగ మంద మొందు చుండెను. మంద మొందుచు నున్నకొలంది ఖరకరునితీక్ష్ణము క్షీణించు చుండెను. వడగాడ్పులు వడి వడి నుడి వడుచు వీచు చుండెను. పౌరులా వేడిగాడుపులకు జంకి లొంకెలఁ దొఱంగ కయ యుండిరి. పట్టణమునం గలబయలులను బాలిమేరలం గలయిసుకతిన్నెలను నెండమావులు మెండుకొని యుండెను.

ఎఱ్ఱఁగఁ బూచినతురాయిచెట్లును బాడిదచెట్లును గను విందుగ వెలయు చుండెను. పనసలు పస మీఱి ఫలములతో నలరు చుండెను. ఉసిరికలు పసిమిరంగుం గలపండ్లగుత్తులతో నెనక మెసఁగి యుండెను. నూతనజాతిరసాలకిసలయములు క్రమక్రమముగ ముదిరి పచ్చఁబాఱెను. పుష్పితములయి పొలుచుచూతములు సకాలమున నామనిదొరకలయికను సఫలములయ్యెను. ఆసహకారముల నేమూల నున్నదో యాకారము కనంబడదు కాని కో! కో! కో! యనుతనపంచమస్వరమును గడుఁగడు వినం బఱపు చుండెను గలకంఠము.

మంచిగంధములు పేలిన మైనిండ నలఁది వాతాయనములు మూసి యుస్సురస్సురనుచు వీవనలు విసరు చుండిరి పుర

జనులు పెక్కండ్రు. చలివేంద్రలలోను జలువపందిళ్లలోను విశ్రమించి యుండిరి పాంథులు.

హాలికులు చండమార్తాండునితీక్ష్ణవీక్షణములకు బెదరి వదలినతమపొలముపనులఁ దిరుగఁ బ్రారంభింప సిద్ధపడు చుండిరి. యువకులు శరీరశుద్ధికై గోదావరి కఱిగి కవోష్ణనిర్మలజలముల నోల లాడు చుండిరి. ఓరఁగా మూసినతమయంగడితలుపులు వణిజులు తెఱచి తెరలు తీయు చుండిరి. వేళాకోళము లాడుచుఁ బొంగుచుఁ గేకిసలుగొట్టుచు నొకరినొకరు నెట్టుచుఁ జెట్లు పట్టుచుఁ దాఁటియాకుకట్టలను గంటములను జదరలను గొన్న బడిపిల్లలు వీదిబయల కరుగు చుండిరి. పుష్పలావికలలో మల్లె మొగ్గలు కోయువారుకొందఱు కోసినవి గ్రుచ్చువారుకొందఱు గ్రుచ్చినదండల నమ్మకమ్మునకుఁ గొని చనువారుకొందఱు నిట్లుగ నుండిరి.

రాజరాజనరేంద్రునిభర్మహర్మ్యమ్మున నొండెడ నొక సేవకుఁడు వాతాయనమ్ములకు వ్రేలఁ గట్టినపట్టివేరుతడకలపై సదా జలమ్ములు చిమ్మనగొట్టమ్మునఁ జిమ్ముచు నుండెను. మఱియొకఁడు లోపున వీవన వీచు చుండెను. ఆసుందరమందిరమున నొకమృదుతరరత్నకంబళంబునం బద్మాసనంబు వైచి నన్నపాచార్యుం డుపవిష్టుం డయి యుండెను. అయ్యాచార్యవర్యున కట్టయెదుట నరవిందముల నపహాసించుకోమలాంఘ్రులు వెనుకకు మడిచి, బిసరుహాముల నెక్కసక్కె- మాడుకరములు ముం

మనకు ముడిచి, జలజములఁ దూలకించునయనములును శతపత్ర ములఁ [illegible]రుడించుమనములును నికసింప నేకాగ్రచిత్తు లయి విశేషశ్రద్ధానుబద్ధు లయి మూరాకారులు రాజకుమారుఁడు సారంగధరుఁడును మంత్రిపుత్రుఁడు సుబుద్ధియుఁ గూర్చుండిరి. వారిరువురకు నన్నపాచార్యుఁ డీక్రిందిరీతిని సుప్రబోధ మొన రించు చుండెను.

"పుత్రులారా! యెట్టివా రయినను దల్లిదండ్రులఁ బూజించి సతము వారియాజ్ఞానువర్తు లయి సంతోషదాయకు లయి యుండుటయే కుమారులప్రథమవిధి. నవమాసములు మోసి నానాకష్టములు ననుభవించి ప్రాణగండముఁ గడచి హేయ మనుచు రోయక మలమూత్రముల నించుకయు సంచ రించకుండ శుభ్రపఱచి రే పనక మా పనక నీరాహారములు నిద్రాసౌఖ్యములు మఱచి జాలివానగల వలిపెదుకూలములఁ జేటికల భద్రపఱచి తిన్నఁగ నున్నఁగఁ దల దువ్వక పట్టుగ నెట్టన బొట్టుఁ బెట్టక గొనబుగ ననయముఁ గనులను గాటుక దిద్దక సమస్తసుఖముల నెపఁ బఱచి చీమంత చేటు వచ్చిన జగమె మునిఁగినట్లు వగచి యారోగ్యముగ నున్నఁ దదయుఁ బెద్దగ ముద్దుల నిడుచుఁ గికాకిక నవ్వింపుచు నగుచు జిలిబిలిపలుకులు పలికింపుచుఁ బలుకుచుఁ దప్పటడుగుల నడిపించుచు నడచుచుఁ జెడునడవడిఁ దొలఁగింపుచుఁ దొలఁగుచు బుద్ధివృద్ధి గావిం పుచుఁ గాంచుచు వివాహమహోత్సవము నెఱయింపుచు మెఱ

యుచు నిత్యానందదాయక మగుతావలమును జూపింపుచుం జూచుచు నమితమోదవార్ధి నోలలాడి యనయము నయనపక్షముల వలెం బరికించుమాత కానర్వేశ్వరుం డొక్కండు దక్క సమాన మెవ్వరు! దుంచు దువ్వి జడలు చుట్టి పువ్వులు పెట్టి గోజ్జంగిపన్నీట మజ్జన మాడించి యుడుపులు దొడిగి తొడవు లిడి సొగసైె బాగుగం బఱంగుసోయగపుంగన్నులం గాటుక దిద్ది నెల నేలుసలికమునం బొట్టు పెట్టి పంచభక్ష్యపరమాన్నముల బొజ్జ వెలితి లేకుండం, బాడి యాడి లాలించి వేడుకలం దేలించి యింగితమును బాలింపుచుం, దినిపించుమాత కానర్వేశ్వరుం డొక్కండు దక్క సమాన మెవ్వరు! వింతలు విశేషములు నడుగుచు వేళకు నన్నముం బెట్టుచు విధివిరామముల నెఱంగింపుచు విద్యాబుద్ధులంగఱపుచుం జిఱుపనులు చేయింపుచుం జిన్నారిపొన్నారిచిఱుతపాయపుంజిక్కులం విడం దీయుచు నవయావన సతీపతులసరసాలాపముల సాగింపుచు సంతానసంతోషముల భోగింపుచు నిహలోకసర్వసౌఖ్యముల నొడం గూర్పుచుం బరలోకమార్గము నేర్పుచుం జెంగలించుమాత కానర్వేశ్వరుం డొక్కరుండు దక్క సమాన మెవ్వరు! అట్టిమాత సుగుణ సమేత దయోపేత పూజనీయం బన నరుదే! సత్త్వాధిక్యం బగునట్టియంబ గుణకదంబ నతిక్రమించి సంచరించు టొప్పునే! అసమ యగునాతల్లిం గనికరపుపెల్లి మానినీమతల్లిం జెగడం దగునే! అంతకన్న సఫసూధమును నీచతమ మగుపని నీజగతిని

మనము కనుడుమే! తేఁకువ వేకువ లేచి ప్రాణేశ్వరుపాదపద్మములకుఁ బ్రణమిల్లి నిలుచుతల్లియొక్క సుందరపాదారవిందముల కమందానందకందళితహృదయారవిందమునం దలపోఁక బ్రముక్షనవ్యాజకరుణావిశేషమున సకల్మషహృదయమున సమితాహ్లాదమునఁ "జిరాయువు చిరాయువు పుత్రా!" యని మును ముందుం దన్ను పున్నామనరకంబు నుండి లేవ నెత్తువాని నాక్షణమ లేవ నెత్తి గాఢాలింగనమొనర్చి కడ లేనిసంతస కడలిం దేలింపుచు నశేషాశీర్వాదములుఁ వృష్టించుజనని సుగుణమణి వినుతఖని స్త్రీజనమణిఁ బ్రతిఘటించి సంచరించుట ధర్మమే! మాతృద్రోహులకు రౌరవాద్యుత్కృష్టనరకనివాసవిమోచన మెన్నండయిన నుండునే!

సీ॥ అజ్ఞాన మనియెడియంధకారముఁ బాపి
సుజ్ఞానతేజంబుఁ జూపుతరణి!
సంసారసాగరసకలకష్టంబుల
ముంచివేయక తేల్చి యుంచుతరణి!
యిష్టఫలంబుల నిచ్చుచు దారిద్ర్య
కష్టంబు లెడఁ బాపుకల్పతరువు!
భక్తియోగముఁ జెప్పి ముక్తినగరమును
డాయఁగా నడపుకడానిత్రోవ!

తే॥ గీ॥ ధైర్య మెద నెలకొలిపెడు ధైర్యలక్ష్మి!
సకలసంపద లొసఁగూర్చుసహాజలక్ష్మి!

మానసోల్లాసమును జేయుగానలక్ష్మి!
మాతకు సమాన మెవ్వరు మహి నయారె!

సీ॥ తెల వాఱ కుండఁ బ్రతిదినము వేళకు
నుగ్గును బోసి పా లొసఁగుదాది!
మలమూత్రముల నున్న తెలిబట్ట లెల్లను
నుతికి శుభ్రము చేసి యుంచుదాసి!
యారోగ్యము చెడినయావేళ మందులు
వేసి రక్షించెడి వెజ్జురాలు!
సర్వదా సర్వధా సర్వత్రయును దోడు
నీడ యై మెలఁగెడి నేస్తురాలు!

తే॥ గీ॥ సర్వసుగుణములను బల్కుశాస్త్రవేత్త!
మహివిచిత్రములను దెల్పుమంత్రవేత్త!
నిఖిలధర్మశాస్త్రములను నేర్పుగురుణి!
మాతకు సమాన మెవ్వరు మహి నయారె!

సీ॥ కొట్టిన నయినను దిట్టిన నయినను
గోపింప నేరనిగురుసుశీల!
పోషింపు చుండినఁ బోషింప కుండిన
గుట్టు వెలికిఁ దేనిగుణధురీణ!
మున్కరుం డయినను ముకోపి యయినను
సతతముఁ బ్రేమించునదయహృదయ!
ధనవంతుఁ డైనను దౌర్భాగ్యుఁ డైనను
నిముసముఁ బాయనినిర్మలాత్మ!

తే॥ గీ॥ ఘాతలను బూన నేరని పూతచరిత !
మంచిమాటలు వచియించు మంజువాణి !
యభ్యుదయమునే యాశించు నార్యసదృశ !
మాతకు సమాన మెవ్వరు మహి నయారె !
( ఇవి మద్విరచిత మాతృశ్రీమహామహ పుస్తకములోనివి. )

కావున మాతృపూజ సర్వశ్రేయస్కరము. ఇంక బితృపూజావిధానము వినుఁడు. నవమాసము లుదరమున మోసి నానాశ్రమల్ను పడి కని కనినదాది జ్ఞానము కనుదాఁక నెడఁబాయక పేనుచు జనని వెనుకను దనవీర్యంబు కతంబునఁ గలిగిన తనతనయున కేలోపము లేకుండ నరయుచుఁ దనయావచ్ఛక్తి యుక్తులు వినియోగింపుచు శ్రీ లెన్ని యో చేకూర్చుచుఁ దన్ను పున్నామనరకంబు నుండి యుద్ధరించువాఁ డతఁడే యని యెన్నెన్నియోవిధముల వితర్కింపుచు నధికాహ్లాదమునఁ జేతుల నెత్తి ముద్దాడుచుఁ దాఁ బడుశ్రమల నెల్ల నాపిల్లనిజలిబిలి పలుకుల మఱచుచు నపారసంసారపారావారనిమగ్నుం డయి యుండుట నింతయుఁ దెలియక నిర్మలహృదయమున నిశ్చింత స్వాంతమునఁ దొలుకాడుపితయే వందనీయుఁ డన నాశ్చర్యమేమి ! అట్టిజనకు వ్యతిరేకించి సంచరించు లేకుఁ డెట్టియధోగతిఁ బాలగునో పరికింపుఁడు. పితృవాక్యపరిపాలనార్థమె కాదా మున్ను శ్రీరామచంద్రుండు పదునాలుగేం డ్లరణ్యవాస మాచరించె. కావునఁ గుమారులారా ! చన్న మొత్తినప్రీతిను

ష్యుఁడును బరమునందుఁ గలపరాత్పరు వినుతించి ప్రఖ్యాతులు ఘటించి యిహమునం గలతలిదండ్రులకు మ్రొక్కుటయే కర్తవ్యము. ఇ ట్లాచరింపనివాఁడు నరుండు కాఁడు వానరుండు. ఇట్లు నుడువుట నీకాలమునఁ దల్లిదండ్రు లెల్లరుఁ దమతమ మర్యాదలు నిలుపుచు సంచరించు చున్నారా యనుసందేహము మీా డెందముల నాందోళన మొందింప వచ్చు. దానికిని సమాధానమును వినుఁడు. కలికాలమునఁ దల్లులు తమపిల్లల ధనమునకై విక్రయించుటయు మాఱుమగలఁ దగులుకొని పరిపరి విధములఁ గన్న పిన్నలఁ గట్టులఁ బెట్టుటయు రూపుమాపుటయుఁ దండ్రు లక్రమదండన లాచరించుటయు మాఱుపెండ్లాములవలలఁ దగిలి ద్వేషించి కట్టుపెట్టి మట్టుపెట్టఁ గాంచుటయు సర్వస్వము హరించి తనయింపుగత్తెకుఁ జేర్చ నెంచుటయుఁ గలంత నలంత వలవంత బలవంతమునఁ గలిగించుటయు జరుగుచున్నను " యతోధర్మ స్తతోజయ " మ్మని కొమరులు తమ యథావిధుల నేమఱక యుండిన వారిందున నందునం దమకుం దగుకీర్తు ననుభవించిరేని తీరుదురు. ఎప్పుడు నెప్పట్టున నేవిధోపద్రవముల మాతాపితలమూలమునఁ దా రనుభవింప వలసి వచ్చినను దనయులు నిశ్చింతమై నిష్కలుషమతి నించుకయుఁ జంచలింపక పల్లెత్తి మాట యయిన ననక యనుభవించుటయే కాక వారి నట్టి యధర్మపథము నుండి మరల్చి సన్మార్గ మలవడఁ జేయ సర్వేశ్వరుఁ బ్రార్థించుటయే పరమధర్మ మని నానిశ్చితా

మతము. వినరే మును మోహినికై యేకాదశీవ్రతభంగమునకుం
గొంకి తన యేకాత్మజు రాకాసుధాకరానను బోకార్ప సమ
కట్టుపట్టున రుక్మాంగదు నెడ నతనియంగజుఁడు నడచుకొనినసం
గతిని? మా యామావానికిఁ దన్నుపహార మొసఁగుదు రన్నకన్న
జననీజనకు లగుబుద్ధిమతికి సిరియాలునకు ధృతి నిలిపినమతిమంతు
చరితము స్వాంతముల నుంపరే? అష్టకష్టములు పెట్టి నరహరి
యఱకట నసువులు తొఱఁగినజనకున కేలోకమును గొనెనో
ప్రహ్లాదుఁ డెఱుఁగరే? మఱియు మారాము చేసినను మంకు
తనము చూపినను వ్యతిరిక్తముగ నడిచినను లెక్క సేయక
తలఁచినంతన యంత మొందించునవకాశము స్వాధీనమున
నున్నను నాయభిప్రాయమే రా నీయక వృద్ధి గావించినవృద్ధ
జననీజనకులకు చిత్తభ్రమఁ గాని మఱి యేకారణమునఁ గాని
యే దే సంకార మొసరించిన దురాగ్రహగ్రస్తులై దుర్మదాం
ధులై నిర్దాక్షిణ్యులై నిక్క నీల్గి కండబలువు కలదు కదా యను
గర్వాతిరేకమున నై మఱచి కీడు మూడించుయూవను లెట్టి
శిక్షకుఁ బాత్రులో విలోకింపుఁడు. వీరిం బోలి వారును నిర్దయ
స్వాంతులై మృగయులగతి సంతట నంత మొందించిన నింత
యవకాశ మేది? వీరికి మనుగడ యేది? కావున నొకవేళ
జననీజనకులు తప్పు నడిచినను ద్వేషమును దోషమును దూష
ణను బూనక యోగ్యులై నడచుటయె సర్వోత్తమము. దీనిని
వీరు మీజీవితకాలమున మఱవ కుందురు గాక!

ఇఁకను మీయర్హకృత్యముల నాలింపుఁడు. విద్యయం దపేక్షయు నల్లరిపనులయం దనాపేక్షయు ముఖ్యముగ మీకుండ వలయు. గురుశుశ్రూష, పెద్దలయందుభక్తి, యతిథిసత్కారము, భూతదయ, వినయవిధేయత, సత్సహవాసము, సర్వసమత, సహనము, శాంతము, నిగర్వము, నిష్కల్మషము, స్వాభిమానము, స్వాగతము, సత్యాలాపము, మీరు ముఖ్యముగఁ బాటింప వలయు. వీనిఁ బాటింపని వానిమనికి తల్లిదండ్రులకడుపుచేటు, గుర్వాదులయప్రఖ్యాతికిమూలము, విజృంభితస్వదేశవృక్షమునకుఁ గుంకటివేరుపురుగు. సర్వానర్థదాయకము. గురుశుశ్రూష లేకున్న విజ్ఞానము నహి; విజ్ఞానవిహీనుఁడు మోక్షవిహీనుఁడే; పెద్దలయందు భక్తి లేకున్న సదాచారములు పట్టుఁబడవు; సదాచారవిహీనునకు సద్గతి వాలిశక్య.: యతిథిసత్కార ముండ కున్నఁ దనకు నెన్నఁడు నన్నము కలుగదు; అన్నము లేకున్న నెన్నొకష్టములు పడుటయే గాక దుర్గుణాలవాలుఁ డగును: భూతదయ గలుగ కున్నఁ బున్నము నున్న; పుణ్యవిదూరుఁడు స్వర్గవిదూరుఁ డగుటకు సందేహమా! వినయవిధేయతయులవడమి గౌరవచ్యుతుఁడును బతితుఁడునగును: సత్సహవాసము లేమి జారుఁడును జోరుఁడును ద్రాగుఁబోతును బాగరుఁబోతును ఉచితానుచిత కార్యాకార్య ధర్మాధర్మజ్ఞానహీనుఁడును నల్పజీవితుఁడు నగును: సర్వసమత లేకున్న విబుధజననింద్యుఁడును సర్వేశ్వరకరుణావిదూరుఁడును నగును: సహ

నము లేనివాఁడు సంతతసంతాపాక్రాంతుఁడును దురంతచింతా
నిమగ్నుఁడును నిష్ప్రయోజనుఁడును వీతవివేకియు స్వవినాశ
కారుఁడు నగును: శాంతము లేనివాఁడు నిఖిలకార్యభంగపరుఁ
డును నఖిలజనశాత్రవుఁడును స్వప్రాణాపహారుఁడును నగును:
నిగర్వి కానివాఁడు వినిందితుఁడును స్వేచ్ఛావిహారుఁడును నాత్మ
స్తుతియుఁ బరనిందయుఁ జేయువాఁడును మాయామోహారముల
నేరనివాఁడును నగును: నిష్కలుషమతియై యుండనివాఁ డాత్మ
బంధువులకు నయితము హితము కానివాఁ డయి పరధనపర
దారాపేక్షాపరుఁ డయి యీప్సితసిద్ధిఁ బడయక యీడ్వఁ
బడుచు నుండును: స్వాభిమానము లేనివాఁడు స్వజాతిచేత
నీసడింపఁ బడుచు గురుసంకటములఁ జిక్కుచు నిందనీయుఁ
డగును: స్వాగతము లేక దురాగతముల మెలఁగువాఁడు మన్న
ని న్నెఱుఁగక సంచరించి స్వోదరపోషణైక్యపరుం డయి
యుచితానుచితముల మానావమానముల మర్యాదామర్యాదల
హీనాహీనములఁ దెలియక దుష్టమృగమురీతి దుర్మరణము నొం
దును: సత్యభాషణము లేనివాఁడె నరపశువు; దైవ మొసఁగిన
జ్ఞానమ్ము వమ్మొనర్చి యమాయికుల వంచింపుచు సంచరించు
వీనిఁ బశు వన్నను గౌరవమే! అసత్యాలాపమున మోనమును
మోనమున మొంచితనమును మొంచితనమున దుండగమును
దుండగమున దుందుడుకును బ్రాప్తించి మూర్ఖీభవించినకలి
పురుషుఁడో ఘోరాకారరాక్షసుఁడో నా నుండు: వీనియావన

మాలోకించినఁ బంచమహాపాతకములు పట్టుపడు. అంధకార
బంధుర మగునధోలోకమే వీని కెల్లపుడు నివాసయోగ్యము.
వీనియసత్యాలాపము లెన్నెన్ని కొంపలు కూల్చివైచెనో యె
న్నెన్నివంశములు ధ్వంసము గావించెనో యెందఱెందఱిపురో
వృద్ధినిరోధ మొనరించెనో యెందఱెందఱిబంధుగుల కెడఁబాట్లు
గలిగించెనో యెందఱెందఱిమిత్రుల శత్రుల నొనరించెనో దీనుల
నొనరించెనో మానములఁ దూలించెనో హీనులఁ గావించెనో
హానుల ముంచెనో ప్రాణములు హరించెనో యెవ్వ రెఱుఁగఁ
బలుపఁ గలరు! చంద్రమతీహరిశ్చంద్రులచరిత్రము నలదమ
యంతులవృత్తాంతము మీ కిదివఱకె తెలిపితిని. అవియ యేల
మీవంశజుఁ డగుధర్మజునిదగుజీవితము వినవే సారంగధరా!
తనయులారా! ధనముపట్లఁ గాని కామినీజనముపట్లఁ గాని
మానప్రాణములనిమిత్తము గాని బొంకకుఁడు. సూనృత
విదూరుఁ డగుటకన్న మౌనవ్రత మూనుట చాలమేలు. ఘోరా
కారుల నైన నేను భరింపఁ గలుగుదును గాని యనృతము లాడు
వాని నొకని నైనఁ బూనఁ జాల ననినభూదేవివాక్యములు మును
మీకుఁ దెలిపి యుంటినే కదా. కనుకఁ దనకు నరకమును
నొరులకుఁ దాత్కాలికాందోళనమును గలుగఁ జేయుటయే
కాక యిహపరములకు వెలి యొనర్చు బూటకముల నెవ్వుడును
నెప్పట్టునను బలుకకుఁడు. తప్పొనర్చి యొప్పుకొనిన మెప్పు
వడయును గాని దానిఁ గప్పిపుచ్చుట కెన్నెన్నోయబద్ధము లాడిన

నఫలీకృతుఁడు కాఁడు కదా సర్వజనాసహ్యాభాజనుఁ డగును.
కాన నీనావచియించినదుర్గుణముల నెల్లయు నేకఫలప్రదములే
యించుమిం చయినను నీకట్టకడపటిదిమాత్ర మన్నిఁటికన్న
నధికానర్థదాయ మగుట నచింత్య మభావ్య మనాచరణీయము.
ఒక్కసారి కల్ల లాడినవాని మఱియొక్కసారి కాదు కదా కల
కాలము నమ్మరు. వానికి సభాభ్రష్టత్వము పదవీభ్రష్టత్వము
స్థానభ్రష్టత్వము తుదకుఁ బ్రాణభ్రష్టత్వముఁ గలుగ కుండదువే.
దివారాత్రులు దివానాథుఁడు నిశాపతియు భూమ్యాకాశము
లును నశేషాశావకాశములును జరాచరములును నంతరాత్మ
యు ననిశము కాపయి యుండ నెవ్వ రెఱుఁగ కుండ బొంకితి
నను టెట్లు! కల్ల కొన్నాళ్లకుఁ గా కున్నఁ గొన్నాళ్లకైన
బైలువెళ్ల కుండదు. సత్యభాషణపాశబద్ధు లగుటనె కదా సిరి
యాళరుక్మాంగదులు తమయంగజులఁ బొలియింప సమకట్టిరి;
దశరథేశ్వరుఁ డసువుల నప్పగించె; శిభి మేనికండలు చెంప
నిచ్చె; దధీచి తల దానము చేసె; కర్ణుఁడు సహజకవచకుం
డలముల సమర్పించె; సూనృతవతనియతుఁ డగుటనే కదా
భీష్మాచార్యుఁడు నిష్కాముఁడును జితేంద్రియుఁడును నిఖిలజన
ప్రీతిపాత్రుఁడును నమర్త్యుఁడు నయ్యె. అసత్యము లాడి
యనాదరణీయు లయి యవమానహేతుభూతు లయి జీవన్మృతు
లయి యుండుటకన్న సత్యము వచియించి మృతజీవు లయి
యుండుట సర్వస్తుత్యము. చిరజీవి యై చిరజీవి యై మనుటకన్న
హంస యై యాఱునెలలు బ్రదుకుట యుత్తమము'' అనియెను.

సుబుద్ధిసారంగధరులు విస్మయకలితు లయి సంతుష్టరంగు లయి నిశ్చితచేతస్కు లయి ఫుల్లాంభోరుహపత్రనేత్రు లయి యొకరిమొక మొకరు విలోకించునంత వ్యాయామసమయము సమీపించినట్లు వివరించుఘంటానినదము వీనులఁ జొచ్చెను. నన్నపాచార్యులవారితోఁగూడ ముగ్గురును లేచిరి.



## అయిదవ ప్రకరణము.

### పరిణయము.

ఏమిది! అన్నియు స్వర్ణరజతరచితగృహములే. కావు కావు. అట్లుగ యులఁది వెల్ల వేసినయావాసములు. రతనములు జతపఱుపఁ గరము రంగారుబంగారుద్వారములో నాఁ బసుపుపూసి కుంకుమబొట్లు పెట్టినగుమ్మములు చూపఱుల భ్రమించు చుండె. పచ్చనితోరణములు బారులు తీరి యుండె. క్రొత్త పూదండలు దండిగ నిండుకొని యుండె. ముంగిండ్లు రంగవల్లికలఁ జెంగలించు చుండె. తెరువులు పరిశుభ్రముగ వరలు చుండె. అం దందు ముఖ్యము లగుమందిరములముందు సుందరము లగుపందిరలు వెలయు చుండె. ఆకాయమానములు శోభాయమానము లై జగజ్జేయము లై వెలుఁగు చుండెను. మల్లెతీఁగలతోడను ద్రాక్షాలతాళితోడను మనోహరము లై యుండె. కంబములు పనంటికంబము లంటఁ గట్టం బడి యుండె.

తెరువున కిరుప్రక్కలం జిత్రవిచిత్రము లగుపుష్పఫలపత్రములం జెలంగు మొక్కల నిండినకుండు లమర్పం బడి యుండె. వాట ములపొడుగున వాటముగం గాగితము బుట్టలును జీలుగుంబూలం గ్రాలు వెనురుగడలును నుండె. విపణివీథులు మఱియు విచిత్ర ముగ రంగురంగులకాగితముపూలతోడం నుఱంగలించు చుండె. పురలక్ష్మి చలువవలువలు ధరించి వివిధాలంకారము లలంకరిం చుకొని మఱిమఱి మురువున ధవళచంద్రునితనయ యగుచిత్రాం గిపరిణయోత్సవము సవ్యముగ జరుప నున్నగురుపురంధ్రీరత్నము నాం బరంగు చుండె.

"చిత్రాంగీ! చిత్రాంగీ! యెంతవిచిత్రమే! కన్నుల నెండజనో కన్నారము కాని నిన్నుం బోలినదానిం గనుంగొని నేరము. తలంచినప్పుడే తాత పెండ్లియని వలచినంతనే వలవంత మునుంగు చున్నావు కదే! ఆరాటము పెండ్లికొఱకు పేరంటాలు నెత్తుకొనిపోయె నను సామెత యిట్లు తాఱుమాఱగునని నేరమే! చాలుం జాలు లే లెమ్మ. నేల వ్రాలి యుంటి వేమి! కను మూసికొని యీనాలుగుగడియలు గడపుము. పండువఱకు నుండనిదానవు పండువఱకు నె ట్లుందువే నాతల్లి!" అనుచుం జిత్రాంగియంతఃపురమున మనోరమ యర్ధరాత్రమునం బలుకు చున్నది. చిత్రాంగి పై మఱచి తనగదినమ్మ రత్నకంబళ ముపైం బుత్తడిఖుత్తళిక నాం బడి యుండెను. ఒడలితొడవులు తమస్థానముల నుండి నడలి యుండెను. జాఱువానగలు జాఱి

యుండెను. వలువలు నలిఁగి యుండెను. కప్పుకొప్పు చెదరి యుండెను. నయనములు మూఁతలుపడి యుండెను. మనోరమ యాకొమ్మను నెమ్మదిగ నెత్తి హొంబట్టుపఱుపునఁ బెట్టెను. శీతలోపచారములు చేయు చుండెను. "కల కన్నమాత్రమున నిట్లు కలఁగుమరే! కల లన్నియు నిజము లగునా! కాఁ గలది కాక మానునా! నీకలఁత మాను" మని మనోరమ యూఱడఁ బల్కు చున్నది. అతరుణీమణియుఁ జైతన్యము వహించు చున్నది. తెలివి వచ్చి యుస్సు రుస్సు రని వేఁడినిట్టూర్పులు పుచ్చు చున్నది. "మనోరమా! దారి యేమే! సారంగధరుఁడు నాకుమారుఁ డగునే" యని యామె యామెఁ జేరఁ బడు చున్నది. పులుకుపులుకునఁ గనుఁగొనుచుఁ బలుకుపలుకున దైన్యము దొలుకఁ జెలువు చున్నది. వారి కిట్లుగఁ బ్రసంగము జరుగు చున్నది.

మనో:—

శా॥ బాలా! యేటి కలంతఁ జెందవలె భూపాలుండు విచ్ఛేయునిక్
వాలాయంబు గ్రహించు నమ్మయు శుభప్రారంభకాలంబునన్
లీలన్ రేపు వివాహమం చనఁగ నల్లీలోక్తు లిట్లాడఁగా
చేలాప్రాంతము వాయునంతవఱగ నీకే మున్నదే జవ్వనీ!

(చిన్న చిన్న మార్పులతోఁ గీర్తిశేషు లైన శ్రీధర్మవరము రామకృష్ణమాచార్యులగారి చిత్రనళీయములోనిపద్యమును జేర్చిన నన్నేతద్గ్రంథస్వామ్యులును నాటకమహాశయులును మన్నింతురు గాక!)

తెరువున కిరుప్రక్కలఁ జిత్రవిచిత్రము లగుపుష్పఫలపత్రములఁ జెలఁగు మొక్కల నిండినకుండ లమర్పఁ బడి యుండె. వాటములపొడుగున వాటముగఁ గాగితము బుట్టలును జీలుగుఁబూలఁ గ్రాలు వెదురుగడలును నుండె. విపణివీథులు మఱియు విచిత్రముగ రంగురంగులకాగితముపూలతోడఁ నుఱంగలించు చుండె. పురలక్ష్మి చలువవలువలు ధరించి వివిధాలంకారము లలంకరించుకొని మఱిమఱి మురువున ధవళచంద్రునితనయ యగుచిత్రాంగిపరిణయోత్సవము సవ్యముగ జరుప నున్నగురుపురస్త్రీరత్నము నాఁ బరఁగు చుండె.

"చిత్రాంగీ! చిత్రాంగీ! యెంతవిచిత్రమే! కన్నుల నెందఱనో కన్నారము కాని నిన్నుఁ బోలినదానిఁ గనుఁగొని నేరము. తలఁచినప్పుడే తాత పెండ్లియని వలచినంతనే వలవంత మునుఁగు చున్నావు కదే! ఆరాటము పెండ్లికొడుకు పేరఁటాలు నెత్తుకొనిపోయె ననుసామెత యిట్లు తాఱుమాఱగునని నేరమే! చాలుఁ జాలు లే లెమ్మా. నేల వ్రాలి యుంటి వేమి! కను మూసికొని యీనాలుగుగడియలు గడపుము. పండువఱకు నుండనిదానవు పండువఱకు నెట్లుందువే నాతల్లి!" అనుచుఁ జిత్రాంగియంతఃపురమున మనోరమ యర్ధరాత్రమునఁ బలుకు చున్నది. చిత్రాంగి పై మఱచి తనగదినడుమ రత్నకంబళముపైఁ బుత్తడిపుత్తళిక నాఁ బడి యుండెను. ఒడలితొడవులు తమస్థానముల నుండి నడలి యుండెను. జాలువానగలు జారి

యుండెను. వలువలు నలిఁగి యుండెను. కన్నుగొన్న చెదరి యుండెను. నయనములు మూఁతలుపడి యుండెను. మనోరమ యాకొమ్మను నెమ్మదిగ నెత్తి హంసంబట్టుపఱుపునఁ బెట్టెను. శీతలోపచారములు చేయు చుండెను. "కల కన్నమాత్రమున నిట్లు కలఁగుదురే! కల లన్నియు నిజము లగునా! కాఁ గలది కాక మానునా! నీకలఁత మాను" మని మనోరమ యూఱడఁ బల్కు చున్నది. ఆతరుణీమణియుఁ జైతన్యము వహింపు చున్నది. తెలివి వచ్చి యుస్సు రుస్సు రని వేఁడినిట్టూర్పులు పుచ్చు చున్నది. "మనోరమా! దారి యేమే! సారంగధరుఁడు నాకుమారుఁ డగునే" యని యామె యామెఁ జేరఁ బలు చున్నది. పులుకుపులుకునఁ గనుఁగొనుచుఁ బలుకుపలుకున దైన్యము దొలుకఁ బలుకు చున్నది. వారి కిట్లుగఁ బ్రసంగము జరుగు చున్నది.

మనో:—

శా॥ బాలా! యేటి కలంతఁ జొంద నలభూపాలుండు విచ్ఛేయునే
వాలాయంబు గ్రహించు నమ్మయు శుభప్రారంభకాలంబునన్
లీలన్ జేపు వివాహమం చనఁగ నశ్లీలోక్తు లిట్లాడఁగా
చాలా ప్రాణము వాయునంతటఁగ నీకేమున్నదే జవ్వనీ!

(చిన్నచిన్న మార్పులతోఁ గీర్తిశేషు లైన శ్రీధర్మవరము రామకృష్ణమాచార్యులగారి చిత్రనళీయములోని పద్యమును జేర్చిన నన్నేతద్గ్రంథప్రాజ్ఞులను పాఠకమహాశయులను మన్నింతురు గాక!)

అంతఁ జెంత నగమునిద్దుర నున్న యంతఃపురస్త్రీ యెవతెయో కాకతాళీయముగఁ దుమ్మెను.

మనో:—తథాస్తు. చూచితే నెచ్చెలీ! తప్పక నేఁ జెప్పినట్లె జరుగునని యెట్లు తుమ్మినాహో యేరో కాని.

చిత్రాం:—(వినినతోడనే యాపలుకులు ములుకులవలెఁ దోఁప కన్నులు పూర్తిగఁ దెఱచి బొమముడివయిచి) ఏమే నీకింత కావరము! మదోన్మత్తత నొడలు తెలియక వదరుచున్నావే! నాతోనా నీ వేళాకోళములు! కాలభుజంగితోఁ జెలగాటలు మొదలిడితివా!

మనో:—సఖి! ఏమట్లు మోము చిట్లించెదవు?

చిత్రాం:—ఆభూపాలుఁడా నన్నుఁ జెట్టపట్టుట? నేన యతని కడకుఁ బోవుట? ప్రాలుమాలి ప్రేలుచున్నావు.

మనో:—మత్తకాశినీ! కోపపడకుము. గిరగిర దిరిగి నిలుచువారు ధర తిరుగుచున్న దనుకొనునట్లు అలభూపాలుండు = ఆరాజరాజనరేంద్రుఁడు, విచ్చేయునిక = వచ్చుచున్న నిన్ను, అని వ్యాఖ్యానము చేసికొంటివే కాని అలభూపాలుండు = (యౌవనము తొలఁగి యున్న యన్న రేంద్రుఁడు తనతనయుఁడగుసారంగధరు నిదివఱకె సింహాసనారూఢుఁ గావించి రాజ్యాభిషేక మొనర్చి యుండెఁ గావున నవఁడే నిక్కముగ నేఁడు తేఁ డగుట) ఆసారంగధరుఁడు, విచ్చేయుఁ = వచ్చును అని నాయభిప్రాయము. అంతయ కాని యట్టివిపరీతార్థములు తీయుదు వనుకొంటినా!

చిత్రాం:—నిజముగ నీవు కొంటెవే—

మనో:—కొంటెతనము నీ వెఱిఁగితివి. అలుకున్న యమ్మ కులు కెక్కువ యనియెద రిదియు కాఁబోలు. కా దఁట మఱి పుచ్చకాయలదొంగ యనిన భుజములు తడవుకొనెద వేల! అది యేమో నీ వాముసలాయనపై మరులుకొనిన వైన రెఱుఁగుదుము! ఇందుకేనా యిందాఁక మనోరమా! యాసారంగధరుఁడు నాకుమగఁడు గునా యంటివి! నేరుపరివే! నన్ను కొంటె వంటివి, ఔను నేనుకొంటెను నీవు నేరనినంగనాచివంగముల్లువు-

చిత్రాం:—సకియా! నీకుఁ బుణ్యము. వివాహప్రయత్నముల జాగరూకులై యున్నవా రే రైన విందు రూరకుండుము. మాటకారీ! మనోరమా! నీవాలునకు రెండువైపుల వాఁడి కలదు వాపోపకుము.

అని కొంత యాఁగి తిరుగఁ దనకల తలఁపునకు వచ్చుటఁ గాఁబోలు. "అతఁడు నాయనురు తగిలి పోయినాఁడే కాని నాతిల్లపము మాత్రము పోవ లేదు. ఇంతకు నేఁ జేసినపూజా ఫలము లెట్లు కానున్నవో!" యని దీనముగ మేను పానుపున వాల్చెను.

ఈచిత్రవికారమున కంతకును గారణము ము న్నాపె యెుక్క నాఁడు తనముంగోపముం గురునొద్దం గనంబఱప నతండు నీకు ముదుకండు మగం డగుం గాక యని శపించె నఁట. ఈ రేయి వెండియు నది జరిగినది జరిగినట్లు స్వప్న మయ్యె నఁట.

మందిరములఁ గలదీపకళికలు మంద మొందు చున్నవై
యాకాశమునఁ గలతారకావళులు తళుకులు తఱుఁగు చుండె.
వేగుఁజుక్క చక్కఁగఁ బొడమెను. దిక్కులు తెలతెలవాఱు
చుండె. కావు కా వనుచుఁ గాకములు మ్రాఁకుల నుండి కేక
లిడు చుండె. బాలింతలఁ బోలెఁ గలరవములు మూలుగు
చుండెను. ద్విజకులమ్ములకూఁతలు దెసల నెగసెను. సద్గణ
తేజము లింకెను. పంకజాతము విజృంభించెను. కువలయం బ
ట్టిట్టు పడెను. అరాజకం బైనయెడల నటు లగుఁ గాదె!

"శక్తి వచ్చె మొద లాడు మన్నా రఁట! నీకత య
ట్లుండె. చెప్పినదే చెప్ప వలయు, పాడినదే పాడ వలయు.
ఎన్నాళ్లు దెలిపిన నింతే. అదే యెల్లెసఁ జెల్లవాఱె. తెలివి
నీ కెన్నఁడు తెల్లవాఱు. ఇట్లున్నఁ గాఁపురము గా వారణ మగుఁ గావున
రమ్మా రమ్మా. మంగళస్నాన మాడి పెండ్లికూఁతురవు గా
వలయు నీవు." అనుచు మనోరమ చిత్రాంగి నడిపించి చనియెను.

అనేకశకటములచప్పుడు లుప్పతిల్లెను. రక్షకభటు లావల
నీవల నశ్వారూఢు లై దారి నేరును నడ్డు లేకుండ నారయు
చుండిరి. కరితురగరథపదాతివర్గమునకుఁ జెఱపి లే కుండెను.
బంధుమిత్రగణములు పరతెంచుటయే గాక లేఖాసందనసామం
తరాజులును దమతమగౌరవములకుఁ దగినట్లు వచ్చు చుండిరి.
బోయీలయొక్క హూంకారధ్వనులు దిక్కుల నుండి ప్రతిధ్వను
లిడు చుండెను. చిఱుగంటలు గణగణమనఁ గుంభస్థలముల నం

కుశములు చే నున్న మావటీంద్రును సంచారీల నలరారునధిపతు
లును డోలాయమానము గా నుండ మందమందగమనములఁ
బున్నాగము లలంకరింపఁ బడి చలించు చున్నకొండలో యన
నడచు చుండె. ఆచవుడోలుల నున్న రాజులు దేవరాజు లవం
బరఁగు చుండిరి. చుఱుకైన తురంగములు లాగ వేగముగ
గంటలచప్పుడు లుప్పతిల్ల లఘుస్యందనము లరుగు చుండె.
ఆ తేరుల నారోహించినధారుణీరమణు లారవిఁ గేరు చుండిరి.
ఆయూర నున్న నారీమణు లాపోవువారలఁ గనుఁగొన నాత్రము
మై తమతమపనుల దిగనాడి ద్వారములను డాబాలను మేడ
మీఁది యంతస్తులను వాతాయనములను డాయు చుండిరి.
ఒకమెలనాగ మొలకుఁ దగిలించుకొనునొడ్డాణము గళమునకుఁ
దగిలించుకొని యుండె ఒకఘనకచ పెన్నెరివేణి నల్లుకొనుచునే
కనుఁగొను చుండె. ఒకకలువకంటి యొకకంటఁ గాటుక నిడు
కొనుచునే యుండె. ఒకరమణీమణి పాపట దిద్దుకొనుచునే
యుండె. ఒకనీలశిరోజ కురు లార్చుచునే యుండె. ఒకశోభ
నాంగి తడికురులకు వెలిగుడ్డఁ జుట్టి కుప్పెళ్లు పెట్టుచునే యుండె.
ఇట్లుగా నున్నవారు దారిఁ బోవువారి నేరో సరిగ నిరూపింపఁ
జాలక గుజగుజలుపోవుచు గజిబిజి యొనరింపుచు వారిసౌరు
వారిఁతీసి నెన్నుచు సాశ్చర్య లగుచు నుండిరి. రాజవీధి యిసుక
వేసిన రాలన ట్లుండె. నిగనిగ లాడు చున్నతెన్నుదరియిండ్లు
ధూళిమూసరితము లై కొంతవన్నె వాసి యుండె.

రాజమార్గము తిన్నఁగ ధవళచంద్రునికోటలోని కేఁగు. రాజాంతఃపురము సితకేతనములతోఁ దోరణములతో మీఱి యుండె. భర్మహర్మ్యనామము సార్థకమైనది. సాలప్రదేశము చాలవిశాల మగుట వచ్చిన వారికిఁ దగు నునికిపట్లు నదుపాయముగ సమకూర్చిరి. కరితురగములకు సరి యగుమందురములను స్యందనశకటములకు దగుసాలలను బరిజనులు సేవకులు నుండఁ దగుగదులను బంధుమిత్రాదులకు ననువగుగృహములను దత్తార్యార్థము నిర్మించిరి. పెండ్లికొడుకు పెండ్లికొడుకుప్రక్కవారు విడియుటకు మేడ యొక్కటి మిక్కిలిచక్కఁగ నలంకరించిరి. వే యేల లోప మేమిటను లేదు. వచ్చినబంధుమిత్రాదుల కెల్లరకు స్వాగతాద్యుచితసన్మానములు నెరపి తగుమందిరముల నిలుపు చుండె నాధవళచంద్రుఁడు.

ఇంతపర్యంతము నేమికతమో రాజరాజనరేంద్రుఁడును సతనితనయుఁడును నింత యేల యాప్రక్కవారు గాని యొక్కరును రారైరి. ఊరివారిలోఁ బెక్కండ్రు "వా రింకను రారేమో!" "వా రేమో వా రెందుకో?" "నీతెలిపి పెండ్లివాటి నట్లే యున్నది పెండ్లికిఁ బెండ్లికొడుకు సతనివారు రా కున్న నెట్లు?" అని యిట్లుగా గజిబిజిపడు చుండిరి. ధవళచంద్రుఁడు దోలాయమానమానసుం డై కాంతి తగ్గి నిమిషములు లెక్కించు చుండెను. ప్రేష్యులు తలపోయు చుండెను. కుదు రొదవక యటు నిటు మతి చలించినవానిగతి సంచరించు చుండెను.

సంభావనలు మిక్కిలిచక్కఁగ దొరకు నని దేశదేశముల నుండి యత్యాశమై భూసురోత్తములు విచ్చేసిరి. బిల్లగోచులు బిగియించి దండిగ విభూతి ధరియించి చిత్రమగునంచులు గల దువ్వాలునలు మడిచి మెడ వ్రేల వైచి కోటకూటమునఁ గల రత్నకంబళముల నలంకరించిరి. భట్టులు నెట్టన బల్లెములు పట్టుకొని యుపవిష్టులై యుండిరి. వివాహవేదిక గాక యించుమించు సభాస్థాన మంతయు నాక్రమింపఁ బడియే యున్నది. పురంధ్రీమణులు పురుషులకంటెఁ బడ కుండ వలిపంపుజాలికల వెనుకఁ గ్రిక్కిఱిసి యుండిరి.

భేరీకాహళధ్వనులు జోకఁగొనియెను. వీరణములు క్రోల్లు మంజలు తమ్మటలు తాళములు ఝల్లరులు పణవములు వీను వాఁదీను లదుర మ్రోఁగు చుండెను. ఆటవెలఁదులు తేటగీత ములు పాడుచు నాడుచు నుండిరి. ప్రధానకార్యమునకు వలయు నారికేళాదిఫలకావటులు బారులు తీరి వచ్చు చుండెను. యింతంత గోరంతయు లేనియుల్లి పెండ్లికొమకువారు వచ్చు చుండిరి. కోటకూటమునఁ గలవారెల్లరు నల్లానమునఁ బల్లటిల్లినయుల్లములతోఁ బల్లకి నెదురుచూచు చుండిరి.

అంత వార్తాహరుఁ డొకఁడు వగర్చుచు వచ్చి "ఇదే పెండ్లివారు వచ్చు చున్నారు దేవరా!" యని విన్నవించెను. ధవళచంద్రుఁడును నాందోళన మడఁగినవాఁడై సుముహూర్త సమయమునకుఁ జనుదెంచునుమతి మున్నగువారి సంధింప నెదు

రేగెను. ఎదురుకోలు యథావిధిగ జరిగెను. కాని యాందోళము పిల్లంగ్రోవి బోయీలు లేనియ సంఘముం గని యాందోళనపడు చుండెను.

అప్పు డప్పట్టణప్రజ లెల్ల రచ్చో నాసాలమున విఱుగఁ బడి రన వింత యేమి! కాని యేనికని బల్లకియుఁ బెండ్లికొడుకును నగపడ కుండుట వింతయే. పెండ్లికొడుకుతండ్రిమాత్ర మేఁడీ! యాతఁడును లేఁడు.

సుమంతుఁ డాదిగఁ గలవా రెల్లరుఁ గోటకూటముఁ జొచ్చిరి. సుమంతుఁడు దీర్ఘాలోచనపరుం డయి యుండెఁ; గాని యట్లు పై కేరికిని బొడకట్ట కుండెను. సభాస్థలి సమీపించినయంత సుమంతుఁడు పెండ్లియరుఁగు డాసి "నిర్విణ్ణులయి యున్న యో సదస్యులారా! పిలాకుఁ జెందకుఁడు. మాకులాచారప్రకారము మాపట్టుకత్తికి కంకణము కట్టి పరిణయము సంపూర్ణముగ నెరవేర్పు' డని మారాజుగారియాజ్ఞ. ఇది వారియొక్క సాం ప్రదాయము. మీ రిందుం కొంచెమైన తీరదు. అట్లు కా దేని కార్యవిఘ్నమగు" నని గంభీరముగ నుడివి "కట్టా! రాజభక్తి నేఁ పెట్టినని యొనరింపించు చున్నది నాచేత" నని లోలోనఁ దల పోసెను.

సభాసదు లొకరి మొక మొక రరయఁ బ్రారంభించిరి. "ఇదివఱ కిట్టిది మనదేశముఁ గని విని యెఱుఁగము." అని గుసగుస లాడఁ జొచ్చిరి. ఎంతో వింతపడు చుండిరి.

విచారించి విచారించి ధవళచంద్రుఁ డెట్టకేలకు వాలు నకుఁ గంకణముగట్టి బాలికావివాహ మునకుఁ బనుమతించెను.

చిత్రాంగి దేహమునఁ బులకాంకురములు పొడమి దడ పుట్టెను. మనోరమయు గుండె త్రాయి పడిన ట్లుండెను.

సుమంతుఁడు చూడఁ జోద్యమైన నవరత్నములు పొదిగిన పయిఁడిపిడి గలిగి ముత్తెముఁకుచ్చులు మురువు లీనఁ గరముఁ దుఱుఁగలించు రాజరాజనరేంద్రునిఖడ్గమును వివాహవేదికఁ గుడి వైపున నిలిపెను.

" అయం ముహూర్త స్సుముహూర్తోస్తు " అనుచుఁ బురోహితునితోడ బాడబు లెల్లరుఁ బ్రారంభించిరి. ఆగొంతు కల నెల్ల ముంచి వైచుచు వాద్యవిశేషములు చెలరేఁగెను.

ముసుఁగు బాగుగాఁ బొసఁగి యున్న పెండ్లికూఁతు నొక ముదుసలిముత్తైదువ మెల్లమెల్లనఁ గొనివచ్చి యచ్చో నున్న యడిదమున కెడమవైపునఁ గూర్చుండఁ బెట్టెను.

మనోరమయు వధువుప్రక్కన యుండెను. వివాహము జరుగు చుండెను. బెల్లము జీలకఱ్ఱ నెవరు నెత్తిఁ బెట్టిరో కాలు ద్రొక్కి కంకణము మంగళసూత్ర మెవరు కట్టిరో ముత్యాల తలఁబ్రా లెవరు పోసిరో తెలియదు. పెండ్లికొడుకు లేని పెండ్లి. మేలు మేలు !

# ఆఱవ ప్రకరణము.

---

## వేఁడుకోలు—వీడుకోలు.

రాజమందిరమును మఱికొన్ని యిండ్లును నలుచదరముగ నున్న ప్రదేశమున నుండెను ఇదియె కోట. ప్రకృతియె యీ కోటను మూఁడువైపులఁ గాపాడు చుండెను. తూర్పుదిశ ఘోర కాంతారము కలదు. ఆయడవి కడుఁగడుఁదాళవృక్షముల తోడను న్యగ్రోధాదిమహావృక్షములతోడను గిరుల వరుసలతోడను నిండి, నిబిడీకృతమయి యుండె. దక్షిణము ఝరప్రవాహముచే వెల్లివిరియు చుండెను. (ఆప్రవాహము రమారమి క్రీస్తు శకము 1885-వ సంవత్సరమువఱకు నుండె నని వినికి. క్రమక్రమముగఁ దూర్పుకనుమలనుండి పాఱు చున్న యాయేఱు గిరులలోనియిసుకను ఱాళ్లను గొనివచ్చి మెరక వైచుచుఁ దన్నుఁ దాన యంతము గావించుకొనియెను. అయ్యేది మున్ను ప్రవహించినచోటే నేఁడు పిన్నంగట్టువీధి యని వాడుక నున్నది. ఆసెలయేటియొడ్డున నాఁటిప్రజలు మృతి నొందినతమవారలకుఁ బిండములు వేయుచుండి రఁట; కావున నది ‘‘పిండముగట్టు’’ నాఁ బడు చుండెనఁట; ఆపిండముగట్టు శ్రుతి కింపు గామిఁ బిన్నంగట్టుగ మాఱెనఁట.) పడమరఁ బావనగోదావరి నది ప్రవహించు చుండె, ఈనది గోదావరి గౌతమి యను

నామముల నేమికారణములఁ బిలువఁ బడు చున్నదో యిది
వఱకె యెఱిఁగింపఁ బడె. ఇది పడమటికనుమల నాసికాత్ర్యంబ
కంబునొద్ద జనించి తూర్పునకుఁ బ్రవహింపుచు రాజరాజనరేం
ద్రపురమున కనతిదూరమ్మునను ధవళగిరియొద్ద సప్తశాఖ లై
తరువాత సముద్రమున సంగమించు చున్నది. ఈనగరమున
దీనివెడలుపు రమారమి క్రోసుండును. ఉత్తరమున నరోత్త
ములచేఁ ద్రవ్వింపఁ బడినయగడ్త యుండెను. ఇట్లుగా నాదుర్గము
దుర్గమ మై యుత్తుంగప్రాకారకుడ్యములతోడను దివ్యభవన
ములతోడను నస్త్రశస్త్రవిద్యాపారంగతు లైనయోధాగ్రేస
రులతోడను బొలుచు చుండెను. పావనగౌతమీతీరమున నొక్క
దిక్కునను రెండుదివ్యభవనములు వెలయు చున్నవి. ఒకటి
నవలావణ్యతారుణ్యమునఁ బొలుచుచిత్రాంగిదేవిది. రెండవది
పతివ్రతాశిరోమణి యని గణుతి కెక్కి కుమారసారంగధరుఁ
గనుపారఁ గని సారు మీఱి యున్నరత్నాంగిదేవిది. ఆధర్మ
హర్మ్యద్వంద్వము నగరలక్ష్మికి దివ్యాలంకార మై సకలసౌఖ్య
ముల కాకర మై యున్నను రాజరాజనరేంద్రునిపక్షపాతమును
బట్టి చిన్నిభార్యచిత్రాంగిమందిరము మఱియు సుందర మై
యుండెను. ఆరాణులయంతఃపురములు సుందరస్త్రీబృందములను
నవరత్నస్థగితకనకాసనములను చిత్రవిచిత్రప్రతిమలను బటము
లను నత్తరుమొత్తములను లోప మింతయు లేక యుండెను.
(ఇప్పటికిని నాభవనభాగములు నిలిచి యున్నవి.)

మందిరారామములు సుందరతరులతావిశేషములతోడను కేళాకూళులతోడను శుకపికశారికాదిపతంగసంగీతములతోడను వనమున కంతకు జీవనము నొసంగుజలయంత్రములతోడను నున్ననినన్ననితిన్ననితెన్నులతోడను వన్నె మీఱి యుండె.

వీనిసమీపమునను రాజోద్యానవన ముండెను. నందనవన మనం దగి యున్నదానియందమును బాలకమహాశయులె యాలోచించుకొందురు గాక! (నాఁడది కలతావునను నేఁడు చిత్రవస్తుదర్శనశాల వెలయు చున్నది.)

ఈనగరములనడుమ నుండి వరసురంగములు పరు లెఱుంగని పెటుచోటుల కరిగి యుండెను. అవి విశాలములై దృఢములై ప్రకాశములై పొడవుగ నుండెను. (ఇందుకు నిదర్శనముగ నీనడుమఁ జిత్రాంగిభవనము నాఁ బడుప్రదేశమున గోదావరి సమీపము నుండి పెద్దాపురమువఱకు నరిగినయొకసొరంగము గనుంగొనఁ బడెను.)

సుమనోమనోహరమై చూడఁజూడఁ జోద్యమై సమమై విశాలమై వెలయుపచ్చికబయలు రాజోద్యానవనము నంటి యుండెను. ఆబయలినడుమ నొకగిరి వరలు చున్నది, ఆగిరిపై కిరీటము నా నొకమందిరము సుందరమై యుండె. అదియు రాజమందిరము.

రాజమందిరము మలిచినశిలలచే దివ్యముగ దిట్టముగఁ గట్టఁబడి యున్నది. (నేఁటికి నామందిరశేషములు చూపఱుల

కొచ్చెరువు కొలువు చుండె.) ఆనగరు నగమున నెలకొని యుండుటఁ జుట్టుఁ జాలదూరమువఱకుఁ బచ్చఁగ మనోహరముగ ఫలసంపన్నముగఁ గలుముల కాటపట్టై నెలకొని యున్న ప్రదేశమును బరిపాలింపుచుఁ దారాపథ మంటుచు జ్వలితసితకేతనములతోఁ బైఁడిప్రాఁతలతో భూమండలమునకు మండనమై యుండె.

రాజసభాస్థానము చాల పెద్దది. అది యష్టకోణములఁ దీర్చి యుండెను. ఎనిమిదిమూలల నుండి యెనిమిదికంబము లష్టాకృతి వెలువడి యుండెను. అవి పైఁడిపూఁతఁ గలిగి యురు మణిముక్తామయసరములచేఁ దాఁపఁగలిగించు చుండెను. మీఁది భాగము మేలివితానములతోడను వితానములనుండి వ్రేలు చలువపన్నీటిపావడరసపుష్పస్తబకములతోను నవరత్నములు పుష్పపత్రములుగ వెలయు నల్లిబిల్లిగ నల్లుకొన్నకైతవద్రాక్షామల్లికాలతలతోడను మేలికట్టుచుట్టును వ్రేలుముత్యాలజాలరులతోడను నల్లాడుచుమ్మఁగ నుండెను. గోడలు చిత్రపటశోభితములై ముద్దులు గులుకునిద్దంపునిలువుటద్దములతోఁ దద్దయుఁ బ్రకాశించు చుండెను. క్రిందిభాగము మృదురత్నకంబళమున మెఱయు చుండెను.

ఆసభాస్థానమునకుఁ దూర్పున సింహాసన మమరి యుండెను. అది గట్టిది. శుద్ధకాంచనమయము. నవరత్నఖచితము. సొగసులో మేలికములు పొదిగిన [illegible]ములతోఁ [illegible]

యేమి సేతాము! సేయఁ గలవయిత్నా లన్నీ చేసాము! సెక్కింతా సూసాము. అవి పులులు పులులు గావు! పందులు పందులు గావు! ఎలుఁగుబంటు లెలుఁగుబంటులు గావు! ఎనుపోతు లెనుపోతులు గావు! మనుఁబోతులు మనుఁబోతులు కావు! రేచులు రేచులు గావు! ఒకటా! ఒకజాతా! మారాజా! నక్కలు తోఁడేళ్లు చవరపుమెకములు కత్తురిపిల్లులు పునుఁగుపిల్లులు జవ్వాజిపిల్లులు చివంగులు యేనుంగులు చిఱుతలు జింకలు కణుఁజులు కొండగొఱ్ఱెలు దుప్పులు చెప్ప లేము చెప్ప లేము భూమిమీఁదిముగా లన్నీ యున్నాయి మేలికా! అవి వీరిన ట్లన్నీ ఒక్కసారే ఒచ్చినాయి నాయనా! పంట లన్నీ పాడై పోయినయి. చే లన్నీ దూ లయినాయి! యి ళ్లన్నీ వల్లకా ళ్లయినాయి. పానాలతో బయట పడ్డాము. పిల్లా లేమయ్యారో పిల్లి లెక్క ఉన్నారో యెఱుఁగము. అక్కడికి చెంచోళ్ళి బోయోళ్ళి యెఱుకలోళ్ళి మందలోళ్ళి మాబలిమాలాము. బలిమాలి బలిమాలి వాళ్ల కడుపులు చల్లగాను కోలలతో యీటెలతో ఉచ్చులతో కఱ్ఱలతో కత్తులతో తగినంత మొగడిచోరవ చేసి కొట్టికొట్టి మట్టుపెట్టారు. అయినా యింకా తఱుఁగఁ డే తండ్రీ! మా పాలిటి యమలోళ్లాగ మా కొక్కడు దాపరించినాడు! బతక లేము బతక లేము బతక లేము. ఏమో! అకుచాటుకాయల్లాగ ఉన్నా మిన్నాళ్లదాఁక. ఇఁక బతికించండి నంపెయ్యండి మీదే భారము మారాజా!" అని కడుఁగడు

దీనాలాపము లాడిరి. రాజును సభాసదు లెల్లరును నిర్వ్వెర
పోయిరి. పిదప గడిచినభంగి నిశ్చేష్టు లైరి.

ఇంతలోఁ బల్లచింపిరితలల నెమిలియీఁకలు పెట్టి, నూలి
ఘూఁదానళములు మెడలనిండ వయిచి, సింగపుజూలుకడియ
ములు దండల నడుగఁ దాలిచి, పులితోలుకాసెలు కట్టి,
పిడెములు విల్లమ్ములు బల్లెములు పట్టి, భిల్లజనములు పెల్లుగ
వచ్చి రాజునకు సాష్టాంగప్రణతు లొనరించుచు నయ్యాజియ్యాలు
పెట్టి "యివ్యో పునుఁగు జవాజి కస్తూరిపిల్లులు, జల్లులు,
కుందేటి లేటిపిల్లలు, ఏనుఁగుదంతములు, పులితోళ్లు గోళ్లు,
గొఱ్ఱెగేదెకొమ్ములు, లేడికొమ్ములు, దుప్పికొమ్ములు, కణుఁతి
తోళ్లు, దుప్పితోళ్లు, లేడితోళ్లు, కొండగొఱ్ఱె లడవిపందులు:
ఈ కాపోరిఫున్నా న్నియ్యాన్నీ చిక్కినియ్యి. చంపాం చంపాం
మాఁగాపాం మాసామికానా! కానీ యదేం మాయో యింకా
యున్నాయి. యెక్కడనుంచొచ్చాయో యెక్కడపెఁగాయో
యేమో కాని తండాలు తండాలు కొండలు కొండలు! అవి
జంతువులు కావు బాబూ! మీరే సంపెయ్యాలి గాని యింక
మావొల్లకాదు. మావొల్ల కాదు మాప్రభో!" అని మఱియు
మఱియు మ్రొక్కి చేతులు కట్టి కట్టెదుట నిలిచిరి.

"ఇదేమి! గాఢేయసృష్టియా! అంతయే కాని వీరి
పలుకులం బట్టి సరిసృష్టిగఁ దోఁచదు!" అనుకొని "కాఁపు
లారా! పులిందులారా! మీ రదుగు చుండుఁడు. ఇదే మీ
వెంట నేనును వచ్చెద. వాని నెల్ల వధించెద." అనియెను.

ఆకాఁపురులును నడవివాహును నరిగిరి. రాజరాజనరేంద్రుఁ
డును నేఁటకుఁ దగుసన్నాహముల నమర్పు సుమంతున కానతి
యిడి కొలువు చాలించెను.

అంతిపురమున కేగి గోజంగినీట మజ్జన మాడి భుజించి
మెఱుఁగు లీనునవరత్నసరములఁ దూఁగలించునోరగుపాగ బన్న
సరములు, జలువసలువలు, [illegible],
నవరత్నకాంచనమయ మయిన మొకమాలు పాదరక్షలు ధరించి
చిత్రాంగిదేవికిఁ దనవీసుకో తెలుఁగింపఁ జనియెను.

తదనంతరము చిత్రాంగిరాజరాజనరేంద్రుల క్రింది
విధమున సంభాషణ జరిగెను.

చిత్రాం:—కానకుఁ బోవుట కాదు కానక పోయిన సంత
సింతును. (అని లోలోన ననుకొను చుండెను.)

రాజ:—ప్రేయసీ! మొగము దిగ జారెద నేమి! దిగులు
నొందకుము. (అని మొగ ముత్తి బ్రతిమాలు చుండెను.)

చిత్రాం:—మిమ్ము విడిచి యుండఁ గలనా! నిముసము
బ్రతుకఁ గలనా!

రాజ:—నేనుమాత్రము నిన్ను విడిచి యరనిముస ముం
దునా! కారణవశమున నెడఁ బాయ నయ్యె. కనుమూసికొని
యాకొంఁదియు పఁ బొటు నెట్లో యోర్చికొనుము. అటుగు చున్నా
నన్నమాటయే కాని నాయాయుచ ప్రాణము లిండె నియుండె
యుండు: నమ్ముము నామాట. నాహొందె యుచ్చ యుండు.

మునా! ఏమో మీ రన్నట్లు నేను నట్టిభ్రమయే పడు చున్నాను గాఁ బోలు! భ్రమ కానిం డే మయినఁ గా నిందు దైవసాక్షిగ నేను నాయర్హాకృత్యమునే యాచరింపు చున్నాను.

రాజ:—నీవు తప్పు నడచితి వనియా నాయభిప్రాయము! ఇరువురుభార్యలఁ గలుగుట నేనేత ప్పొనరించితి. కాలహరణము కావింపక నా కనుమతి నిడుము. పనివినియెదను.

హితులు దుర్గాధిపతులు రౌతులు రైతులు వేత్రహస్తులు వీరభటులు దొరలు మన్నీలు నుచ్చైశ్శ్రవ మనం దగు నుచ్ఛ్రాయాజానేయముచుట్టును బలిసి కొలిచి యుండిరి. ఆ యుత్తమాశ్వము పచ్చసార్యపటంపుఁబల్లమును, నవరత్నఖచిత ఖలీనమును, మురువైన మొగముట్టును, జికిలినొకాటంపుఁబికిలి కుచ్చులను, రంగారుబంగారుపక్కెరను గలిగి విలసిలు చుండెను.

చూచు చుండఁగనె జీనులోని కాగిరి వజ్రాలమేలంక పన్నియలఁ బాదము లమర్చి నేర్చినకొలఁదిఁ జూచువా రత్యాశ్చర్యనిమగ్నులగునట్లు రవగాలు, జోడన, యష్టవేడము, దుక్కుడువాళి, జంగనడలు, గాపించుచు వాఱువమువశ్యము ధారుణికిఁ దగులునో యనునట్లుగఁ గంచుమించుగ రాజరాజ నరేంద్రుఁడు దండకారణ్యమునకుఁ దరలెను.



ఏడవ ప్రకరణము.

తత్త్వోపదేశము.

అంధకారబంధుర మయి సుషుప్తి మునింగినజగము మెల్లమెల్లనఁ దెలివిఁ గాంచు చుండెను. అది యంతయు నుదయ తరణికిరణపరంపరలమూలముననె. తమి మునింగి నీరములు జార విడచులోకమును దనమనోహరకరస్పర్శనమున వెలిఁగిం చుచు నిసుఁ డుదయగిరిసింహాసన మారోహించు చుండె. రాజు వలె రాజు బాత్రిగ మెత్తనివాఁడు కాఁ గూడదు. స్వతేజమున విలసిల వలయునే కాని పరులవయి నాధారపడఁ గూడదు ; అ ట్లయిన వానియేలుబడి యే మంత కాంతివంతము సుఖదము. కావుననే శీతకరరాజపాలనము కొందఱనే తనువు చున్నది: ఉష్ణకరదినరాజపరిపాలన మందఱం దనుపు చున్నది.

"గ్రహాచారఫలములను నరు లొప్పకొనుచునె యున్నారు. ప్రియశిష్యులారా! ఉదయమున వేదాధ్యయనపరాయణుం డగుబ్రహ్మంబలె నమాయికత్వమున మానవులు జ్ఞాన మూను చున్నారు; మధ్యఁ గాలాగ్ని జ్వాలలు పఱపి తీవ్ర మూను ఫాలాక్షుంబలె నరిషడ్వర్గముల కధీనులై తీవ్ర మూను చున్నారు; అంతమున సత్వగుణప్రధానుం డగుననంతుంబలె సత్వ మూను చున్నారు. త్రిమూర్త్యాత్మకుం డగులోకబాంధవుఁడు నిక్క-

ముగ లోకబాంధవుఁడె కదా! ఆహా! స్వగుణరూపముల కనువుగ నతఁడు లోకమును ద్రిప్పు చున్నాఁడు. ఏమఱక నిరీక్షించుచుఁ గరముల మీఁటి పో నియ్యకున్నాఁడు. 'యథారాజా తథాప్రజా' యని దినరాజు ననుసరించియే జనులును నడచు చున్నారు. ఆతఁ డేమి ప్రజల నంటియే నడపఁ గలుగు చున్నాఁడా? లేదు; తననడవడికలనే తనకీర్తితేజముననే తన చండకరదండనముననే తనసుఖదసంతోషజనకసత్వముననే యుష్ణుల నిప్పించుకతముననే చతురోపాయముల నివ్వడమిఁ ద్రిప్పఁ గలుగు చున్నాఁడు. పుత్రులారా! ధరిత్రీభారధారణు లెల్లరు నిట్లే త్రికర్మల నాదర్శనీయులై యుండ వలయు.

మనము నూరేండ్లు మనుదు మనుభ్రమను జనులు తగులు చున్నారే కాని పూర్ణముగ నూరేండ్లు నిండినయాకాలమును హ్రస్వముగ నెన్నక దీర్ఘముగ నెన్ను చున్నారు. విఘడియలు, ఘడియలు, జాములు, దినములు, వారములు, పక్షములు, మాసములు, ఋతువులు, వత్సరములు, ననియే లెక్కిడు చున్నారు కాని యిన్నిఁటితో ముగియు నీవత్సర మంతయు నాయనంతునివత్సకొక్కదినసమ యని తలఁప కున్నారు. అట్లు చూచిన మనపూర్ణాయుఃపరిమితి కాలకుఁ గొలఁదిదినములె యగును గాన దీర్ఘ మన సాహసింతుమా! చిఱుతకు దినములు పైఁబడినకొలఁది సారవిచారహీనతఁ బెనఁగుచున్నాఁడని మురియు చున్నారే కాని యాయుర్దాయమునఁ దఱుఁగు చున్నాఁ డని యెన్నరే కదా!

జీవితము స్వల్పము: ఈశ్వరదత్తజీవితము నయినఁ బూర్ణముగ మోక్షకార్యములకు వినియోగింప నియ్యనియవస్థలు మూఁడు. ఈమూఁడవస్థలును గాలగతి ననుసరించి యించుకంతనె ముగియు చున్నవి. తేజమున కయి మన మొకదీపమును నిలుప నాక్షణమున మాయాక్రిమిసృష్టి దానిచుట్టును గలుగు చున్నది; యది కీటకరూపమున మఱియొకక్షణమున భ్రాంతిమైఁ జెరలాడు చున్నది; తదుత్తరక్షణముననే బక్షము లూడి యసమర్థతఁ బొరలాడి యుసురు తొలఁగు చున్నది: ఇదియ యుదాహరణముగ జగము దనమాఁ తేజమున నత్యంతాశ్చర్యాకరముగ జనియించి త్రైయవస్థలను జెంది మ్రిందు చున్నది. నమమ నవతరించిన తెక్కలు నమమనె యంతరించు చున్నవి. క్రిమిగాఁ బుట్టి క్రిమిగా గిట్టుట సృష్టివైచిత్ర్యము! వార్ధక్యము మర్త్యునకు రెండవబాల్యము. బాల్యము క్రిమిసమము.

ప్రజలు పాకుచుఁ బడుచు లేచుచుఁ జతుష్పాదజంతువుం బోలి యుదయమునను, అంకెలు వేయుచు ద్రిమ్మరుచు ద్విపాదపశువుగ మధ్యను, న ట్టిట్టుఁ గదల నేరక యసమర్థతఁ ద్రిపాదజీవిగఁ దుదను, నిట్టులే పుట్టుచు మెట్టుచు గిట్టుచు నున్నారు. ఈయవస్థాభేదముల నొక్కింత విచారింతము; సర్వజనమోహనప్రదుఁ డయి భగవదిచ్ఛాధీనుఁ డయి యుండు ప్రథమావస్థకును, గామినీమనోహరుఁ డయి స్వశరీరజవనవ్యాపారముల స్వేచ్ఛాధీనుఁ డయి యుండుమధ్యమావస్థకును,

సర్వాసహ్యకరనిజతనూవిరక్తుఁ డయి యప్రయోజనపశ్చాత్తా
పార్తుఁ డయి యుండునంత్యమావస్థకును, వ్యత్యాస మెంతయో
చూపట్టు. చేతవాతఁ గానిప్రథమావస్థను నన్యాపుణ్యము నేర
కుండు. ధైర్యస్థైర్యశౌర్యముల వెలయుమధ్యమావస్థను గర్మ
గడించినవాఁ డగును. వడఁకునొడలు, తడఁబడునుడులు,
వడలెడునసలు, దడదడ లాడుగుండియలు, గలయంత్యమా
వస్థను రోఁతచేతస్కుఁ డయి యల్పపుణ్యార్జితుఁ డగును. ఆహా!
ప్రాఁకుచు స్వకీయసామర్థ్యవినర్జనమున భగవదనుగ్రహమునఁ
గలిగినలలితఫలసత్స్వార్జితములఁ దొలఁగి, త్రిమ్మరి యై యవ
యవనవజవసత్వావేశమున సురుచిరాకారమున సుమనోహరం
ద మాస్వాదించి యానందింపుచు నైహికంబునం బొరలుచు
నూర్జితపుణ్యార్జితముఁ దొలఁగ్గి, కలఁగుఁడు వడుచు నపటుత్వ
మున నచేతనాసహ్యముల నతికాలమునని రూపముఁ దొలఁగు
పట్టుపురుగే నరున కుదాహరణము కాదా! ఎప్పుడును గార్య
ములకు ముందే యోచన యుండవలయును; గాని యంతమున
నుండిన నంతఁగాఁ బ్రయోజన మేమి: కలకాలమే స్వల్పము;
బాల్యయౌవనముల భాగ్యభోగ్యసుఖ్యవస్థలఁ గడచినకాల
ము పోఁగా మిగిలినకాలము మూఁడవభాగము; అందునం
దిటపటుత్వములు లేమి నింద్రియవశీకరము కామి. నిద్ర రాని
వేళలు మిగులువార్ధక్యావస్థ కలకాలముతోఁ బోల్ప నలుసంతయే
కదా! అయినను మంతకాలమునఁ దెలివి గలిగినను నరుఁ డే

మంతసుకృతము నార్జించును. అది స్వపూర్వకృతదుష్కృత ఫలముల నే మంత భర్జించును.

సుగుణఖనిజనితుఁ డయ్యు జనుఁడు తనయిరుగుఁబొరుగు వారల నుండియు తాను సంచరించుచిరపరిచితుల నుండియు దేశవాసముల నుండియు స్వకుటుంబసంబంధుల నుండియు నడ వడు లలవరుచుకొను నను టకు సందియం బందం బని లేదు. బ్రాహ్మణవంశోద్భవుం డయ్యు బ్రాహ్మణేతరులవలయమునఁ జరియించు బాలకునకు శూద్రక్షుద్రభాషావేషము లలవడు టబ్బు రంబె! కులకాంతలచెంతను వెలకాంతలపొంతను వృద్ధిమంతము లగుచిలుకలు ము న్నగునవి నడలతీరున నుడులపోరున నేకరీతి నుండునే! భ్రమరకీటన్యాయముం బోలి మగనాండ్రనడుమఁ జెం పొందుమగవాండ్రును నాఁడువాండ్రఁ బోలి యాడు చుంద్రు. శూరులమధ్య శూరులును భీరులమధ్య భీరులును జారచోరుల నడుమ జారచోరులును సుగుణమణులనడుమ సుగుణమణులును భోగులలో భోగులును జోగులలో జోగులును నయియే వృద్ధి పొందక యితరు లె ట్లగుదురు. చందనవనమ్మునఁ దుమ్మచెట్టును దులసిమొక్కల గంజాయిమొక్కయు రత్నఖని ఱాలును గాన వచ్చిన నవి యపురూపము.

పిన్ననాఁట నుండియు నెట్టికృత్యముల కలవాటుపడునో మనుజుఁ డట్టికార్యములనె పెద్ద యయి తద్దయు నొనరించు. గురులగురునడుపదేశమునను కొమరులు కొమరు వహించెదరు.

పరిచయులఁ బరివారుల బంధుబృందముల సోదరసోదరీమణుల
జననీజనకులనడవడుల నాచారములు భూషణభాషణములు నన్నిం
టిని నతిసూక్ష్మముగఁ గని పెట్టునట్టి పరేంగితజ్ఞానమును ననుకరిం
చునూహను బరాత్పరుఁడు ప్రతిబిడ్డకును బ్రసాదించును. కావున
బాలబాలికలే దేనిఁ దప్పు నెప్పు డొనరించిన నది పై వివరిం
చినవారికడ నేరికడనో వారు నేరిచి యొనరిచినారే యని నిర్ధా
రణపఱచి యట్టిది వెండియుఁ జేయకుండ నట్టివారలఁ జేర
కుండఁ గట్టడి పెట్ట వలయును. కట్టెఁడులకుఁ గట్టెఁడులే కలుగు
చున్నారు. గయ్యాళులకు గయ్యాళులే పుట్టు చున్నారు.
ముష్కరులకు ముష్కరులే పొడము చున్నారు. స్వచ్ఛస్ఫటి
కము నలుపుఁ దగిలి నలుపును నెఱుపుఁ దగిలి యెఱుపును బసుపుఁ
దగిలి పసుపునుం గారంగుఁ బడయు చుండుట లేదా? అట్లే
కిశోరస్వచ్ఛస్ఫటికాంతరంగము మలీమసవృత్తి మలినము
నొందును. దానిఁ బరిశుభ్రపఱచుట దుస్సాంగత్యాదులఁ దుడిచి
వేసియే.

భూతదయ యన నెఱుఁగమి నలవాటున నెందఱెందఱో
మత్స్యమాంసాద్యాహారము నొనరించు చున్నారు. ఇదియుఁ
దనుపోష్యయాచారదోషముననె వా రొనరుచు చున్నారు.
పృథివీతలంబునం బుట్టు వొందినభూతంబులం దమ్ముం బోలి
నమ్మూర్ఖులు జలంబునం బలంబునం బట్టి వాని గట్టి ఱాతిగుండియ
ముట్టుపెట్టి పొట్టం బెట్టక పిల్లలు కొనియాడం దగువిధంబునం

శ్రేష్ఠమైయి సంచరించుటయె భూతదయ. 'అహింసా పరమో ధర్మ' యనునానుడి నానుడి కాదు సుఁడీ. రుచిఁ గలపదార్థ మని మెఱచి భుజియించుట మంచిది కాదు. తగదు తగదు మున్మాటికి నది నరులకుఁ దగదు. నిరపరాధము లగుమృగ ముల బిఱబిఱ బఱబఱ నఱపులు పఱపు చుండఁగనే యఱు తలఁ దెగఁగోయు సదయహృదయులును ముద మొదవ వలలు వయిచి జలచరముల విలవిల లాడునటులఁ దలలు విఱిచి యుద రమున వైచుకొనుజాలరులును హేయం బగుకాయంబునె నిశ్చ యం బనుకొని దానిం బెంపు చేయుతలంపున వీతదయు లయి పదనుశరంబుల నానావిధపక్షిబృందంబుల నసురులు తొఱఁగ నేయుబోయులును మృగముల సంహరించుమోటువేఁటకాం డ్రను నాటవికులును మితి మీఱు చుండ భూతదయ యెట్లుండు. పుత్రమిత్రకళత్రములు ధాత్రి గాత్రావశిష్టులై యుండుతఱిం బుడమిం బడి కడుఁగడు నడలుచు 'దీనరక్షకా! ఆపదుద్ధా రకా! జగదవనా! పావనా! మాయార్తి నాలించి మా యాపదం బాపవే! యని మొఱ లిడువా రతనిబిడ్డ లగునితర జంతువులప్రాణంబులం బాపుట కె ట్లోపుదురో! తమతమ తల్లుల నుండి పిల్లలను సోదరసోదరీమణులను బంధుబృందము లను జగన్నాథుఁడు వేరొనరించినప్పుడు తా రెంతగాఁ జిం తింతురో యంతగానె వానివానిపిల్ల లాదిగాఁ గలవారిఁ దారు దూర మొనరించినతఱి నవియు నంతవంత నొందు నని యేల

డెందములం దల్లఁపరో! అయ్యో! వారు పరిమార్చినశకుంత
సంఘముల నెన్ని తమచిట్టిపొట్టల గ్రుడ్ల ధరించినవో యెన్ని
తమపొదుగుచుఁ బొదుగుచు నున్న యండముల గూండ్ల విడిచి
యాఁకలిఁ బోకార్ప వచ్చినవో యెన్ని తమచిన్నివిహంగముల
కాహారము గొనిపోవ నరుదెంచినవో యెన్ని యాగంతుకుల
కతిథిసత్కారములు నెరపి భోజనసదుపాయములు సమకట్టఁ
జనుదెంచినవో యెన్ని సంతోషపారావారమున నోలలాడుచు
ముద్దులు కులుకుకలకలనినదముల జోడు వీడక కూడి యాడు
చున్నవో యెన్ని గృహనిర్మాణదక్షణాద్యేతరకార్యముల నుద్యు
క్తము లయి యరుగుదెంచినవో. యెవ రెఱుఁగుదురు! కట్టా!
పట్టెఁడుపచ్చిక మేసి పరులకు హింస సేయనిపొట్టేళ్ళను నా కల
ములు తిని కాలము కడపుమేఁకలను నంబకానందకరంబు
లయి మృదుమధురస్వరంబులం బఱపునిరపరాధపక్షిబృందం
బులనుం బొట్టం బెట్టుకొన నె ట్లూహింతురో!

మత్స్యమాంసాద్యాహారమున మేదస్సు క్రొవ్వుఁ బట్టు
చున్నది; దాన బుద్ధిమాంద్యము కలుగు చున్నది; యంతఁ
గామక్రోధలోభమోహమదమాత్సర్యములకు లో నగు చు
న్నారు మానవులు. ఇఁక దుండగము దుష్కృతము దురా
లాపము లేల తెలియఁ బడు. ఒకటా! దురాచారమా దుష్టా
లాపమా దుర్నయమా దుర్బుద్ధియా యెన్ని రౌ యావరించు;
వావివరుసలు పోవును; అకాలసకాలవివేచన మీను; నిజమద

డెందములం దలఁపరో! అయ్యో! వారు పరిమార్చినశకుంత
సంఘముల నెన్ని తమచిట్టిపొట్టల గుడ్ల ధరించినవో యెన్ని
తమపొదుగుచుఁ బొదుగుచు నున్న యండముల గూండ్ల విడిచి
యాఁకలిఁ బోకార్ప వచ్చినవో యెన్ని తమచిన్నివిహంగముల
కాహారము గొనిపోవ నరుదెంచినవో యెన్ని యాగంతుకుల
కతిథిసత్కారములు నెరపి భోజనసదుపాయములు సమకట్టఁ
జనుదెంచినవో యెన్ని సంతోషపారావారమున నోలలాడుచు
ముద్దులు కులుకుకలకలనినదముల జోడు వీడక కూడి యాడు
చున్నవో యెన్ని గృహనిర్మాణదక్షతాద్యేతరకార్యముల నుద్యు
క్తము లయి యరుగుదెంచినవో. యెవ రెఱుఁగుదురు! కట్టా!
పట్టెఁడుపచ్చిక మేసి పరులకు హింస సేయనిపొట్టేళ్లను నాకల
ములు తిని కాలము గడపుమేఁకలను నంబకానందకరంబు
లయి మృదుమధురస్వరంబులం బలుకునిరపరాధపక్షిబృందం
బులనుం బొట్టం బెట్టుకొన నెట్లూహింతురో!

మత్స్యమాంసాద్యాహారమున మేదస్సు క్రొవ్వుఁ బట్టు
చున్నది; దాన బుద్ధిమాంద్యము కలుగు చున్నది; యంతఁ
గామక్రోధలోభమోహమదమాత్సర్యములకు లో నగు చు
న్నారు మానవులు. ఇఁకఁ దుండగము దుష్కృతము దురా
లాపము లేల తెలియఁ బడు. ఒకటా! దురాచారమా దుష్ట
లాపమా దుర్నయమా దుర్బుద్ధియా యెన్నిరో యావరించు;
వావివరుసలు పోవును; అకాలసకాలవివేచన లేదు; నిజమద

మున నెల్లవేళల సంచరించుచు ననుకూలఋతువులనె సంగమిం
చుట తక్క వేరు నేరనిపశుపక్షికీటకక్రిములకన్న నధమాధ
ముగ సర్వకాలసర్వావస్థలఁ గామక్రీడానిమగ్ను లయి యుం
దురు. పతితు లన నట్టిేడులు కారే!

అనివార్యమోహావేశమున నంధుం డయి మనుజుండు
సుందరుల నాసించు చున్నాఁడు. ఆహా! అందునం దాను
సత్యాసత్యముల నెఱుంగక పొఱం బడు చున్నాఁడు. కామ
మునకుఁ గన్ను లే దనిరి; హా! లోచనమే కాక యాలోచన
మేది! నిక్కము వక్కాణింతుఁ; బక్షపాత మింతయు లేదు:
స్త్రీలా సుందరులు పురుషులా! ఇందులకుం బక్షివర్గంబునె
మన మనుసరించ నిదర్శనములు వెదకుదము. వానరుల నుండి
నరులుగాఁ గాలక్రమమున మాఱినమనము మత్స్యమాంసాది
భక్షణమున కింతయుఁ దగక శాకఫలాహారమునకె తగినట్లు
స్పష్టీకరించు సృష్టివైచిత్ర్యమే పురుషులు—స్వలోపమునఁ
గామాధినివేశమున యుక్తాయుక్తపరిజ్ఞాభంగమున నోర్పులోప
మున స్త్రీలే సుందరు లనుకొనినను నిజముగ నిశ్చయముగ
నిర్ధారణగ నిర్వివాదముగ—పురుషులే సుందరులు సుమీ!
యని నిరూపించు చున్నది. ఏ మది తనయులారా! మీ రొం
డొరుల నాశ్చర్యకరముగ నాలోకింప నేల! సంశయము వలదు.
కామాక్షిం గాక సహజసౌందర్యజనితం బగుప్రకృతిని నిర్మ
లాక్షి వీక్షింపుఁడు; సర్వము విశద మగు; సంశయ మెడలు;

ఆహా! మీ కంఠాతురత యేల! నైసర్గమును గాక విసర్గ
మునే నేఁ బలుకు చుంటి ననుతలఁపా! బాపురే! బోడి మై
నీలవర్ణమునఁ బొడకట్టెడియాఁడునెమలియు నాఁడుకోకిలయు
సుందరములా ఆనందకరము లగుచిత్రవిచిత్రవర్ణవిలాసశోభిత
పింఛములు గల మగకేకియుఁ గోకిలయు సుందరములా! కల
కంఠనీలకంఠముల నటుంచి మగచిలుకమగపిచ్చుకల వగుకంఠ
ములు విలోకింపుఁడు; దీన నాఁడువానికన్న మగవియే సుందర
ములు: వాని వగుకంఠావలోకనముఁ జాలించి మగపంది మగ
యేనుఁగుల మొగములు తిలకింపుఁడు. మిక్కిలి చక్కనై నిగనిగ
లాడు కోరలు కల వాని మాని దంతవిహీనము లగువానియాఁడు
జాతిఁ గనుఁగొని యేవి సుందరములో తెలుపుఁడు. వీనిమొగ
మందమును వానితోఁకయందమునుం దిలకించినయనంతరము
మొగములను దోఁకలను గూడం జూడం జూడ మనోహరము
లగుపుంజును మగసింగమును బరికింపుఁడు; నిస్సంశయముగ
సింహావలోకన మొనరింపుఁడు; సమస్తము మీకె బోధపడును.
అంతయు బోధపడు నన నేమి యాద్యంతముల నవి సుందర
ములే కాని రూపమున నంతయు నవి సౌందర్యవైభవోపేత
ములా యనుకొను చున్నారా యందుల కావృషభేంద్రముం
దిలకింపుఁడు; మహానందదాయకము! మహాశ్చర్యము! కావున
నావిరించినిర్మాణముల నేది సుందరము? అన్నిఁటను బురుష
జాతియే సుందరము. ఆకారణముననె పురుషులు సుందరులు

సుందరులు కారు. కామసంహారము కావింపఁ బడిన యెడ్డు అవున కీడయ్యెఁ గాని కామసంహారము కావింపని మూర్ఖుఁ డాఁడుదాని కీడు గా కున్నాఁడు. ఇది స్వయంకృతాపరాధమే!

చిరజీవులారా! యెందుకు మందహాసము ముఖవికాసము తనూవిలాసము! పురుషులే సుందరు లని గరువపడకుఁడీ. గరువము కానిది. పూర్వము గర్వము నొందినయజ్ఞాని సంబోధించి యొకజ్ఞాని యిట్లు వరుసం బోధించి పంచె. 'జలబుద్బుద ప్రాయంబు లై మృద్ఘటసారతుల్యంబు లై హేయపదార్థ భూయిష్టంబు లై సర్వదావిచారకారణము లై నిలుచునీదే హాత్మాభిజాత్యము సర్జింపుము విసర్జింపుము. దుర్గంధపదార్థ ముల విసర్జించునీనవరంధ్రయుత మగుతోలుబొమ్మపై నభి మానముఁ దొలఁగఁ ద్రోయుట ప్రశంసయే ప్రశస్తమే! జననీ జనకులశోణశుక్లములఁ గలిగినయీమలిన శరీరశల్యములపైఁ బ్రేమఁ బూనకుము. ప్రతిదినమును బరిశుభ్ర మొనరింప కున్నఁ గంపుఁ గొట్టునీదేహమున కై యభిమాన మేల! కం డబలుపునఁ గానితోఁ ద్రవలఁ బట్టించునీయాకారమున కై యాశ లేల! అస్థిర మగునీయస్థిపంజరమునకు మురియుదు వేల! క్షుర మగునీశరీరమును శుద్ధిపఱచుటకును వృద్ధియొనరుచుటకును జేయుప్రయత్నము లెల్ల నక్షుర మగునీయంతరాత్మకుఁ జేసి న చో సుస్థిరుఁడ వయ్యెదవు. పరుల హేయములం గని రోఁత పడునీవు నీలోని దగునశుద్ధమును గనుఁగొన కున్నావు: తెలి

నీయు వీడ కున్నాఁడవు. ఇది నీస్వాభిజాత్యమునఁ గదా! మాతృపితృశోణితశుక్లనిర్మాణ మగునీవ్యక్తి కసహ్యము జనింప కున్నను ఋతుమతిగా స్రవించుజననిరక్తమును గామోద్రేకమున వెలిఁ బడుజనకునివీర్యమును బ్రత్యేకించి కాంచిన నసహ్యము పుట్టదా! మూల మెఱిఁగిన నీ కభిమానము నశింపదా! మఱి జననీజనకుల శోణితశుక్లసమ్మేళనమ్మే కదా జనయిత్రి గర్భకోశమున నండ మై పిండ మై శిశు వై మఱిమఱి వృద్ధి పొంది యీవ్యక్తిఁ దాల్చు చున్నది! కాలక్రమమున స్వసామర్థ్యమునఁ బ్రథమావస్థఁ దొలఁగి యిట్టు లున్న యీవ్యక్తిపై మమకార మూను చున్నాము. మంటిని విభాగించి యుచిత సమ్మేళనము నల్పజ్ఞుఁ డగుచక్రి కుండను జేయు చున్నాఁడు; ఉచితజ్ఞుఁ డగుమఱియొకఁడు పింగాణిఁ జేయు చున్నాఁడు; అధికజ్ఞుఁ డగునింకనొకఁడు లోహమును (అల్యూమినియమును) జేయు చున్నాఁడు; సర్వజ్ఞుఁ డగుచక్రి మర్త్యునిఁ జేయు చున్నాఁడు. అయిన నొకటి నొకటి మించి యాకారములను వర్ణములను దళుకులను నవి నిర్మాణకర్తలకళాకౌశల్యాదులం బట్టి వేఱువేఱుగఁ బొడకట్టినను నన్నియు నొకటియే; యన్నిఁటికి మూలము మన్నే. అబాడి చూడ నసహ్యమే కదా? నీవు నీబహిరింద్రియములకుఁ గట్టు వడక యంతరింద్రియముల నణఁచితి వేని లేని దేమి! మనోవాక్కాయకర్మంబుల సర్వము నొసఁగింపుచు శివకేశవభేదవాద మూనక యూరక యిష్టదైవ

ముచు నెమ్మది నెమ్మదిఁ బ్రతిష్ఠించి పవిత్రాచారము పవిత్ర వాక్కు పవిత్రప్రవర్తనము గలిగి ముముక్షుఁడవు గమ్ము. పూర్వకర్మఫలమునం జేసి దొసఁగు లబ్బినను దబ్బిబ్బ వడి మాయామోహప్రపంచమునఁ దగులువడి వడి మగుడఁ గర్మను గూర్పక యోగ్యమై వెలార్పుము; మనకునవే వాని నూరార్పుము; రోషతోషక్లేశముల నార్పుము; శోకార్పఁ దీర్పుము. నీకు మోక్షము కరతలామలకమై యుండు నంతట. ఆశాపాశమునఁ జిక్కి యమపాశమునఁ బొక్కుటకన్న నభేదప్రవృత్తిఁ గ్రమ్మ నిఖిలలోకైకాకారుతో నైక్యమ్ము కమ్ము. సర్వాత్మకుండును సర్వాంతర్యామియు సర్వరక్షకుండు నగుననంతు సమ్ముఖమ్మున నీవు కప్పిపుచ్చున దేది! తనకలయుదంతము శాంతముగ సాంతముగ నెఱుఁగక యరదములోనిజడుఁడు తన మనోరథము నెరవేర్ప రథము వడివడిఁగా నడపుట లే దని నియంత యంతచాకచక్యము కలవాఁడు కాఁ డని తనకోరిక తీరుపఁ డని నిందించుమాడ్కి జీవయాత్రఁ గలయునర్థంబు లెఱుంగక తనివిసనక భోగభాగ్యము లవ్వారిగ నపేక్షించి వీక్షించునే కాని నియంతఁ బోలి జగన్నియంతఁ బోలి లోటుపాటుల దూరభారముల నేర కున్నాఁడు. ఆతనిచేత లన్నియుఁ దనమంచికే యని యించుకయు నెంచకున్నాఁడు. పామరుఁడా! తెలియు మీభాగవతభావము: నీసమస్తశరీరమే రథము; సారవిచారమే సారథి; బహిరింద్రియములే వారువములు; మనమే

పగ్గములు; ఉసురులే యిరుసులు; ధర్మాధర్మవర్తనములే రథాంగకములు; చిత్తవృత్తులే వివిధబంధములు; శబ్దగుణస్వర్ణాదులే సంచారస్థలములు; జీవుఁడే రథికుఁడు; ప్రణవమే ధనువు; శుద్ధజీవుఁడే బాణము; పరబ్రహ్మమే పరమలక్ష్యము; భయము మదము ద్వేషము శోకము లోభము మోహము మానము మత్సరము మున్నగు నవియ పరములు; ఇట్టిస్వశరీర రూప మగుతేరు వశము చేసికొనియే కడతేరు చున్నాఁడు భక్తుఁడు.

మనకర్మానుసారముగనె మనకుఁ జింతయు సంతసముఁ గలుగు చుండుట మనము వానికై యావంతయు వంత నొందరాదు. మనస్వార్థకుక్షి నిండి విపరీతచర్యల నలజడి పుట్టించియో యనారోగ్యము గలిగించియో బాధపెట్టియో యనాదరణపాత్ర మగుజీవసముదాయమును మనము బయటఁ దోలి పరిమార్చునట్లు తనకునోదరమున నిమిడి యదౌర్భాగ్యముగ విపరీతముగ హానికరముగ నభివృద్ధియై సంచరించుమనలనుమాత్ర మానసర్వేశ్వరుఁడు వెలిఁ బెట్టి మట్టుపెట్టఁడా! అజ్ఞానతిమిరమున జననజరామరణములు గలమనము మనయంతర్జీవులపై సర్వాధికృతిఁ గలుగ కున్నాము; సుజ్ఞానతేజమున నాదిమధ్యాంతరహితుఁ డగునతఁడు సర్వాధికారియై పొలుచు చున్నాఁడు. ఇదియ వానికి మనకుఁ గలభేదము. ఇది తొలఁగ నొకటియు.

కుమారులారా! మీరు జపతపముల నలుప నక్కఱ

లేదు. ఉపవాసముల సుగ్రక్క నక్కఱ లేదు. వేషభాషలఁ బూన నక్కఱ లేదు. నిర్మలచిత్తులై సత్యసత్యవ్రతులై భూతదయాపరులై కాలము కడపినం జాలు నిత్యసుఖసత్య ధామముం జేరుదురు." అని నన్నయభట్టారకుఁడు వినిచి యుచిత కార్యకరణీయముల కై లేచి యరుగ గురుగురుపదేశనూతన పారపరనాధురంధరులై చర్విత చర్వణముగ నెమరువేయుచు నలసవిలసగమనముల సుబుద్ధిసారంగధరులును బనివినిరి.



## ఎనిమిదవ ప్రకరణము.

### విరహవేదన.

పండువెన్నెలలు గాయుచుండెను. వెన్నెలపులుఁగు లావెన్నెలఁ గ్రోలుచుఁ జరించుచుండెను. బ్రహ్మాండభాండ మంతయు వెల్ల వేసిన ట్లుండెను. రాత్రించరములు తప్ప సమ స్తజీవరాసులును గొంచె మించుమించు నిద్రానష్టఁ బొరయు చుండెను. గౌతమీతీరమునం గలనూతనాంతఃపురము ప్రకా శించుచుండెను. ఆయంతఃపురమునకుఁ బడమర వరలుచున్న పావనగోదావరీవీచిక లాభవనప్రాకారము నొరయుచు విరియు చుండెను. తారలు స్వారు మీఱితి యుండక చంద్రకిరణములఁ దమతేజ ముడిగి యొకవిధముగఁ దళుకు లీనుచుండెను. చం ద్రకాంతములు కరఁగి ప్రవహించుచుండెను. సూర్యకాంత

ములు వెలుఁగ కుండెను. అళిసంతతులు కలువపూఁదేనెలు గ్రోలు చుండెను. బారులు తీరి యాశీతకిరణునిసితకాంతుల నాయసితాంగములు ఝుమ్మని పాడు చుండెను.

ఏ మది! గౌతమీతరంగఘోషకుఁ దోడుగా నేదియో మఱియొకఘోష విన వచ్చు చున్నది! విన విన నది యొక యంగనస్వరము నా నున్నది. ఔ నది స్త్రీనినాదమే. ఎం దుండి వచ్చు చున్నది? గౌతమీతీరమున నూతనముగ వెలసి నయంతఃపురోపరిభాగము నుండియే. ఆ స్వర మి ట్లను చుండె.

"హా! కూళదైవమా! ఈమాయావిచే నాగొంతు కోయించితివా! నాప్రియ మెల్ల నడవిఁ గాచిన వెన్నెలఁ జేయు చుంటివా! కట్టా! యెట్టికట్టఁడితనమున కొడిఁ గట్టితివి? అయ్యో! ఇఁక నేమిమార్గము! మరణమే శరణమా! ఉపా యాంతరము లేదా! అకటా! పాపిగురూ! నీపలుకే నిరు కయ్యెనా! ధాతా! నాతల నీవ్రాఁత వ్రాయ నీకుఁ జేత మె ల్లాప్పె! జేతు లెట్లు వచ్చె? వ్రాసితివి పో నన్నెందుకుఁ బనికి రానిదానిగ నైనఁ జేసితివి కావే?

హా! తల్లీ! నానాకష్టములు పడి నవమాసములు మోసి మోసి గారాబము మీఱఁ బెనిచి పెనిచి తుద కీబోసి నోటిమెకమున కప్పగించితివా! అట్లు చేసినను గొంతమేలే! యేలయా మెకమున కప్పగించిన నది యొక్కసారి దిగ మ్రిం గును. ఈముసలివాఁ డట్లు కాదే! జీవము లుంచియే వేదనఁ

బెట్టుచున్నాఁడు. పలుక వలె నఁట వానిపలుకు పడిపోను; గౌఁగి లీయవలయు నఁట వానికౌఁగిలి కాలిపోను; ముద్దు లిడ వలె నఁట వానిముద్దులు మొద్దులు గాను; వాఁ డేడ? నే నేడ? అయిదుపదు లీ డాతఁడిది అయిదుమూఁడు లీడు నాది. అకటకటా! యేటి కీప్రాయ మీయేటికేనా?

కత్తికిఁ బెండిలి చేసి నాకుత్తుకఁ గోసితివా? తండ్రీ! తండ్రీ! ఘోరతపములు చేసి భూరిదానము లొసఁగి కడు పారఁ గాంచి ముదమారఁ బెంచి నన్ను నీపుత్రిఁ జంద్రకళ యనఁ బొలుచునీపుత్రి నయ్యయ్యో! ధవళచంద్రా! ప్రాయము వచ్చినంతఁ బూర్ణసౌందర్యము పొలిచినంతఁ జేచేత నీరాహుగ్రహమునకు నొప్పఁ జెప్పితివే? హా! నాప్రారబ్ధము! కాలవ్యతిరేకమును నిందింపుచుఁ గర్మబంధనవిమోచనకుఁ బ్రార్థింపుచు నే నిక్కడ వగలఁ బొగులుచుండ బలపరాక్రమాతిశయములఁ దొలుకాడుచు నజేయుఁ డయి యున్న యీతని నాజి నిర్జించుశక్తి లేమి దుఃఖింపుచు నాదుస్తరావస్థకు నీ వక్కడ నెంతచింతఁ గృశింపు చున్నావో!

కటకటా! కంటికి మంటికి నేకధార గా నేడుచుమాయేదుపు నీ కెన్నఁడు ఘటించునురా క్రూరా! నే వచ్చినదిమొదలు నాయండన కాఁపుర ముండుచు నానావిధముల బ్రతిమాలుచుఁ జిలుకను జూచునట్లు చూచెద నీ కేమియు లోపమురా నీయను బట్టపుదేవికన్న నిన్నే మిన్నఁగఁ జూచెద నన్నుఁ

కన్నారఁ గాంచు మని యనుదినమును బ్రార్థించుచున యుం
డును. వానిచూపు నున్న గాను, జిలుకను జూచునట్లు చూచు
నఁట. ఈసుందరమందిరమందిరారామముల సుఖ మింతయు
లేక యున్న నాబ్రతుకు నిక్కువముగఁ బంజరమున నున్న పక్షి
వలెనే యున్నది. ముసలివానికిఁ బడుచుచెలువయుఁ బడుచు
వానికిఁ క్రొత్తవలువయు దొరకినఁ గులుకఁట. తృణశాల
మెడఁ బాయ రఁట. వాస్తవమే. చీరచెఱఁగు మాసిన వీడి
యుండునే కాని లేనిచో నెడఁ బాయఁడు.

జవ్వనమా! నన్నేల పాయ కున్నావు? సౌందర్యమా!
నీ వేల చావ కున్నావు? అరిషడ్వర్గములారా! మీ రేల
యణఁగ కున్నారు? అయ్యో! మిన్ను విఱిగి మీఁదఁ బడ దేమి?
మేడ కూలి కప్పివేయ దేమి? భూమి క్రుంగి లోనికిం గొంపో
దేమి? గాలము పొంగి మ్రింగివేయ దేమి? అగ్గి పుట్టి బుగ్గి
గావింప దేమి? పిశాచములు పట్టి పీడింప వేమి? నిశాచరులు
వచ్చి నిధనము గావింప రేమి? హా! చిత్రాంగీ! చిత్రాంగీ!
నీ వెంత మొండిబ్రదు కయ్యెనే!

మదనా! మదనా! యే మిది? యదయుఁడ వై నీవద
నగునాయుధముల నాయెద నాటించు చుంటివి. అమ్ముకచెల్ల!
చాలుఁ జాలు నబలలపైనా నీపరాక్రమము! పిచ్చుకపైఁ జం
ద్రహాస మెత్తెదవా! ఆఁడువారి నేడిపించుటయా నీమతము!
కట్టా! హరికి సిరికిఁ బుట్టిననీ కిట్టికట్టిఁడితనము పట్టువడ నే

మిత్రా! నీరూపు మాపుగాను, నీవిల్లు పిప్పి గాను, నీనారి సారసములచేతఁ జిక్క; నీటెక్కము నీటఁ గలువ, తులువ! చెలువలపైనా నీచలము! నీచము నీచము. ఏచకు మేఁచకము. మారా! నీకు నీమేనమామపోలికలే వచ్చెనఁటరా! అంగము లేకయ యంగనలం గలంగించు చున్నా వేరా! మా పాప మెంత పండి యున్నదో మాదురదృష్టమహిమ యెంత కలదో యారతీపతిమంగళసూత్రము తెగియుఁ దెగ దయ్యె.

రాజా! ఏమి నీవును నీతేజము చూపు చున్నావు! శీతాంశుఁ డందురే యి ట్లుడికింపు చుంటి వేమి! అయ్యో! నీకు రాజత్వ మె ట్లొప్పెఁ జక్రములు మనియెనా! సత్సంతతులు మెచ్చెనా! అహో! తమ్ములఁ బాదమ్ములఁ దన్ని చెన్ను తగ్గించుటఁ గాఁ బోలు నీకు రాజనామము చెల్లెను. కట్టా! వానినెలవు కూల! ఆనలువ నిను సృజియించినాఁ డేల! దోషాచరనామము నీకు స్థిరముగఁ జెల్లును. నీమూలమునఁ గాదె నిర్జరాచార్యుఁడు పెక్కులిక్కట్టులఁ జిక్కినాఁడు, నీమూలమునఁ గాదె నిర్జరపంక్తిఁ జేరినరాహు వార్తిని మునిఁగినాఁడు, నీమూలమునఁ గాదె నీలకంఠుని పెద్దకొడుకు కడుపు విచ్చి కూలినాఁడు, నీమూలమునఁ గాదె నీలవర్ణుఁడు పెద్దనింద నొంది శ్రమంబు పొందినాఁడు, మఱియు నీమూలమునఁ గాదె శరనిధియును గమలయును గష్టములఁ బడి కలఁగుచున్నారు, పైకి నే మెఱుంగనివానివలెనె యుండి కూళ! తడిపాతలో గొంతు

గోతు వౌర ! దుఃష్టుఁ డైనను నేమి తోఁ బుట్టు వాతని ద్రుంగె
నఁటంచు నెఱుంగ వేమి ! మిసమిస లాడెడుమేనల్లు నింతలో
నీఱు చేసె నఁటంచు నేర వేమి ! శక్తి యింతయు లేక రథ
చక్రముగఁ బెట్టి నలిపినవాఁ డని తెలియ వేమి ! శాపం బొ
సంగినశర్వాణిప్రియుఁ డని జ్ఞప్తిఁ బెట్టుకొనంగఁ జాల వేమి !
అన్ని యెఱిఁగియు ముక్కంటియలికమునను నిలిచియున్నావు
కులుకుచుఁ—గులుక ?—కాదు కంఠమునను గంటను గలకాళ
కును వగపు గాక ! ఔ నౌను గా వలయు నంతె. హరిణాం
కుఁడు శశాంకుఁ డనుచు నిన్ను వర్ణింతురే కాని యాహారుని నే
త్రాగ్నికిని హాలాహలమునకును గమరి కమరి శిరమంటఁ జను
నలు పని నీకళంకము నెన్న కున్నారు ! ఔరా ! ఎలుకకుఁ
బ్రాణసంకటము పిల్లికిఁ జెలగాట మనున ట్లుండె నీచరిత్రము
చంద్రా ! ఒడలు కమరి నీవు వగచు చుండ వారు పొగడు
చుండిరి. గురుద్రోహీ ! కడుపారఁ గన్నగురుఁ గలఁత పెట్టు
చుంటివి. మదమూర శాస్త్రములు నేర్పినగురుఁ గలఁత పెట్టి
యుంటివి. నిన్ను పట్టి పాము గఱవ నీచెన్ను నన్ను గిల్ల నీవు
సముద్రమునఁ బడిపోను నిశాచరా ! మిత్రప్రసాదమునఁ గలి
గినశోభకుల కేనా యింత కులుకు చున్నావు ! ఏయన్నెము
పున్నె మెఱుఁగని నన్నారడింప నేఘునుఁ డైన నడ్డుపడి నీ
రూపుమాపఁ డేమి !

మలయమారుత ! యేల నీవును జల మూని నను మల

కాఁగఁ బెట్టుచున్నావు! నీపలుగాకితన మరసియే నలువ నిను చిలువల కాహారముఁ జేసె. ఈనీశూరత్వ మప్పు డెచ్చటకుఁ బోవునో పిక్కబల మగుపఱచి పర్వతగుహల డాఁగెదవు. డాఁగినంత నే మయ్యె. నిన్నవి వెన్నాడుచునే యున్నవి. కడకు వాని బాఁరిఁ బడఁ జాలక కాలికొలఁదిఁ బాఱుచు శీఘ్రగమనము చాలమి లేడి నెక్కి బెదర బెదరఁ దరుముచు నిలుకడమై నొక్కయెడ నుండ నీయక తరుముటయే గాక యాపిఱికి మెకము హాసులఁ బోరిగొన విరోధము కల్పించితివి. నహావాస మెంత చేసినది! లేనిచోఁ జివురుజొంపములు మేయుహరిణములు హారులఁ బోరిగొనునా!

హా! సారంగధరా! సారంగధరా! ముఖవిజితసారంగధరా! హా! నామనోహరా! నవమన్మథాకారా! రూపపటమే కాని నీరూప మొకసారియుఁ జూపవు! నీకు నేఁ జేసిన దోస మేమి! దోసకారి నీతండ్రి నీ కేమి బోధించి యుండెనో నాయుసురు పోసికొనుటకు. నవయౌవనాకారుఁడవును సుగుణగణుఁడవు నగు నిన్ను వరియించితినా యౌవనము తొలఁగి కాముకుఁడై యున్న నీగురు వరియించితినా! నీకును దెలియును గదా! యెవరియొక్క రూపపటము నాకడ కనిపిరో యెవరు నన్ను చెట్టఁబట్టిరో! కట్టా! యెవరివారు వారికి మంచివారుగఁ గనుపించెదరా! నీమెత్తఁదనము గనిపెట్టియే నీజనకుఁ డిట్టికట్టఁడితనమున కొడిఁగట్టుచున్నాఁడు. “అహింసా పరమోధర్మ”

"పరోపకారార్థ మిదం శరీర" మ్మనిరి. నిన్ను వరించుటనే కదా నా కీపాటు! రమ్ము రక్షింపుము రక్షింపుము.

ఏరా! మారా! రమాకుమార! నన్ను బన్నములఁ బెట్టు చున్నావే కాని యీసారంగధరుని గారియ వెట్ట కున్నావు! అహో! కారణ మిదియా! ఇదివఱకు విగతదేహు నొనర్చెఁ గాని యిపుడు విగతజీవు నొనర్చు ననియా నీజంకు!

చెడుగుఁడా! కొడుకన కని యడిదమునకు ముడి యిడఁ జేసి నన్నూరు చేరిన వెనుక ముదమారఁ బరిగ్రహించితివా! కన్నీరు మున్నీరుగ నడలునాయమరు తగిలి నీయును తెన్నఁ డెడలునురా! నీరూపుమాపుగాను నీసారు నీఱుగాను నీసంపద పాయ. నీవు దాపురించితి వేరా! సామంతుఁడ నేమి చేసినఁ జెల్లదు? ఏరు నన్ననువారు? అని యుబ్బుచు గొబ్బున నీ మాయావాగురులఁ బడఁ ద్రొబ్బితివే కాని నిందుజవ్వనమున మోహాతిశయమున నున్నయబలను బలిమిని గౌఁగిలించునిన్ను యముఁడు క్రమముగ శిక్షింపఁడా! ఈపాయవశమున నెట్లో వలను వైచి సారంగధరునితోడఁ గూడి నాకోరిక లీడేరుచుకొను వాన నే సజీవి నై యుంటినే కాని లేనిచో మరణింప కుందునా!

వంచనకు వంచనయ పరమోపాయము. కుక్కకాటు నకుఁ జెప్పుదెబ్బ యని నారూపపటము గనుఁగొని నాపై మరు లుకొని వలపు తీరిచికొను చున్ననిన్నుఁ బోలి రూపపటము నా రసి సారంగధరుని పైనే తలఁపు లిడి యున్న నేను నతని హృదయం

ఖమును బొంది యతనుసాఖ్య మలవరుచుకొందును. నీకుఁ బ్రతిక్రియ చేసియే తీఱుదును.

"మనోరమా! మనోరమా! లేవే! ఆశ లన్నియు ముప్పిరిగొన వనరుచిత్తాంగికి దిక్కు నీవే! వే వే నేఁ జెప్పి నట్లు చేయఁ గదవే!" యని యొద్దను దద్దయు నిద్దుర నున్న యనుఁగునకియను లేపెను.

"అబ్బా! యే మమ్మా! యెంతయాత్రమున లేపితివి కొమ్మా! కారణ మేమి ముద్దుగుమ్మా! నీమనోహరుఁ గలిపి కొనినట్లు కల కంటి వేమి బంగరుబొమ్మా!" యని కన్నులు నులుముకొనుచు ముసిముసినగవులు నగుచు మనోరమ లేచెను.

"అయ్యో! అంతభాగ్య మేలవడ నిన్నుఁ బ్రతిమాల నేల! ఏమి చేయుదును దెప్పవారికి దెప్పసందు నవ్వువారికి నవ్వ సందు. నాకర్మము." అని నుదురు తట్టుకొనెను.

"కాదమ్మా! కల కంటివో కనుఁగొంటివో యదృచ్ఛికముగ లేపితి" వని తలఁచితిని.

"కలయా! కన్నులు మూసినఁ గదా యేకల లయినఁ గలుగుట! కనుఁగొనుటయా యిప్ప డెట్లు! ముందుముం దేమో! అదియు నీసాహాయ్యమునను" యనియెను.

"నే నెట్లు తోడ్పడ వలయుఁ దెలుపుము?"

"రమ్ము ఇటు రమ్ము. లేఖ నొకదాని లిఖించుదము."

"ఎవరికి?"

"ఎంతకాపరమే నీకు! సర్వ మెఱిఁగియు నెవరి కనెదవు. నేను పడవుపడఁతుక ననుకొంటివే వారికి వీరికి నుత్తరము వ్రాయుటకు? ఎవరి కని యడిగెదవు?"

"కాదే చెలియా! మఱి నీకుఁ బ్రియు—లిరువురు—"

"ఛీ! ఛీ! వదరకు" మని బుగ్గఁ బొడిచి "ఇరువురుఁ బ్రియులా నాకు?"

"కాదులే ప్రియుఁ డొకఁడే. కాని ముసలివాఁ డున్నాఁడు గాదా పేరునకు?"

"ముసలివాఁడు ముగియ వాఁ డుండుటనే యింతముప్పు వచ్చినది. వానికి—నేను—ఈజన్మమున—ఉత్తరము—పంపుటా? కాలయాపన మేల రమ్ము శీఘ్రమ్ము." అనియెను.

తెల్లవాఱెను. దక్కులు తెలివి కాంచెను. ఉదయకాల విహారమున యౌవనులు విలసిలిరి.

ఊరికి దూరమున మహారాకారు లిరువురు నిర్జనప్రదేశమున నాలోచనముల లోచనములు నిగిడించి యున్నారు. నిశ్చేష్టులై కొంతపర్యంత మేమియుఁ బలుకరైరి. అనంతర మొకఁడు "ఔరా! కాలమహిమ! ఇట్టివిపరీతము పుట్టు నని యెన్నఁడును దలపోయ నైతిని. మొదట నారూపపటము పంప నేల! పిదప తాను జెట్టపట్ట నేల! ఈకమ్మ నాయమ్మ వ్రాయ నేల! అయ్యో! అయ్య తొలుత వివాహవిషయము నాతో ముచ్చటించిన నన్నియు నప్పుడ చక్కఁబడి యుండు. నాను

నము నెఱుఁగక పరిణయము తలపెట్టె. తరువాత గురుపారం పర్యము వచ్చుచున్న మర్యాదనైన నెన్నక యక్కన్నెపై మనసుపుకొనియె. తమ కిది తగదని గట్టిగ మందలించువారైన లేరైరి. సుమంతునిసువచనములు తల కెక్క వయ్యె. ఏండ్లు గడపిన నేమి యరిషడ్వర్గముల నడఁపక యున్న! గురుఁడు పూజ్యుఁడు. పలువురకుఁ జెప్పఁ దగినవాఁడు కాని పలువురచేఁ జెప్పించుకొనఁ దగినవాఁడు కాఁడు. ఇంతపర్యంతము నొవ్వనిపించుకొన్నవాని కిప్పు డిట్టి బుద్ధి పుట్టె. ఎప్పటి కేదియో! కడచి బ్రదికినవారలు పుడమిఁ గలరా! " అనియెను.

"మిత్రమా! ఏల యీలీల వగచెదు? కారణ మెట్లున్న నట్లగు. కాఁ గలది కాక మానునా! విచారించి చేయున దేమి? మనము మనజాగ్రత్త నుందము " అనియెను.

"జాగ్రతో భయం నాస్తి" యను నానుడి నిజమే కాని కాలము కర్మము కలిసి వచ్చిన నెట్టివానికిని బుద్ధి క్షీణించును. యుక్తాయుక్తము లెఱుఁగఁ బడవు సుబుద్ధీ! " యనియెను.

"అమనోరమ యెంతజాణ! సారంగధరా! నీవు కడవటఁకుఁ జదివినవెంటనె కమ్మ క్రిమ్మటఁ దెమ్మనునెపమ్మున నీకొరతలమ్మున నుండఁగనెంచెను. కాని దానికోరిక పూర్తిగ నెరవేరక యీయర్థభాగమ్ము నీహస్తమ్మునఁ జిక్కె. ఈనగ మైనను భద్రమ్ముగ నుంతు రమ్మ చనుద " మనియెను.



## తొమ్మిదవ ప్రకరణము.

స్వ ప్న ము.

జలజములఁ గళలఁ బెడఁబాయ రేయెల్లయు సుడికించితి నన్నా జలజనాథుఁ డేమి చేయునో యని కలువలచెలికాఁడు తల క్రిం దై నీట మునుఁగు చుండె. అళిసంతతులు కలువల చెఱఁ జిక్కి యుండె. ప్రభాతవాతపోతములు మెల్లన వీచు చుండె. ఫుల్లసితజలజగంధధురంధరుఁడై గంధవహుఁడు మంద మందగమనముల నుందగ మై యుండె. ఘూకములు తొఱ్ఱలఁ దూఱు చుండె. గబ్బిలములు తబ్బిబ్బయి పాడుచోటుల వ్రేలాడు చుండె. కాకములు కేక లిడు చుండె. ప్రభాతరా గమున నారు మీఱి యున్న యాకాశజలజము జలజాసనుఁ డగుపడ వికసించు చుండె. త్రిమూర్త్యాత్మకుఁ డుదయమున విరించి రూపుఁ దాల్చుట జగద్విదితమే.

నుదుటఁ దిలకము దిద్ద లేదు. మఱియుం గురులు ముంగురులు సరి చేసికొన లేదు. చలువవలువ కాని రవిక గాని మాసిన వని క్రొత్తవి ధరింప లేదు. ఒక్కనవరత్నఖచితమంగళసూత్రములు గలహారుమంజిముత్యములహారము మంజీర యుగముఁ దక్క బన్నసరములు బాజుబందులు కేయూరములు కంకణములు ఒడ్డాణము అవి యివి యన నేల యొక్కనగయు

లేదు. నిద్రాహారములు పూర్తిగ లేవన నాకెంపుకన్నులు కృశించినయాకారము నిదర్శనములు. ఎవ తీనారీరత్నము? రాష్ట్రరాజనరేంద్రునిరాణి మహాపతివ్రతాశిరోమణి ప్రోషిత భర్తృక రత్నాంగిదేవియేనా! ఔ నామెయే.

అయ్యో! యేమి యామె యిట్లు కళవళపడు చున్నది! ప్రియవియోగమే బలవత్కారణ మయి యుండునా! అదియు నొక కారణమే కాని యీకలఁతకు వేఱుకారణము కలదు.

"అమ్మా కుదుటఁ బడుము కుదుటఁ బడుము. ఇదే కుమారసారంగధరుఁడుగారు వచ్చు చున్నారు." అని యొక చేటిక ప్రవేశించుచు నుచ్చరించెను.

తోడ్తోన యాతల్లి పులకరిలినయొడలితో లోఁ బ్రవే శించుకన్నకుమారు బిగియారఁ గౌఁగిలించి చుబుకంబు చుం బించి మేను నిమిరి "నన్నుఁ గన్నతండ్రి! నాపెన్నిధానమా! కన్నులకఱవు తీరఁ గనఁబడితివి కదరా!" యనుచునె తోడి తెచ్చెను. ఆహా! కన్నతల్లికడుపు!

సారం:—తల్లీ! పురంధ్రిమతల్లీ! కనికరపువల్లీ! క్రమ ప్రకారము నాకు భవదీయపావనపాదాభివందనమునకైన నెడ మీయక యిట్లేల తడఁబడు చున్నావు! నేఁ డేమియో క్రొ త్తగఁ గనుపించు చున్నావు. ప్రతిదినము నేను వచ్చి నమస్క రించి చనుకాలమునకుమున్నె పూర్తిగఁ దెల్లవాఱనీయక యే

నాకు వర్తమాన మంపినావు. కన్నతల్లీ! కారణ మేమిటో యానీచిన్నకొమరుఁ డెఱుఁగ నగునే!

రత్నాం:—తనయా! తలఁచినంతన యుల్లము తల్లడిల్లు చున్నది. ఏమి చెప్పుదును.

సారం:—ధైర్యము ధైర్యము తల్లీ! అధైర్యపడినఁ గార్యము గాదు. క్షమింపుము నీ వెఱుఁగని దేమియు లేదు. జనకుఁ డాయమ్మను జెట్టపట్టినప్పు డైన జననీ! పల్లెత్తి మాట యనవే కళవళపడవే యీనాఁ డేమి యిట్లలజడి పడుచున్నావు! అచ్చెరు వగు చుండె.

రత్నాం:—నాయనా! సవతివిషయము గాదు. "లోకో భిన్నరుచి" రని యామహానుభావున కట్లు తోఁచినది. అట్లొనరించినారు. వారు స్వతంత్రులు. అకార్య మని విన్నవించుట తక్క యితర మేమియు నొనరుప రాదు. అదియు సమయానుకూలముగ నస వలయును. పూర్వకార్యముల నేమటి యుండ రాదు. అలక్ష్యము సేయ రాదు. మనపూర్వభవభవముల నిట్టిది సంభవించె ననుకొని సదా యానందానందము స్మరింపుచు ముం దిట్టిది గలుగ కుండఁ బ్రార్థింపవలయు. ఇదియ పతివ్రతలకు ధర్మము. అదియ నే నాచరించెద.

సారం:—నీ వెఱుఁగని దేమి మాతా!

రత్నాం:—కాని నాయనా! యేనిపై నాతలఁపు లన్నియు నిడుకొని యున్నానో యేనికిఁ జీమంతవంత కలిగిన లోకము

లన్నియు మునింగిన ట్లెన్నుకొను చున్నానో యట్టినిన్నుం గూర్చి నే నొకపాడుకల కని యున్నాను. ఱెండియు నిన్ను కన్నులం గన్నదాఁక నామన సుండ లేదు.

సారం:—అమ్మా! యేమికల కన్నావు.

రత్నాం:—చెప్ప నో రాడ కున్నది. మీతండ్రిగా రూరి నుండి వెడలినది మొదలు నిదుర పూర్తిగ లేనే లేదు. రాత్రి తెలతెలవాఱు చుండఁగనే యది యేమిమాయయో కూరుకు పట్టినది, ఆకూరుకున నా కొకవికలాంగుఁడు కనుపించె. పరి కించి చూడ నావ్యక్తి తండ్రీ! నీదిగనె యున్నది. అంత నేమి చెప్పుదు దిగ్గన లేచి వణఁకు జనింప నలుదిక్కులు పరికించితి. ఇప్పటికి నాభయంకరాకారము నామనోమందిరమునఁ బాడ కట్టుచునే యున్నది.

సారం:—అమ్మా! భయం బుడుగుము. దోషము లేశము లేనినీసారంగధరు నాసారంగధరుఁడే కాపాడును. నేను నొక కల నిన్నరేయి కంటిని. ఒకవేళ యట్లే జరుగు ననుకొనుము. కుందు నొంది మన మేమి చేయుదుము. కర్మానుసారముఁ ద ప్పింప నేరితరము!

రత్నాం:—కట్టా! యిట్టియమంగళము లాడ కోయి నా యనా! పేర్వులు చుమ్మలు చుట్టుకొని పోవును. నీ కే మంత కాలము కడచెను గొడుకా! విరక్తిఁ బూని యున్నావు.

సారం:—తల్లీ! యీసారంగధరుని కారణమునని నీకుఁ

గడుపుదును: వీఁడు కలుగ కున్న నన్నియు నరిగనె యుండును.

రత్నాం:—(వెలవెలఁబోయి) అయ్యో! నీకతమున నేమి కలిగెఁ దండ్రీ!

సారం:—అమ్మా! పతివ్రతాశిరోమణి వగుట నీ వింతయు వంత నొంద కున్నావు కాని యిది కడుపుకోఁత కాదా! ఈతని రూపపటము కతమునఁ గదా నీకు సపత్ని దాపురించె.

రత్నాం:—తండ్రీ! ఆవిషయమై నీ వావంతయుఁ దలఁపకుము. బుద్ధిమంతుఁడవు. నీకుఁ జెప్ప నేల కాని నీ వామెఁ గలలోను నిందింపకుము కనలఁ బోకుము. నన్నుఁ గూర్చి యావంతయు వంత నొందకుము నా కేమి నాయనా! నేను మీనాయనగారిపాదారవిందము లెప్పుడును హృదయాంతరంగమునఁ బూజింపుచు సంతోషింపుచునె యున్నాను. నమ్ముము.

సారం:—తల్లీ! ఈసారంగధరున కీశ్వ్యమునం గలయంగన లందఱుం దల్లులే. నీ వెట్లో యెల్లరు నట్లే.

రత్నాం:—చిరజీవి చిరజీవి నాయనా! స్థిరయశుఁడవు కమ్ము. సంభాషణధోరణి మఱచితి. నీస్వప్న మేమి?

సారం:—జననీ! నాస్వప్నము వినుము. గతరాత్రి నేను భవదీయాహస్తపద్మములతో వడ్డించిన సురుచిరపదార్థములు భుజించి పాదారవిందములకు వందనము లొనరిచి సెలవు దీసికొని కొంతసేపు సుబుద్ధితో మంతనములు సలిపి జనకునిమ్మందిరమునసె సుబుద్ధితోఁ బరుండితి. సుప్తి మునిఁగితిని, అర్ధరాత్రి

మైనది. అప్పుడు పట్టణము రాజమందిరము నాహంసతూలికా తల్పము అది యిది యన నేల సమస్తముం జలించి జలముల మునుఁగు చుండె. నే నాజలముల నీఁదులాడి రొమ్ము ద్రొక్కితి. ఆ భయంకరనీర మిప్పటికి నాకన్నులఁ గట్టినట్లు యుండె. మేలుకాంచితి. అత్యంతసంభ్రమాశ్చర్యముల సుబుద్ధి లేపి మదిఁ గుదురుపఱచుకొన వాతాయనము నుండి వెలుపలఁ జూచితి. అచ్చెరువుపడి యిది యంతయు సుబుద్ధికిఁ దెలిపితి. అతఁడును జాలకాలము విచారించి "యుదయమున జ్యోతి శ్శాస్త్రపారంగతుల విచారించి యీదుస్స్వప్నదోషపరిహారార్థమే దే నొనరుత" మనియెను.

రత్నాం:—తండ్రి! ఇవి యేమిదుశ్శకునములో!

సారం—తల్లీ! భూతభవిష్యద్వర్తమానంబుల ననుభవించియు ననుభవింపను ననుభవించుచు నుండుకలలే నరులకుఁ గలుగుఁ గాని వ్యర్థస్వప్నము లెప్పుడును గలుగ వని పెద్దలు చెప్పుదురు. భూతకాలంబున నైన మన మీకలలకు వలపడి పొంద నక్కఱ లేదు. వర్తమానమున మన మనుభవించుట లేదు కావున నావిలపడ నేల! ఇఁక భవిష్యత్కాలమునఁ గలుగ నున్నఁ గుందు నొందియుఁ జేయునది లేదు. కర్మ కట్టి కుడుపక పోదు. వీనికై నీ వంతగా బెంగఁ బెట్టుకొనకుము. బ్రాహ్మణోత్తముల రప్పించి తగుపరిహారము లొనర్పుదము.

సంభావనలకు సంతోషించి చంకలు కొట్టుకొనుచు

నౌకరితో నౌకరు సంభాషించుచు మహారాజ్ఞి రత్నాంగిం బ్రశం సించుచుఁ గుమారసారంగధరు నాశీర్వదించుచుఁ దమభాగ్య రేఖ వర్ణింపుచు బ్రాహ్మణోత్తములు జరుగు చుండిరి.

పుణ్యాంగనలు నూతనవస్త్రాభరణములతోఁ బసుపు కుంకుమలతోఁ బట్టురవికెలగుడ్డలతో సత్ఫలములతో ముఖ చంద్రికలు చిందులాడ మందమందయానములం దమతమ యిక్కవలకుఁ జక్కనఁ జనుచు నుండిరి.

వీరి నెల్లర నరసి చిత్రాంగి మనోరమను బిలిచి "కారణ మేమే పాటులు నారులు నిట్లు నూతనవస్త్రాభరణవిశేషము లతో సంతోషాతిశయమునఁ దఱుఁగక యరుగు చున్నారు. చూడం జూడ నాసవతిమేడ నుండియే యని తోఁచు చున్నది."

మనో:—ఔను రత్నాంగిమందిరము నుండియే వీరు వెలు వడు చున్నారు. ఆమె కేమో నిన్న రేయి పీడకల కలిగిన దఁట! తెల్లవాఱ కుండనే కుమారు రప్పించి తనకల నెఱిఁగించిన దఁట. ఆసారంగధరుడును—

చిత్రాం:—హా! సారంగధరా! నీపేరు వీనులఁ బడిన యంతన నాకోర్కె లూరును. ఏమి సేయుదును! అందనిమ్రాని పండ్ల కఱ్ఱు చాఁచు చున్నాను.

మనో:—బాగుగ నున్నది చిత్రాంగీ! ఇప్పుడు నే నేమి యొనరింపుదును! ని న్నూరడింపుదునా! కల వివరింపుదునా!

చిత్రాం:—రొండును వలదు. నామదనతాప మంతరింప నవరింపుము.

మనో:—అనఁగా నేమి నీమాటలు నాకు బోధపడకున్నవి. నన్ను జపతపము లొనరించి సారంగధరుఁ గమ్మనియా నీ యభిప్రాయము?

చిత్రాం:—కాదే నీవు జాణవు కావున నీనేరుపు చూపి యాసారంగధరుఁ దెమ్మని నామనోరథము.

మనో:—నీమనోరథము నేఁ దీరుపఁ గలనా!

చిత్రాం:—తలఁచిన నీ వేమి చేయఁ జాలవు!

మనో:—నేను మోహినినిఁ గామినిఁ గాను నీవలె

చిత్రాం:—నేను మోహినిని గామినినా?

మనో:—కావా! చాలుం జాలు ముంజేతికంకణమున కద్దమేల! వృద్ధరాజునకుసైతము మోహము పుట్టించిననీవు మోహినివి కావా! సారంగధరుమీఁదివలపున సకలావస్థలు పడుచున్ననీవు కామినివి కావా! నీవే చెప్పుము.

చిత్రాం:—నీనర్మవాక్యముల కేమే! అవృద్ధన రేందు)ఁడు

మనో:—వృద్ధవాన రేందు)ఁడు

చిత్రాం:—అమ్మక చెల్ల! ఓటిమాటలతో వృథా కాలము పుచ్చక—

మనో:—కాలము పుచ్చు టెట్లు?

చిత్రాం:—ఛీఛీ! వదరకుము. మాపో రేపో వచ్చును గావున నే దేనపాయము లేని యుపాయము—దుర్వారతంత్రము—పన్ని యాసారంగధరు నీమందిరమునకు రప్పింపుము.

మనో:—నాకు మందిర మెక్కడిది ఎట్లు రప్పింతును ? ఉపాయాంతరము లేదు.

చిత్రాం:—ఉపాయ మొం డుండేఁ గదా! అది నెరవేరనిచోఁ గదా వేఱువెర వూహించుట! అదేమో వివరింపుము.

మనో:—నీయొద్దఁ జెదవి కదుప జెదరు. నోట మాట వచ్చినఁ బట్టుకొనెదవు. ఇంతకు నివ్వదు నన్ను పురుషుఁ గ మ్మనియెదవు. నన్ను మగవానిఁ జేయ గట్టిపట్టు పట్టినావు.

చిత్రాం:—అబ్బా! సరిగఁ జెప్పవే యాప్రకార మేమో

మనో:—ప్రకార మేమి యున్నది. సారంగధరునకుఁ బారావతక్రీడను మక్కువ మెక్కు డఁట. తత్కారణమున నీనాఁ డతనిఁ బావురములయాటకుఁ బురికొలిపి యిచ్చోటుఁ జేర్ప వలయు.

చిత్రాం:—ఏమి యాతనికిఁ గలరవక్రీడపై నంతప్రీతియా?

మనో:—ఔ నఁట. ఔ నఁట యేమి ఔను. ఆకామ మీకామినీక్రీడపై నున్న నింత యక్కఱ లేదు కదా—

చిత్రాం:—మఱి వాని నాఖేలనమునకుఁ బురికొల్పు టెట్లు?

మ:—అదియే చెప్పిన నీవిప్పుడే నాప్రాణములుతీయుదువు—

చిత్రాం:—నాప్రాణములు తీయక త్వరఁ దెల్పవే—

మనో:—నేను మగవాఁడ నయ్యెదను—

చిత్రాం:—అవసరానవసరము లెఱుఁగవు నీకెంత సేపు వేళాకోళామే—

మనో:—వేళాకోళమా! అవసరముఁ బట్టియే నేను మగ వాఁడ నయ్యెదను—

చిత్రాం:—(నవ్వి) పురుషవేషము దాల్చెదవా! బాగు బాగు! పిమ్మట—

మనో:—పిమ్మట నతనిఁ గేళికిఁ బిల్చెద నట!

చిత్రాం:—అతనిఁ గాదు అతను—

మనో:—ఏమి యీవాక్యము పూర్తిగఁ జెప్పుము—

చిత్రాం:—చాలు లేవే మఱి నీయొయ్యారము నగ లాళియు మాని సరిగఁ జెప్పవే. నీ వే మని పిల్చెదవు?

మనో:—ఇది మఱియు బాగుగ నున్నది! ఏ మని పిల్చెదను మనోహరా! యనెద ననుకొంటివా రమణా! యనెద నను కొంటివా లేక నాథా యనెద ననుకొంటివా నీతాత్పర్యమేమి?

చిత్రాం:—ఎంతలోఁకువ చేయు చుంటివే! లోపము గల వారిబ్రదు కిదియు కదా! అదువ కూడదు.

మనో:—కా దమ్మా మఱి యే మని పిలిచెదను? సమ యము కని పెట్టి చక్కనిపావురముఁ జేతఁ బట్టి "సారంగధరా! యీదినము నీవు కొంచె మలసిన ట్లున్నావు! కళవళపడు చున్నావు. ఇంతవిశ్రాంతి తీర్చికొనెదవు రమ్ము. నీకూకీని జేకొమ్ము; వినరుదము వేడుకపడుదము." అని పిలిచెదను.

చిత్రాం:—ని న్నానవాలు పట్టకపోయినను నీకంఠస్వర మును నానవాలు పట్ట కుండునే.

మనో:—నే నొక్కతనె పోయెదనా! మనవారిఁ గొందఱిం దీసికొనదఁ; గాక యతని మన మెఱుఁగుదుము కాని మనల నత డంత బాగుగా నెఱుఁగఁడు.

చిత్రాం:—పిలిచినంతనె వచ్చునా!

మనో:—జేలా! విను మెంతటివాఁ డయిన నేవ్యసనము నను దగులువడకయ యుండ వలయుఁ గాని తగులుకొనిన నది యెప్పటి కైన ముప్పే. కావున నవశ్య మతఁడు వచ్చు.

చిత్రాం:—కూకీలయాటకు వచ్చుఁ గాని యతఁడునా—

మనో:—పావురములయాటకు వచ్చుఁ గాని యతఁడు నా నయ్యాట కెట్లు వచ్చు ననియా నీసందేహము మంచిదే!

చిత్రాం:—చాలును లేవే నీవికటప్రసంగము.

మనో:—నాదివికటప్రసంగమే. వినుము పారావతక్రీడ ముగియులోపున నీవే నీకార్యము సాధించుకొన వలయు—

చిత్రాం:—అది యెట్లు?

మనో:—నీకుఁ గలిపి పెట్ట వలె. కలిపి పెట్టిన మిగ్రంగం గష్టపడెద వేమొ! చివరవఱకు నుండవు. ఎంతో తొందర. అతఁడు సాధారణముగ నెగరవైచునది యూఁడుది. దానియందె యతనికి మక్కువ యెక్కువ. అది మిక్కిలిచక్కఁగ నెగురు చిత్రాంగి—

చిత్రాం:—కట్టిపెట్టుము నీకల్లపలుకులు. చిత్రాంగిపై నతని కంతమన సున్నఁ జిత్రాంగి నిన్ను నిన్ను బ్రతిమాలుట

యేల యీయవస్థ యేల! మన సున్నది యనుటకన్న మనను సున్న యన్న నొప్పు.

మనో:—చిత్రాంగి యన్న నీవా చాలుఁ జాలు! చిత్రాంగి యనఁ జిత్రమైనయంగము కలది. అది యిందే యీబయలు నని కదా యెగురు చుండును; గావున నీ వాసమయమున నీ మేడపై నిలిచి నీనేలిమగపావురమును జూపి పిలువుము. మింట నున్నయీ పెంటిపావురము కావరించి యుండుటఁ దా వరించి నీపోతుపావురముకొఱకు వచ్చును. నీపా రావత సాహాయ్యమున దాని నీశయ్యాగృహముఁ జేర్పుము. అంత నతఁడు తన కామమున వచ్చి శయ్యాగృహముఁ జేరును సరియేనా?

చిత్రాం:—(చేతితోఁ ద్రోసి వేసి) ఊఁ—పోవే

మనో:—ఇదే యిప్పుడే త్రోసివేసెదవు! నే నెట్లును బోదును. పోవక మీరు పారు మీఱ భాషించు చున్నప్పుడు పానకములోనిపుడకవలె నే నుందు ననుకొంటి వేమి? అంత పర్యంత మెందుకు? కార్యసాఫల్యమునకై యిప్పుడే పోదు.

మనోరమ యరిగెను. ఎన్నఁడును లేనియామోదమునఁ జిత్రాంగియు నామనోరమ కాల్చుపురుషవేషమును గనుఁగొన వడలెను.

-------

# పదవ ప్రకరణము.

## వేఁట.

చెట్లు దట్టముగ నలముకొని యుండె. పెక్కు లగు చక్కనికంబముల నలరుమందిరములం బోలి మఱ్ఱులు తమ యూడలు భూమిలోనికి దింపి యెంతయోస్థల మాక్రమించి యుండె. తాళవృక్షము లంతరిక్షము నంట నెగసి యుండె. రావిచెట్లు లేఁతాకులఁ బొలుచు చుండె. తుమ్మలు దట్టమ్ముగఁ గ్రమ్మి యుండె. ఉసిరికలు కాయల వెలయు చుండెను. పనసలు సత్ఫలముల నలరు చుండెను. మామిడులు చైత్రరథములు నాఁ గెంపువాఱి కొన్నియుఁ బూలతోడఁ గొన్నియుఁ బిందెలతోడఁ గొన్నియు వన్నె కెక్కి యుండెను. జీడిమామిడులెఱ్ఱనిపచ్చనికాయలతో నందగించు చుండెను. టేకుమ్రాఁకులాకసము నంట నెగసి పెద్దయాకుల విలసిలు చుండెను. మద్దిచెట్లు మట్లు మీఱి యుండెను. నేరేడులు మారేడులు సొరుమీఱి యుండెను. చింతలు వింతగఁ బెరిఁగి యుండెను. వెదురుపొదలు పొదలు చుండెను. గురివెందలు గుబురుకొని కరము తుఱుఁగలించు చుండెను. వెలఁగమ్రాఁకులు గుండ్రనివెల్లకాయలు వ్రేలాడ వెలయు చుండెను. గచ్చలు పెచ్చు పెరిఁగి యుండెను. నడుమ నడుమఁ బదియలును గొండకాలువలును చెరువులును జాలఁగ నుండెను.

అందు డెందము డిందుపడం జేసి కాందిశీకులం జేయు క్రూరమృగబృందములభీషణఘోషణ లధికములు. మేఘగర్జనములకన్న మిన్న యగునారార్భటములకుఁ జెవులు చిల్లులు పడును. పున్నాగములు కుబుసము లూడ్చి బుసలుకొట్టు చున్నవి. క్రోడములు క్రోడాడు చున్నవి. కాఱుదున్నలు కావరించి పోరాడు చున్నవి. చమరమృగములు వాలములు పైకెత్తి పాఱు చున్నవి. మదమతంగజములు కసిమసంగి మడుంగుల మునుంగుచుఁ బతంగములం గలంగుఁడువడ నెగురం గొట్టుచుఁ దేనియ లాన నిందిందిరములు విసపిస ముసురుబిసరుహానంతతులఁ జెఱికి కరము కరములఁ బైకెత్తి జలక్రీడలాడు చున్నవి. తేళ్లు క్రేళ్లుఱుకు చుండె. ఎలుంగులు కలుంగుల ముట్టెలు పెట్టి పుట్టతేనియ లాని భీకరకఠోరగర్జనములు పఱవు చుండె. వానరములు కిచకిచ లాడుచు బిడ్డలు పొట్టలు గట్టిగఁ బట్టుకొనఁ గొమ్మ నుండి కొమ్మకుఁ జెట్టు నుండి చెట్టునకు దుముదుము లాడుచు దుముకు లాడు చుండెను. దుగమొగముల పులుఁగుతెగలు గబ్బుచెంక మొకములకొఱకు మృగములకొఱకు నగముల నిలిచి నిరీక్షింపు చుండె. శరములఁ దూఱి బెబ్బులులు గబ్బుకంపుకొట్టు చున్న జంతుజబ్బులఁ బీఁకు చుండెను. కొండగొఱ్ఱె లొండొంటిఁ దాకి బుఱ్ఱలు బ్రద్దలుకొట్టుకొను చుండెను. చిత్రకాయములును సింహములును మత్తుగఁ బొదలమాటునఁ బరుండి యుండెను. ముంగిస లుడుములతోడను గోడెనాగముల తోడను ఘోరముగఁ బోరాడుఁ చుండెను.

భూరిభేరీ కాహళగంభీరవిజృంభణధ్వనుల వనము ప్రతిధ్వను లిడు చుండెను. గొప్పతప్పెటలచప్పుడుల నుప్పర మదురు చుండెను. బోయకేకలు గిరిగుహాలనుండి మాఱుమ్రోఁయు చుండెను. అడుగడుగునకును గల్లుగల్లు మనుగజ్జెలంచునఁ గలగుడిగెలు దొడిగి దట్టీలు గట్టిగఁ గట్టి సివ్వంగి చెంగలువ సింగాణి సురగాలి కస్తూరి భైరవుఁడు గబ్బి వెండిగుండు సాళ్వుండు చిటిలింగండు పులియండు బూచిగాఁడు అసురపోతులరాజు అనుమంతిగాఁడు కాఁటదమ్మఁడు మున్నగు కాటుబంటుఁదనములు గల వేఁటవేపుల నుసికొలుపుచు ఈటెలు సెలవిండులు కేలఁ దాలిచి కోయలు జంతునికాయముల నేడాటలాడింపు చుండిరి.

పక్షులెల్లయుఁ బంచబంగాళమగు చుండెను. సారంగములు దూరముగఁ బాఱిపోవు చుండెను. కుందేళ్లు లేళ్లు కుప్పిగంతుకొను చుండెను. ఘుర్ఘురధ్వనులతో నేకలమ్ము లమ్ములపగిదిఁ బొదలఁ దూఱు చుండెను. సారమైనసారమేయము లాకిరులఁ దఱుము చుండెను; ఈరముల కిరువంకల వాకిరుల నటు నిటుఁ బోనీయక నిలిపి యుండెను. చెంచువాఁ డొకఁ డాజాగిలముల విలోకించి గుఱ్ఱుగుఱ్ఱుంచు నున్నయా మదకిటిఁ గుంతమునఁ గ్రుచ్చి యంత మొనరించెను. కొందఱు పుళిందులు సెలవిండ్లు పూని యేణములు నేలఁ గూల నేయు చుండిరి. కొందఱు కుందేళ్లఁ, బునుఁగుపిల్లుల, జవాదిపిల్లుల, దోఁడేళ్ళ మట్టుపెట్టి గుట్టలు పెట్టు చుండిరి. కొందఱు గబ్బి

తనము గలజెబ్బులుల గబ్బుల నుసిగొల్పి తబ్బిబ్బొనరించి పడఁ
ద్రొబ్బుచుండిరి. కొందఱు సివంగులతోడ్పాటున సివంగులఁ
జిందఱవందఱ గావింపుచుండిరి. కొందఱు కస్తూరులు కదల
మెదల కుండ నిలుపఁ గస్తురిపిల్లులఁ బట్టుచుండిరి. కొందఱు
వాయువేగులనవాయమున వాయువాహనములఁ జేఁ జిక్కించు
కొనుచుండిరి. సైరిభముల మదవన్నీసైరిభములఁ గాఱియఁబెట్టి
ధారుణిఁ బడఁ గొట్టుచుండిరి. సవరపుమెకములఁ దఱిమి
చెరచెరఁ జెండుచెండాడిరి. శరభముల రభసము ప్రభంగింపఁ
జంపుచుండిరి. వ్యాధుల బాధల కోరువ లేక మృగము లనేక
ములు పాఱి పాఱి సెలయేటులఁ బడి నీరముల నెఱు పెక్కించి
మరణించుచుండె. మృగయులకు జంకి మృగములు చెల్లాచెద
రై సింగములకోఁటలఁ జొక్కుచుండ నాసింగముల సింగాణులు
తఱుమ సింగిణులంగొని సింగఁడులు పొంగడంగించుచుండిరి.

రాజరాజనరేంద్రుఁడును పారువమ్ము సారమ్మునఁ
జాలించి వాలమ్ముల వాలమ్ములను గూలిచెను. ఆరాజకర
ములఁ బుండరీకములు తేజ మెడలెను. ఆపుండరీకముల శిలీ
ముఖములు చిక్కువడి యుండెను. ఋక్షసంఘముకళలు
తూలెను. ఇర్లద టడఁగెను. అపరంజిపరుంజానం గడుంగడుం
జెంగలించువాలువాలు కేలఁ బూని యానరేంద్రుఁడు కరుల
కరములు గఱగఱి గాకుండ నఱికెను. ఏదుపేఁట నాఁటిలిచిన
యారొమోధుఁ జేదియున్న యేదుల నేదింపఁ జేసెను. అడిదము

జెడిదముగ విసరి కడుతులఁ బుడమిఁ బడఁ జేసెను. వృకోదర
పరాక్రమమున వృకఝాటముల నిరాఘాటముగఁ గీటడంచి
వేఁట ముగించెను.

డేగపదనుగ నాహారంబు గొన్నయన్నరెందుఁ డాఁకలి
గా నేకలమ్ములు మొదలుగాఁ గలవానియెఱచి రుచులు మీఱ
వండించి చవులు మీఱ భుజించెను. సంబారాదుల నింపు
నింపు చున్నయావిందునకుఁ బరివారము చాల సంబరపడఁ
జొచ్చెను. సారమేయములకు లేని దేమి! చాలినంతయాహా
రము. ఇంతపర్యంత మాఁకలిమై నున్నయవి యిప్పుడు తోఁక
లాడించుచు జోకమై నుండెను.

తరువాత రాజరాజాదండకారణ్యావిశేషముల నవలో
కింపఁ దలంచి చెంచులు పేరుపేరువరుసం జూప శ్రీసీతారామ
లక్ష్మణులు కాఁపుర ముండినపర్ణశాలాప్రదేశమును, దల
కెక్కినవలపునఁ గలఁత పెట్టు చున్నశూర్పనఖయొక్కముక్కును
చెవులును చెక్కినయిక్కయును మారీచమాయామృగమును
శ్రీరాముఁడు కీటడఁగించినచోటునుం గనుంగొని యాసీతారామ
లక్ష్మణుల మనమున నభక్తిమైఁ దలంచుకొని నమస్కరించెను.

వెల గలరతనంబు లనం దగునారుద్రపురుగులును దృణ
గ్రాహు లనం దగుతృణపుష్పములును నమరిచి నయనానంద
కరముగఁ బఱపినపచ్చనినూతెపటంపుతివాసి నాఁ గడిమిడి
కడుఁగడుఁ బొలుచు చుండెను. వల్లికామతల్లులు వరవిరుల

వరలుచు గురుతరుబృందంబుల ననఁగి పెనఁగి యల్లిబిల్లిగ నల్లుకొను చుండెను. పుష్పలతావిశేషముల నలరారుపున్నాగములు సత్ఫలముల వెలయు చుండెను. పరిపక్వఫలముల నమరు మావుల మరుమావులు జోక మీఱఁ గేకరించు చుండెను. మనోహరము లగునావసంతద్రుమములఁ జేరి సంతసమునఁ గోకిలలును గూక లిడు చుండెను. మల్లెలు మొల్లలు కొల్లలుగఁ బుడమిఁ జల్లఁ బడి యుండెను. మారునిచేతికటారిఁ బోలి కేతకీదళములు కడానికాంతిఁ దళుకొత్తు చుండెను. కనక కాంతుల భాసిలుకనకములు సువాసనల నలుగడలఁ జిమ్ము చుండెను. వకుళములు తావులు తావులనెల్ల విరఁ జిమ్ము చుండెను. గురివెందలు పరిగుత్తులతోఁ గరమరుదారు చుండెను. అడవిమల్లియ లత్యంతసువాసనల నలుగడలఁ బఱపు చుండెను. మందారములు కందోయికి విందుగ వికసించి యుండెను. రంభలు సౌందర్యమున విజృంభించి యుండె.

వరమృణాళముల మెసవుచు వరమరాళములు వరల నరవిందములం దేనె లానెడియళిసంతతు లరవిరికలువలకు ఝుంఝుమ్మని బారులు తీరి పాఱు చుండఁ బాలపిట్టలు చిఱుమీలఁ బట్టుకొనఁ దామరాకుల నిలువఁ జిన్నచిన్నయలలు చెన్ను మీఱ ఫుల్లసితహల్లకగంధధురంధరుఁడై మందానిలుఁడు మరలఁ వివిధజలపక్షులకలకలములు చెలఁగ నావనము నడుమ నొకకొలను వెలయు చుండెను.

కాంత మా చున్న యాకాంతారమును గనినయంతట ధారుణీకాంతుఁడు పరిశ్రమ మరుగ విశ్రమింప నదియ తగున లవని గుడారములు వేయించెను.

త్రిపురాసురసంహారార్థమై కాల్పఁ బడినయవాయి మంట లనం దగుప్రభాతరాగము నుండి చండమార్తాండుఁ డనునగ్నిగోళ మెగిరి వెండియు సంధ్యారాగ మనుశిఖిశిఖలు నలుగడలఁ జిమ్మి యపరవారాసిఁ బడియెను. తారకాగణములు తళుకు తళుకుమను చుండెను. సింహశార్దూలగర్జ లుప్పతిల్లెను. పక్షులు గ్రుక్కున మిక్కిలి వెక్కసముగఁ గూయు చుండెను చంద్రుఁడు తూర్పుకొండ నలంకరించెను. మిండగాండ్రకుఁ దలఁపులు మెండయ్యె. విప్రయోగులు కలఁగుండుపడు చుండిరి.

పండువెన్నెలలు కాయుపూర్ణసుధాకరుఁ గనుఁగొని రాజరాజనరేంద్రుఁడు తనసతిచిత్రాంగిం దలఁపునకుం దెచ్చు కొనెను.

“ ఆహా ! యీరాకాసుధాకరుఁడు మృగమదతిలకమున నొప్పునాచెలిమోమువలె నున్నాఁడు : కాని బొట్టు పెట్టకున్న నాయున్నమిన్న మొగమున కితఁడు సాటి యగునా ! ఔరా ! ఈ కాసారలక్ష్మిసౌందర్యము ! ఈ శైవాలసంఘము నాసున వేణికచమును బోలి యున్నది. ఈ భృంగము లానీలాలక యొక్కముంగురులు నా నున్నవి. ఈకలువ లాకలువకంటి గన్నుల కెన యగు చున్నవి. ఈనడి యాసింహేంద్రమధ్య

యొక్క నాభికిఁ దుల్యముగ నున్నది. ఈసైకతము లాసుశ్రోణి యొక్క పిఱుందులవలె నున్నవి" అని తలఁచు చుండె.

శీతమయూఖుఁడును మీఁదిమీఁదికి వచ్చి కరము తన 'ములు ప్రసరించు చుండెను. హల్లకకల్హారగంధబంధురమున గంధవహుఁడు మెల్లమెల్లన సంచరించు చుండెను. ఝుం ఝుమ్మని చెవులు రవళింప నళినంతతులు పూఁదేనియ లాను చుండెను.

"ఆహా! యీచలివెలుఁగు నన్నిప్పు డింతగా నుడికింపు చున్నాఁ డేమి! ఆహా! తెలసెఁ దెలసె. ఈశీతభానునకు సహజ మగుతేజ మేది యాభానునిప్రసారమే కాక: కావుననే యీమూఢుఁడు. ఏమి యితఁ డింత గర్వించి యున్నాఁడు. నా యకళంకముఖ కైన యగుదు ననియ కాఁబోలు! ఓరీ! కళాంక! నాతిముఖమునకు సమాన మగుటలఁపునఁ గళల హెచ్చించుచు వచ్చియుఁ బూర్ణశశాంకుఁడవే యైతివి కావున నీక నీముఖపుఁ దఱిఁగించి యొక్కమూలఁ బడి యుందుము! పైఁ బైన కాని నీశీతలత్వము లో నంతయు విషమే. ఔను నీవు విషజన్ముఁడవును బడబానలసహోదరుఁడవును గావా! పయోముఖవిషకుంభమవు; గోముఖవ్యాఘ్రమవు. నిన్ను నమ్ముట మాదే యవివేకము. గురుసతిఁ జెఱచినవాఁడవును, దండ్రిని భంగపఱచినవాఁడవును, జెల్లెలిఁ గొంప చెఱచినవాఁడవును, దమ్ములఁ బాదమ్ములఁ దన్ని కళల మాపినవాఁడవును,

చక్రములఁ దల్లడిల్లఁ జేయువాఁడవును గావా! భళిరే! రాజా! ఏమి నీపాలనము! రా జెందును సత్సంతతులఁ దేజరిల్లఁ జేసి జారులమద మణఁచి యేలుఁబడి సేయును గాని నీవలె సత్సంతుల తేజ మణఁచి జారులమద మభివృద్ధి గావించి చక్రముల తల్లడిల్ల నేలు నఁటరా! నిశాచరుఁడవు నీకింతకన్న మేలి గౌరవము లబ్బునా! ని న్ననఁ బ నేమి! ని న్నీ పదవి నిలిపినయ న్నలువ ననవలె! ఎందుకు వాని నెలవుఁ గూల్చి వానికిని దొడ్డ పనిగనే యొసఁగింపు చుంటివి. నీసంతతివాఁడ వని యయిన నీకింతసనరు లే దేమిరా! అయ్యో! దుష్టులకు సంతతి సంబంధమా! తొందరపడకుము తొందరపడకుము. ఇప్పుడే హే మయ్యో నేఘునుఁ డడ్డుపడునో యేపాము మ్రింగునో!

అహో! మలయమారుతా! నీవును జలివెలుఁగునకుఁ దోడుపడు చుంటివా! వలదు వలదు. ప్రాణికోటు లెల్ల నీకతమున బ్రతుకు చున్నవి. నీ వొక్కనిముసము లే వేని జీవ రాసులు నుండవు. అట్టినీ వీకట్టెఁడికి సాయము చేయకుము. ఎఱుఁగవే యుపకార మొనర్చినవారి కెల్లరకు నీఁ డపకార మొనర్చుట! అయ్యో! వినవా! నీ కైనఁ దెలియుట లేదా! యాదోషాకరుని చెలిమికతమున నీకును దొసంగు లబ్బు చున్న వని. లే కున్న నీ కీయహిబాధ యేల! నీకుఁ దెలియఁ బలుకు వారు లేక నీ విదివఱకుఁ గలిసి మెలిసి యున్నను నాఁగాము నింక పిదప బాగుపడియెదవు నీకేబాము నుండదు.

ఔరా! యేమి యీఝంకారము! కలువలఁ దేన
లాని కన్నులు తెలియక కాఁ బోలు నీమదాళు లి ట్లెగిరిపడు
చున్నవి. ఓమలిమ్లుచులారా! యెందుకు మీ కీమిడిసిపాటు!
మేమే నీలముల మనియా! మీయుబ్బుఁ దబ్బి బ్బానరించునా
లీలాలక యున్నది. మదాంధకారమునఁ గన్నులు గానక మిట్టి
పడియెదరు కావుననే కలువలచెఱఁ జిక్కు చున్నారు. వానిధన
మపహరించి కన్ను మిన్ను తెలియ కున్నమీరు వానిచెఱఁ
జిక్కు టాకవింతయా!

ఔ రౌరా! యిది యేమి! జోహారు! జోహారు!
పరాకు గాకు కలఁప రాకు రాకుమా రమాకుమార! మార!
వైరి నఁటర! పోర పోరఁ దగదురా మేర మీఱితి! అయ్యయ్యో!
“శ్యాలకో గృహనాశాయ సర్వనాశాయ మాతులా” యన
వినవే! పాలసముద్రమునఁ బాఁపఱేనిపై నిలుకడఁ బవ్వళించి
యున్న నీతండ్రిఁ గలఁతపడ నొనర్చినాఁడు. నీతల్లియిల్లు కూల్చి
నాఁడు; నీప్రథమబాణమును నీటఁ గలిపినాఁడు; నీనాతిఁ
గారాగారమున నిలిపినాఁడు; అన్నిటికన్న మిన్నఁగ బేసి
కైదువుజోదు వగు ని న్ననంగుఁ జేసినయాబేసికంటిజతఁ గూడి
యున్నాఁడు. వీఁ డెంతద్రోహి గా కున్న నుడుకు తగ్గింపు
చున్న నాత్రిపురాసురసంహారకుఁ డితనిఁ దూఁటు చేసి రథము
క్రిందఁ బెట్టి నలిపినాఁడా! నిన్ను మాత్రము వ్రేచి యేమి
చేయు చున్నాఁడు. ఇరువురునందువం బెట్టి నలుగులు [illegible]

వొనర్చు చున్నాఁడు. పైనుండి నవ్వు చున్నాఁడు. అంతయుఁ దెలిసినను నీగంతులు మాన కున్నావుగా! రతికాంతా! ఆరతీదేవి యొనర్చినపూజాఫలమునఁ దాలిబొట్టునఁ గాక నీ వింతకు నంత నై యుండవే! అనంగా! అయిన నే మయ్యె! నిన్ను కనిపెనంగ నొనర్చుటకు నాయంగనామణి చిత్రాంగి లేదా!"

అని రాజరాజనరేంద్రుఁడు విప్రలంభమున విచారించు చుండెను.

బల్లునఁ దెల్లవాఱెను. తెల్లయుఁ దల్లడపడినరాజ రాజు తిరుగుమొగము గా నెల్లరకు నాన తిచ్చెను.



## పదునొకండవ ప్రకరణము.

### పావురములయాట.

గోదావరితీరమున మున్నయుప్పరిగపై నొకయొప్పుల కుప్ప చొప్పిలు చుండెను. పున్నాగము వెన్న నీనిపెన్నెరి వేణియు, నళినంతితుల కలఁగుఁడువడ నొనర్చునలకలును, నెల శాలు నేలుఫాలమును, నవవిల్తునికోదండముల వగిముడికను బొమలును, గలువలఁ దలలు వంచ నొనరించునయనములును, గనకమును మందహాసము సేయు నాసికయును, గుందకుట్మల ములఁ గుందఁ జేయురదనపంక్తియు, తొండపండు వెం

డొనర్చునధరమును, గనకవర్ణము గలస్ఫటికములఁ దలప
నీయనినిద్దపుఁజెక్కులును, శ్రీకారములచెన్నుఁ దన్ను చెవు
లును, జక్కవకవవిప్పు నెక్కసక్కె మాడుచక్కనివదనమును,
గంబువు నంబువులం బడ నొనర్చుకంధరంబును, బిసరుహముల
కన్న నిం పెనలారుకరములును, మారునారి నీరసించునూఁగా
రును, బులినములఁ బురిడించునితంబములును, రంభావిజృంభ
ణంబును దంభం బొనరించునునుదొడలును, ముక్కజొన్న
పొట్టల లెక్క గొనని పిక్కలును, దాఁబేలుల నేలుమీఁగా
ళ్లును, నరవిందముల నపహసించునంఘ్రులును, దారలసారు
గేరుగోరులును, మించు మించుదేహద్యుతియును, మదమా
తంగముల నగియెడునడకయును, గలిగి విలసిలు చుండెను.
హరిణీవిలాసముల హరియించి రంభావిజృంభణమును దంభం
బొనరించి తిలోత్తమను నధోముఖ గావించి దశావతారచిహ్న
ములు గలిగి పొదలునాప్రమదను బొగడ నలువచిలువలకును
దరము కాదు. అకులుకులాడి కలరవము నొకదానిఁ బాణిఁ
బట్టి యూర్ధ్వానన యై నిరీక్షింపు చుండెను. పలుచనివలువ
చెంగావిపావడఁ గట్టి నవరత్నహారములు వైచి సమస్తాలంకా
రములు ధరించి పటీరము శరీరము నిండ నలమి కస్తురిబొట్టు
పెట్టి జాదులు కేతకీదళములు వైచి చుట్టినపెన్నెఱివేణిఁ
దుఱిమి యావిలాసవతి యాసలు ముప్పిరిగొన నుప్పరమునను
కాటుకకన్నులు నిగిడించి యుండెను. అప్పు డామోహనాంగినిం

గనుంగొన్న వా రామోహిని నైన నీసడింతురు. ఆపెమనో వ్యాకులము తొట్రుపాటు ఆందోళనము గజ్జెలందియలు గల్లు గల్లు మన నటునిటు సంచరించి బెదరి బెదరి దిక్కులు కలయఁ జూచి పరిపరివిధముల నాలోచించునాపెవర్తనమే తెలుపు చున్నది. పద్మపత్రమ్ములోనినీరమ్మట్లు చిత్త మ్మొకవిధమ్మున లేక తత్తరమ్ము నొందున్నీపద్మాక్షి యెవరో తెలిసెనా!

రాజమందిరమునకును రాజరాజనరేంద్రునియుద్యాన వనమునకును నడుమ నున్న శాద్వలమున యువజనులుకొందఱు గుంపులు గూడి యుండిరి. అందఱిచేతులను బావురములు—వివిధవర్ణములు గలవి—అలంకరించి యుండెను:

"సారంగధరా! సారంగధరా! నామాటఁ బాటింపవా! వలదు. వేట యాట మున్నగునవి కామమునఁ గలుగునని పంచమవేదము పలుకునట్లు మనగురుఁడు నుడివె. కామసం హారుఁడవు నీ కీపావురములయాటపైఁ జింత వదల లేదా! కట్టా! సర్వసద్గుణాలంకారునకు నీ కీకళంక మేల యబ్బె!"

"సుబుద్ధీ! యీమాత్రమున కేల నీ వింతచింత నొందు చున్నావు! ఉబుసుపోక కొంతగంట యాడుకొనియెదను."

"మిత్రమా! ఇంతశే యంత లగును. ఉబుసుపోక కీకూళ్లలయాట యేల మఱియొకఖేల లేదా!"

"నెచ్చెలీ! యీవేళ యేమో యీబుద్ధి పుట్టె. అంద ఱును బావురములు పట్టుకొని యుల్లాడే మనకొంఱ కేమరు

చూచు చున్నారు. తొలుతఁ బలు కిచ్చి యిప్పుడు కాదనుట నామతము కాదు. క్షమింపుము. రాజకార్యవ్యవహారముల నంతకంతకుఁ దగులఁబడు చున్న నే నీక నేయాట లాడుటకును వలను గాదు గదా! అనుమతిమ్ము. ఇదియే నాకుఁ దుదియాట.

"శివశివా! శంకరా! అఘనాశంకరా! అమంగళ మడంగుం గాత! సారంగధరా! ఇది యొకవ్యసనము సుమీ! నీ వెఱుఁగని దేమి!

"సుబుద్ధీ! ఇందు వ్యసన మేది! నే నెవరితోను బందెము వైవ లేదే! పందె మొడ్డినచో నోడు గెలుపులయం దపేక్షఁ జేసి కొందరకు మత్సరమును గలుగును గాని వేడుకకై యాడునిం దోడు గెలుపు లేక కైన నొకటే. ఇం దానందమే కాని యసూయ లేదు. అవి యింతవఱ కెగిరె నివి యిట్లు చిత్రవిచిత్రములు నెఱపె నని సంతసించి వీడ్కొనియెదము. దీన హాని లేదు. సమ్మతి నిమ్ము రమ్ము.

సుబుద్ధి యాలోచింపుచు నె యాతని ననుగమించెను. సారంగధరుఁ డాయువజనమును డాసిన వెంటనే తనకై సిద్ధముగ నుంచిన చిత్రవర్ణము గలతనయభిమానకలరవమును భటు నుండి గైకొని "మిత్రులారా! మీరును సిద్ధముగ నున్నారు కదా! అందఱము నొక్కసారి వీని నెగర వైచి యానందింపుదము విడువుఁడు." అనియెను. అందఱుం దమతమహస్తముల నున్న పావురముల విడిచిరి. వెంటనే పెండియు నవి నేల వ్రాలకుండ

జేతులు విసరుచు శబ్దము పుట్టింపఁ గేకలు వైచిరి. చప్పటలు చఱచిరి. పక్షము లల్లలాడింపుచుఁ బక్షు లెల్లయుఁ బల్లటీల్లోని యాకాశము నంటుచుండెను. మిణుకు మిణుకుమనుచు నాకా శాంగనకంఠమున వ్రేలుచున్న పన్నసరముపగిది నాకలరవ ములు ప్రకాశించుచుండెను. అందఱు నపేక్షమై నేపక్షి పై కెగిరెనో యని తల లెత్తి తిలకించుచుండిరి. కంటికిఁ జేమోరగా నిడి కనుఁగొని యచ్చెరు వందువారుకొందఱు, సన్ననికండువాలు కన్నుల కడ్డుగ నిడి యవిగో నవిగో నను వారుకొందఱు, పళ్ళెరముల జలము లిడి "యరరె! నీడ లయినఁ గనుపింప వేరా" యనువారుకొందఱు, మెడలు బాగుగ వెనుకకు వంచి పరికించునెడఁ దలపాగ లూడిపడ నవ్వువారుకొందఱు; ఇట్లుగా నానందపడుచుండ నవి యంత కంత కదృశ్యము లయ్యెను.

అంతఁ గొంద "ఔరా! యింతవింత ముందెందునుం గనుంగొని నేర మనువారును మేఘమండలము మీఱి తారకా గణములఁ దూఱె ననువారును మిన్నెటినీటికై క్రిన్నఁ జనినవి యనువారును ని ట్లభిప్రాయభేదములు వడుచు సాధనో పాయములు లేక యట్లే చాలఁగాలము వేచి చూచుచుండిరి. తిరిగి మినుకుమినుకుమనుచుఁ బారువములు వారికి గోచరము లయ్యెను. అవి దిగి వచ్చుట నంతకంతకు స్పష్టములు గాఁ జొచ్చెను. ఎవరికలరవముల వారు నిరూపింపఁ గలిగిరి.

నీరెండలు నగరములకు బంగారుపూఁత లిడు చుండెను. వాసవుఁడు వరుణదిక్సుదతి కనిపినపూబంతియో నా హంసుఁడు వరలు చుండెను. పక్కిగుములు తమతమయిక్కువలకు పరుగు లిడు చుండెను. యువజను లెగుర వేసినపావురములును నల్లే యలసి సొలసి వచ్చు చుండెను.

మేడమీఁద నెవరును లేరు; కాని యొకపారావతరాజము మాత్రము తండులఖండములఁ గాలిగజ్జెలు గల్లు గల్లుమన మూలుగుచు నేరుకొని తిరుగు చుండెను. దానికాలి కొక నూలిత్రాఁడు కట్టఁ బడి యుండెను. నూకలును లోనిగదిలోనికిఁ ద్రోవఁ దీయునట్లు పోయఁ బడి యుండెను. మిన్నున నుండియు మన్ననం గలతండులఖండములం గనుంగొనం గలశక్తి పతఁగ ములకు బగవంతుఁ డొసంగెను. ఆఁకలిం గొని యున్నసారంగ ధరునిపారావత మానూకలు తిన నచ్చో వ్రాలెను. వ్రాలిన యాపిట్ట పోతును గలిసికొని దారము లాగినకతమున మెల్ల మెల్లన మందిరములోనికిం దారు చున్న యాపోతుతో నూకలు తినుచునె మెల్లమెల్లన నరిగెను. తలుపులు బిగింపఁ బడెను.

“సారంగధరా! సారంగధరా! మీపారావతరాజము చిత్రాంగిదేవిగారిమందిరమున వ్రాలినది వ్రాలినది” యని కొందఱు కేక లిడిరి. “ఏమి నాచిత్రగ్రీవము చిత్రాంగిదేవి గారిమేడను వ్రాలినదా! అచ్చెరు వగు చున్నదే! గండపెండె రము దాల్చిననాపక్షి యెన్నఁడును ద్రోవఁ దప్పనది కాదే!

ఇదియుఁ గొంతమేలే! దవ్వునఁ గాక దగ్గఱనే నాతల్లిచిత్రాంగి భవనమున వారిలె. ప్రాణము లైనఁ బోనాడ నొప్పెదఁ గాని యీనాకలరవమును వీడ నొప్పను." అని యరుగు చుండెను.

"చెలీ! చిత్రాంగీ! చిత్రాంగీ! యేమే! పలుకవు! పని తీరినది గదా యిఁక నీమనోరమతో డిదేల యనుకొన్నావా! ఇప్పుడే మాట్లాడనిదానవు మీఁద నెట్లు మాట్లాడుదువే నా తల్లీ!" యని దెప్పుచు మనోరమ ప్రవేశించెను.

"నెచ్చెలీ! నాకోరిక లీరిక లెత్తు చున్నవి" యని కంఠాశ్లేష మొనరించెను.

"సరి సరి! నే నేమి సారంగధరుఁడ ననుకొంటివా! న న్నింతగట్టిగఁ బట్టుకొంటివి! తొందరఁ జెందకుము. నీవలపు కాఁడు వచ్చును. నీమనోరథ మీఁడేరుచును."

"సఖ! యింతపర్యంత మన్నియుఁ దిన్నఁగ నెరవేరెఁ; బిఁకమీఁద నెట్లు కాఁ గలదో తెలియదు. పక్షి కావ బ్రమపడె. అకళానిధి భ్రమచెందునా, నన్నుఁ బొందునా!"

"కాఁ గల దేమి కలదు కాంతా! కాఁ గల దేమి యున్నది గాఢాలింగనమే! బ్రమపడ కేమి! వినుము కామిని లోకమునఁ గలయునంతపర్యంతమే గుణగణములు స్థిరచిత్తములు. అడవుల నాకలములు తినుమునులకే లేకపోయెను; షడ్రసాహారము తిను చున్నయీరాజకుమారునకా నిలుకడ! కామసంహారము!"

"అతఁడు నన్ను ట్లలరించునా! మై కంప మొందుచున్నది. నేనై యెట్లు వెల్లడింతును!"

"నీవై వెల్లడింప నక్కఱ లేదు సుందరీ! నీసర్వాంగములె యాతని సంగజుబారికిం గొంటును. మీఁద నీమావు కొపుతూపులు వ్రాలును గదా! చెప్పిన దేమి యతఁడె నిన్నమ్మా! యనుటకు మారు కొమ్మా! యనును. అంతఁ జెప్పిన దేమి నీవును రమ్మా కొమ్మా యాదువు!"

"అతఁడు సర్వసంగపరిత్యాగి యని వింటినే యందున నాడెంద మాందోళన మొందుచున్నది."

"సర్వసంగపరిత్యాగియే కాఁబోలుఁ బారావతక్రీడకు నేఁడు నావేఁడుకోలున వేడుకమై నంగీకరించినాఁడు. నీవేఁడుకోలునకును నట్లె యనుమతించి తప్పక మారక్రీడఁ గూడువాఁడు తల్లడిల్లకుము."

"మనోరమా! నే నేమని వేఁడుదునే!"

"చెలీ! యేమియు లేదు! ఈచిత్రపటములఁ జూపుము. నీహొయలు గనఁబఱుపుము. ఈహొంబట్టుపానుపుఁ జేర్పుము. ఇంతకన్న నేమి యున్నది."

"అపత్రప యడ్డగింప మాట లాడ లే నేమో కదే!"

"అయ్యో! మాటలు నేరనిదానవేనే పాపము! ఇప్పుడే యింతవగలఁ జేరుచుంటివి! మాట లాడకున్నఁ గూటమి యెట్లౌనఁ గూడు! చాలుఁ జాలుఁ బ్రాలుమాలక నీత[illegible]

బెళుకులు తలఁగింపక ధైర్యమున నీవచోమాధుర్యమున నతని నతనుసౌఖ్యమునఁ దేల్పుము.

«కృషితో నాస్తి సర్వాప్వ మ్మన్నారు. నాకార్యమేమొ నే నిర్వర్తించితి; నిఁక నీకార్యమే మిగిలి యున్నది."

«ఆ కామభగవానున్పైనే భార మిడి నాపని నెఱవేఱుప నున్నాను."

«జాల మేల వాలుఁగంటీ! నీవు నీపనిఁ జూచుకొనుము. నేను నావేషమును దీసి వేసి మగిడి వత్తు. తలుపు మూయకుము. ఇంకను సుబుద్ధి విరోధింపుచునె యున్నాఁడు కాఁబోలు సారంగధరుఁడు రాఁ డయ్యె!"

«రాఁ డేమో! మన కేల దాపురించెనే యీసుబుద్ధి!"

«సుబుద్ధి గిబుద్ధిపలుకులు పాటింపఁడు నమ్ముము నామాట" యని మనోరమ లోపలకుఁ జనియెను. చిత్రాంగి కార్యాలోచనమగ్న యై మందిరమునఁ గూర్చుండెను.

«మిత్రమా! వినవా నామాట! పావురములయాట ముద కెట్లు పరిణమించు చున్నదో పాటింప కుంటివే!"

«సుహృద్వరా! పాటింప కేమి! ఇంతలోఁ బావురము గొని నీచెంతఁ జేరుదును."

«కీడు మూడును సారంగధరా! బాగుగాఁ బరికింపుము! కలరవమునకు నీకలవర మేల! యది పోయిన దానికన్న మిన్న యింకొకటి కలుగు. దానికై నీవు పో వలదు."

"నెచ్చెలీ! కడుగారవమునఁ బెనిచి గండపెండారము నిడినపారువము పీడ నామన మంగీకరింప కున్నది."

"బుద్ధిః కర్మానుసారిణి యన వినియెద మిదియు కానోపును. నీ యంతరాత్మయుఁ బ్రబోధింపుట లేదా! రాజకుమారా! పూర్వవృత్తాంతము స్వాంతమున నున్నదే! చిత్రలేఖ జ్ఞప్తి లేదే!"

"అదియు నను జను మను చున్నది. ఏలయా సుబుద్ధీ! ఆమెకుఁ గలదురభిప్రాయమును నా కామెయెడను దల్లిగారగు రత్నాంగియెడను గలయభేదమును బోధింప నిదియ యదను. తెలిసియో తెలియకయో కలవలపున దూరదృష్టి లేక తప్పు చారిని బోఁ గోరినయామెకు సన్మార్గముఁ జూపెద."

"సారంగధరా! నీవా యూపెమనమును మఱల్పు వాఁడవు! స్త్రీలకు బుద్ధి పుట్టక యుండ వలయునే కాని పుట్టిన నాతమ్మిపుట్టువునకును దరము గాదు మఱలుప."

"అందఱు నట్ల యుందురా! సుబుద్ధీ! దుర్బోధవల కతమున ముందువెనుక లాలోచింపని కారణమున హితము తెలుపువా రుండని హేతువున యౌవనోద్ధృతి నణఁపఁ జాలని మూలమున బ్రమలఁ జిక్కి చెడిపోవు చున్నారు. అట్టివారికి యుక్తసమయమున నే రయినఁ దోడయి జ్ఞానచక్షువును వికసింపఁ జేసినఁ బశ్చాత్తాపము నొంది సన్మార్గ మవలంబింతురు."

"అనుభవము చాలమి సారంగధరా! నీవట్లనుకొను చున్నావు. వ్యాఘ్రి కలదు వల దన్నగుహకే చనఁ దలఁచు చున్నావు: పో నిమ్ము ఏకాంతమున నున్నకాంత చెంత కేగుట తగునా!"

"ఏమి! నాయమ్మకడ కరుగుట నాయమ్మ కాదే! నాయమ్మకు నాయమ్మకు భేదము కలదే సుబుద్ధీ!"

"నీయమ్మయు నాకొమ్మయు నొక్కటియా! ఆమె నిండు జవ్వనమున నున్నది. భర్త యౌవనము తొలఁగి యున్నాఁడు. వలపు తల కెక్కి తాండవ మాడు చున్నట్లా కొమ్మ వ్రాసినకమ్మయే ప్రబలసాక్ష్యమ్ము. తొలుఁదొలుత నీ కని కుదిర్చినయాపెను నీతండ్రి చెట్టపట్టె. నీవో యీడు జోడై జయంతుఁ గంతు వసంతు నింద్రు నుపేంద్రుఁ జంద్రుఁ గుబేరు నలకూబరు మీఱి యున్నావు. ఒంటరిపాటున స్వభర్మహార్మ్యమున నంతిపురమున వలవదు చున్నావు. ఆమె కంతకన్న నవకాశ మబ్బునా! నాపలుకులు వినుము. బాగుగఁ దలపోయుము. గతజలసేతుబంధనము కార్య ముండదు."

"నెచ్చెలీ! న న్నట్టివానిఁగ దలఁచితివా! ఇన్నినాళ్లు సహవాసము చేసియు నామానసమును దెలియ వైతివి! సప్త సముద్రము లేక మయినను మిన్ను విరిగి మీఁద నొరగినను గ్రహములు గతులు తప్పినను గులతలము క్రుంగినను వేఁడివేలుపు తనవేఁడి విడినను నీతఁడు తప్పుదారిఁ జనునా!"

"సారంగధరా! యిన్ని బాస లేల! యేగ నేల! తండ్రియైన నూనుఁడైన సోదరుఁడైన మఱి యెవ్వఁడయి నను నరే సుందరుఁడయిన వాని వరుసలు గణింపక వలపునఁ దగులుదురు వనిత లనునానుడి నానుడి కాదు. చంచలమతులు స్త్రీలు. సాయంసమయ మగు చున్నది. రాజుగారు నగరమున లేరు. ఆయన యీయుమవలపునఁ దగిలి యున్నారు."

"వలపున నున్నమాత్రమున నేమి?"

"ఏమా? చెప్పుడునుడులు చెడ్డవి యన వినవే!"

"చెప్పుట కేమి యుండు?"

"ఏమి యుండునా! నిన్నాపె కోరును. నీవు నీస్థిర బుద్ధి వల దని యూడనిఁబాడుదువు. కోరిక తీర లే దనుకోప మున నాపె భూపతికి లేనిపోని వేవో కల్పించి వచించును వంచించును."

"అంతమాత్రమ్మున నాజనకుఁడు నమ్మునా?"

"నమ్మ కేమి! నేను మున్నే చెప్పితిని మన్నుఁడాపెవలఁ దగిలి యున్నాఁ డని కామమునకుఁ గన్ను లేదు. అంధకారబంధురము. మఱియుఁ బురుషుఁడు బొంకిన దడి గట్టినట్లుండుఁ గాని స్త్రీ బొంకిన గట్టిగోడ పెట్టిన ట్లుండును. రాజులకు శ్రోత్రములే నేత్రములు; కీడు మూడు."

"కాలగతి యెట్లున్నదో కాని మిత్రమా! నాచిత్త పారావతము నాచేతమును గలఁచివైచు చున్నది. కాలహరణ

మును గాపింపకుము. ఇప్పుడు రానా!" యని విధికృతము నా నాసారంగధరుఁ డస్తమయసమయమునఁ బశ్చిమదిశకుఁ బాఱున ట్లీసారంగధరుఁడును బశ్చిమదిశకుఁ బాఱు చుండెను.

"అంతిపురమునకు నొరు ననుప రా దని యెఱుఁగుదును గావునఁ బావురముమీఁదియానను దొలఁగు మంటిని. కాని యాపెంటిపైఁ గలమక్కువ నతఁడు త్రొక్క లేక చనియెను. చిత్రాంగివంచన నతఁడు తగులఁడు కాని యాపెయొక్క కోపాగ్నికి నగ్గల మగు నేమో యని శంకించు చున్నాను. సర్వము దైవాధీనము. నే నింతశ్రమ పడియు నే మయిన నొనరుపఁ గలిగితినా! యట్లే యామెయు నేమియుఁ జేయఁ జాలదు దైవము ప్రతికూలించినఁ గాని. లలాటలిఖిత మె ట్లున్నదో! లేకున్నఁ జిన్ననాఁట నుండియు నేను గీచినగీటు దాఁటనినాచెలికాఁడు నేఁడు నన్ను కా దని చన నేమి! ఇన్ని కా దేల నిన్ని యెన్నినఁ బ్రయోజనము సున్న. కాఁ గలది కాక మానదు. నాచిత్త మేమో తత్తరిల్లు చున్నది. ఈ ప్రదోషవేళ సదోషము నంట కుండ సారంగధరుఁ గాపాడ నాసారంగధరు వేఁడుకొనియెదను. ఆసారంగధరు వేఁడుకొని నిలువరింపఁ గలిగితినా యాసారంగధరుఁడు వేఁడుకొన గాఁగలది నిలువరించుటకు!" అనుచునె సుబుద్ధి కోటిలింగస్వామిదేవాల యమునకుఁ బనివినియెను.

## పంచత్రింశత ప్రకరణము.

### ఆశాభంగము.

చిత్రాంగిభవనమునం గలజాలకమునకు జాలక మమర్చఁ బడి యుండెను. ఆకారణమునఁ దలుపులు దెఱచి యున్నను లో నున్నవారు వెలుపలివారికిఁ గాన రారు. ఆకిటికీయొద్దఁ జిత్రాంగి యారాత్రియున నెప్పు డెప్పు డెప్పుడు తనమనోహరుఁడు వచ్చునా యని తహతహపడుచు నుండెను. "వచ్చునో రాఁడో; వచ్చిన నన్ను వలచునో వలవఁడో; నావ కున్న బలిమిఁ బైఁ బడిన నాలింగన మొనర్చునో యావలకుఁ ద్రోయునో; దైవమా! యేమి చేయ నున్నావో! కామదేవా! నీదే భారము: నిన్నే నమ్మి యుంటి." అని లోలోనఁ దలంచు చుండెను. అంత మనోరమయు "నేమి! యింకను రా లేదా!" యనుచు నామె సమీపించెను. "మనోరమా! నన్నుఁ గికు రింపవు కదా! ఏమి యాతఁ డింకను రాఁ డయ్యె!" నని చిత్రాంగి వెలివుచ్చెను. "ఈసరికి వచ్చినాఁ డేమో యనియే యేను దక్కుచుఁ దాఁటుచు వచ్చితి. సుబుద్ధి యతనిబుద్ధి మఱ ల్చినాఁ డేమో! కాని యతఁ డంగీకరించునట్లు కనుపించ లేదే! అయినఁ జూచెద నుండుము." అని కిటికీనుండి చూచి యల్లదే సఖియా! హాయులు మీఱ నీ వలపుకాఁడు వచ్చుచున్నాఁడు

చూడుము." అనియెను. చిత్రాంగి వెసవెస వాతాయనము నుండి వీక్షించి "ఆహా! యెంతవిలాస మెంతయొయ్యారము! అంగముఁ గలిగినయనంగుఁడును ననిమిషత్వము వీడినజయంతాదులును సము లగుదు రేమో! ఆసారంగధరుఁ డీసారంగధరునకు సాటియా! ఛీ! ఛీ! దిగఁదుడువను కయినఁ బనికి రాఁడు. ఎంతకళ! విశాలఫాలము నెలబాలు నేలు చుండెను. భ్రూయుగము స్మరకార్ముకములను స్మరణకుఁ దెచ్చు చుండెను. అంద మైనయాకందోయిఁ గొలువఁ జేరల మీఱి యుండును. చక్కనిముక్కు గంధఫలి నెక్కసక్క మాడు చుండెను. అధరబింబము మధురసుధారస మొలుకు చుండెను. అహో! సఖ! సఖ! ఆమొగుబుజము లావెడఁదయెడఁద నేమని పొగడఁ గలము! తఱిమెనఁబెట్టిన ట్లున్నవి కదే యాతనితొడలు! చిత్రఫలకమున వ్రాసినంతకన్న నూఱింత లెక్కుడుసుందరముగ నున్నాఁడే! కన్నులు నేఁ డితనిఁ గనుఁగొని సఫలము లయినవి. సురుచిరాంగము లితని గాఢాలింగనముఁ గావించి ధన్యత నొందునో లేదో! పూర్వజన్మకృతపూజ లెట్లున్నవో! మనోరమా! యిఁక మనపనిమీఁద నుండవలె. అదె యతఁడు ద్వారముఁ జొచ్చినాఁడు." అని తటాలున లేచి మనోరమ వెలుపలకుఁ బోఁ దలుపు మూసి నిలిచెను.

సారంగధరుఁడు పనితనము గలబంగారుసరిగతో రంగారు దువ్వాలువలపై బంగరువ్రాఁతహొంబట్టువలెవాటు నపలించి

నడుమున జారుముడి యిడెను. ద్వారముఁ జొచ్చి లోపలకు వచ్చుచుండెను. ద్వారపాలకులు పోతుటీగ నయిన లోపలకుఁ బోనీయ రా దనురాజుగారియాజ్ఞఁ బాలింపఁ దలఁచియు యువరాజుగారి నే మన్న నేమో యనుభయమున నోరు మెదల్పఁ జాల రైరి. అతఁడు లోపలకు వచ్చి చిత్రాంగిశయనాగారమునకు వెలుపల నున్న మనోరమ నారసి "మనోరమా! నాకలరవ మిట వ్రాలిన దఁట! నీ కే మైనఁ దెలియునా?" యని యడిగెను. "అ దేమో యువరాజా! నే నెఱుఁగను. ఏమీ! మీ రాపక్షికై వచ్చినారా! పోయి తెల్పుదునా!" యనుచు నె యరుగుచుండెను. "జాగు సేయక వేగిరము తెల్పి రమ్మ." అనియెను. తోడనే మనోరమ ద్వారము డాసి "అమ్మా! చిత్రాంగీ! మీయంగజుఁడు వచ్చినాఁడు! ఏమి సెలవు!" అనియెను. "ఏమే యెన్నఁడును రానినాయాత్మజునకు నేఁడు నాపై రాగము కలిగినది! ఆయన నడ్డుపఱచువారెవరు!" అని చిత్రాంగి బదులిడుచును తలుపు కొంత తెఱచెను. "తల్లీ! నమస్కారము." "నీ కన్నఁ జిన్నదాన నగునాకు నమస్కార మొనర్తువే యాత్మజా! ఆచారవ్యవహారము ననుసరించితివి కాఁ బోలుఁ బో నిమ్ము: ర మ్మిటు లోపలకు రమ్ము కూర్చుండుము."

"అమ్మా! కూర్చుండుట కాదు క్షమింపుము. సాయంకాల మయి యుండె. పాప మాపక్షికి మధ్యాహ్నమునుండియు.

నాహారము లేదు. నీరసించి యుండు. దాని నట్లు బాధపెట్టుట నా మతము కాదు."

"భూతదయాపరా! నిన్నుఁ బొగడ వచ్చు. ఈపక్షిపై నీకుఁ బ్రేమ కలదో లేదో యనియే నేను నిరీక్షింపు చున్నాను. నిన్నుఁ గూడి యుండుట కేనాఁడో పూజ చేసిన దీచితాంగి. ఇంతపర్యంతముఁ గుందు నొందించినయీకలరవాంగనకు నా పందముఁ గూర్ప వచ్చితివా!"

"అమ్మా! యేమియీ నీపలుకులం బట్టి నీవు సరళచింత నున్నట్టు పొడకట్టవు" అని కొంచె మాలోచించి వచించెను.

"దైవమా! రతీవల్లభా! అమ్మా! యనుట మాన్పి కొమ్మా యని పింపవే!" యని లోలోన గొణఁగు చుండెను.

ఇంతట మనోరమ "చెలీ! మంజువాణి కేమో బాధగ నున్న దఁట. నేను పోయి వంటపనిఁ జూచెద" ననియెను.

"పొమ్మ్మ నీవు పొమ్మ మనోరమా! యీరేయి యిక్కడ నాకు మారుఁడు కూడ నుండుఁ గావున వేవేగ మిష్టమృష్టాన్నములను సిద్ధము కావింపు" మనియెను. మనోరమ చనియెను.

"వలదు వలదు జననీ! నే నిక్కడ నుండ వలను గాదు"

"యువరాజా! నిలిచియే యున్నావు! నీ విక్కడ నొక్కక్షణము కూర్చుండినఁ గొల గలుగునా! ఏమి నాచేసిన దోసము?"

"నీ చేసినదోస మేమి! అమ్మా! అంతిపురమునకుఁ గొడుకు కానిమ్ము తండ్రి కానిమ్ము సోదరుఁడు కానిమ్ము పురుషులు వచ్చుటయే తప్పు; వచ్చి మాట్లాడుట యంతకన్నఁ దప్పు. ఇఁక నాసీనుఁ డైన నెంతతప్పో నీవ నేర్తువు."

"ఏమి రాకుమారా! నీవు నీతల్లికడకు నిరాఘాటముగఁ బోవు చుండుట లేదా?"

"చన కేమి! ముందు నారాకమాత్ర మెఱింగింతు."

"అట్లే యీయెడకు వచ్చుట కభ్యంతర మేమి?"

"అమ్మా! నీ వొకటి యీయమ్మ యొకటి కాదు; కాని కన్నతల్లి యగుట నామెయెడ నా కెక్కువచనవు."

"అట్లయిన నీకొమ్మకు నీయమ్మకు భేద మున్నట్లే!"

"భేద మించుకయు లేదు తండ్రిగారియాజ్ఞ యది."

"ఔను మీతండ్రిగా రట్టులు కట్టడ సేయరా! కాని యాత్మజా! నాపలుకులం బట్టి సరళప్రవర్తన లే నట్లు నుడివితివే యేమి?"

"తల్లీ! నీద్వ్యర్థభాషలం బట్టి యట్టు లంటి. తిన్నని పలుకులఁ దెలుపక యనవసరగూఢార్థవచనము లేల?"

"సుకుమారా! గూఢవచనము లేల. నీయనుమతిపైఁ విస్పష్టముగఁ దెలుపు చున్నాను. శుకపికశారికలపలుకులు శ్రుతులకు ములుకులవలె నున్నవి. హారములు భారము లైనవి. ఆహారము నిస్సార మైనది. చలివెలుఁగు శత్రు వై యున్నాఁడు.

మందానిలుఁడు మ్రిందింపు చున్నాఁడు. మారుఁ డూరకుండక విరిశరములు కరముఁ బఱపు చున్నాఁడు. వలపు మిఠాలి సేయు చున్నది. ''

''జననీ! కనులు మూసికొని కొంత కాలము కడపితివా మాపో రేపో భవదీయప్రియుఁడు వచ్చును. ''

''మదీయప్రియుఁడు వచ్చియే యున్నాఁడు. కాని న న్నింకను గౌఁగిట నలరింప కున్నాఁడు. ''

''అమ్మా! అనయము నతనినే మనమున నునిచికొనుట నిట్లు కళవళపడు చున్నావే కాని తండ్రిగా రింకను రా లేదు. ''

''తండ్రిగా రేల సుకుమారా! నీవే కావా నామనో హరుఁడవు! ఆ—అదిగోఁ గనుబొమలు ముడి వేయకుము. కలఁత నొందకుము. ధర్మాధర్మవిచక్షణుఁడవు. పరికింపుము. పటము గనుఁగొని నేను నిన్నే వలచితినో పురమునకు వచ్చిన వెనుక చెట్టపట్టిననీమునలితండ్రినే వలచితినో యించుక విచా రింపుము. మనసునఁ దొలుత వరించినవాఁడె వరుఁడు గాని బలిమిని బట్టినవాఁడు వరుఁడా!

''శివశివా! అమ్మా! నీ విట్టికట్టఁడితనమున కొడిఁ గట్ట నేమనఁ గల! నీపలుకులును నహేతుకములే కాని బలిమిని బట్టఁ దలఁచినను మానవతి తనప్రాణముల నైనఁ బోనాడునే కాని యన్యుని గలియదు. మనసార వరింపనిపరపురుషుఁ గలి యుట పాపము కాదా! దాన నీ వివాహపరములకు వాలి యగు నకృత్యము నొనర్పఁ గృత్రిమమానసమున నుండుట స్పష్టము.''

"నిజమే యువరాజా ! బలిమిని బట్టిన స్త్రీజనకుని గా దీశ నాకును నావారికిని సామర్థ్యము లేకపోయినది. స్త్రీపై మరులు తఱుఁగక పోయినవి. ఎన్నటికైనఁ గికురించి నిన్నుఁ గొనిపోవ నవిల్తుపోరఁ గూడ లేక పోదునా యని నాయనుఱులు నిలిపిన మాట సత్యము."

"తల్లీ ! యందువనే నీవు దోషదూషిణివి."

"పాపము కా నిమ్ము పుణ్యము కా నిమ్ము : ఆకమ్మ విల్తుపూవుటమ్ముల కే నిఁకఁ దాళఁ జాల."

"తల్లీ! యిక్షుకోదండధరునివిరిశరములకె తాళఁజాలని దానవు దండధరునికఱకుదండనల కెట్లు తాళుదువు? జననీ ! వినుము. నాఁడు నీలేఖ నాలోకించినపుడె నాకుఁ జాల విచార మయ్యె. ని న్నీయధర్మమార్గము నుండి తప్పించువారు లేరా యని పరిపరివిధముల విచారించితి. మనమనికియె యనతికాలము. సిరిని బోలి యీ మైసిరియు నీప్రాయమును స్థిరములు కావు. వథువు నవతరించినయీయౌవనము నడుమనె యంతరించును. ఆకాలము మనగొనములఁ బరీక్షింప నాపరాత్పరుఁడు ప్రత్యేకముఁ గల్పించిన దని నామతము. బాల్యకౌమారవృద్ధదశల నందటును బతివ్రతలే పత్నివ్రతులే ! కండబలువు గలిగినపుడే యీయిక్షుకోదండుని గెలువ బులు పను దలఁపు గలుగును. అప్పుడె యధర్మమార్గ మవలంబించెదరు. అపహాసితు లగుదురు. అప్పుడు తప్పించుకొనిన యుప్పును దప్పును. నరకమును దప్పును.

తెలిసిరో తెలియకరో తప్పుదారి నున్న నిప్పు డైనం దిన్నని
తెన్నునం జనుట యొప్పు గాదే! కానం దావ మూంపి కంతు
సంతాపము మాపుము."

"తప్పో యొప్పో నావలపు నిలుప లేను. అతనికేళి
నినుం గలయక నాయీతనువు నిలుప లేను. నావేగిరమును
మన్నింపు" మని పైం బడం దలంచెను.

"శివశివా! చెవిటిముందు సం కూదిన ట్లయ్యె. ఈ
యసమంజసము విని కనం జాల" ననుచు నొక్కింత యెడముగం
దప్పుకొని "పురుషులకు మానావమానాభిమానాదులు సంఘ
టించువారు స్త్రీలే. స్త్రీ గయ్యాళియు జాగయు నయిన
జగము మగవాని వ్రేలిడి చూపుచు నగడుపఱచు. ఒక్క
మగనికే కాక యుభయవంశములకును గలంక మాపాదించును.
ఇంట నున్న వాలుంగంటికొంటెతనము కుంటెనతనము అంటును
సొంటును గలమగవానికి సన్మార్గావరోధము. ఎన్నండును దన
రక్తసంబంధము గలస్త్రీం బురస్కరించుకొనియ పురుషుండు
పరులయిరవుస కరుగ నగుం గాని పురుషసంబంధముం బురస్క
రించుకొని యఱిగిన నగుంబాటును వల్లరిపాలును నగును. పరువు
తక్కునా. నైజదుర్గుణాలవాల యగుభార్యను భర్త కొట్టి
తిట్టి యే మొనరుపం గలండు మఱింత రచ్చ కెక్కునే కాని;
కావుననే తగినపత్ని పతి కలవడుట పూర్వజన్మసుకృతవిశేషము.
అనలిపతులయన్యోన్యానురాగము దాంపత్యము నన్న కెక్క

వ్రాసి యిచ్చు చుండు. ఇందుననే తొలుత నీకును నాజననికిని భేదము గల దని వినిచితిని. అనుభవమునఁ గాని యన్నియు బోధపడవు. ఇఁక నొకనిముస మయిన నే నిట నిలువఁ జాల సెల వొసఁగుము.'' అని సారంగధరుఁడు తలుపు తెఱచి యరుగ నుండెను. చిత్రాంగి వాని దగునుత్తరీయము నొడిసి పట్టెను. జాఱుముడి యుడినయాయుత్తరీయ మాచారుహస్త మునఁ జిక్కుపడియెను. సారంగధరుఁ డది సరకుసేయక తన దారిఁ బోయెను. విఫలమనోరథయై విచారమగ్నయై చిత్రాంగి ''హా! దైవమా!'' యని మొదలు నఱికినకదళీతరువుఁ బోలి నేలఁ గూలెను.

కనుచీఁకటి క్రమ్మి యుండెను. తారకాగణములు తళుకు లీను చుండెను. ముందెన్నఁడు లేనితుందుడుకున సారంగధరుఁడు ''హా! దైవమా! చెట్టు కొట్టి పైన వైచు కొంటి. చిత్రలేఖ చదివి యామెచిత్తవృత్తి నెఱిఁగియు సుబుద్ధి సదోపదేశ లాలించియు నామెకడకుఁ బోవ మాననైతి. ఇంతయు నాఫాలమున బ్రహ్మ వ్రాసినవ్రాలు గాఁబోలు!

శ్లో. రామో హేమమృగం నవేద నహుషో యానే నియోజ్య ద్విజాన్ । విప్రస్యైకతమస్యవత్సహరణే లఙ్కాంజహౌ హైహయః । ద్యూతభ్రాతృచతుష్టయంచమహిషీం ధర్మాత్మజో దత్తవాన్ । ప్రాయస్సర్వజగద్వినాశసమయే బుద్ధ్యా పరి క్షీయతే.

ఏమి సేతు! విచారించి ప్రయోజనము లేదు. సుబుద్ధి యనినట్లు "గతజలసేతుబంధ" మనుచుఁ గలరవమునకుమూఁకు గాఁ గలవర మొంది నిజజననిమందిరమునకుఁ జనియెను.

"చిత్రాంగీ! చిత్రాంగీ! ఇదే మమ్మా! మూర్ఛ మునిఁగి యున్నావు! అయ్యో!" యని మనోరమ తనచెలియ కుపశాంతు లొనరింపుచుండెను. అల్ల నల్ల నామె లేచి కన్నులు విప్పి చెంత నున్నచెలికత్తెఁ గాంచి "హా! మనోరమా!" యని నయనముల నీరములు నించి తల వంచి కౌఁగిలించెను. వివిధగతుల విచారించెను.

"అకటా! నిన్నా కఠినహృదయుఁడు కౌఁగిట నలరింప లేదా! హా! శుకమాని కైన నిన్నుఁ గన్న వలపు గలుగునే యాతనికిఁ బాడము లేదన్న నచ్చెరువుగ నున్నది." అనియెను.

"మనోరమా! నన్నుం గనుంగొని మరులుకొన లేదు కదా మనను విప్పి చెప్పినను గనికరింప లేదు. అయ్యయ్యో! నాబ్రదుకేల! నాకు నుయ్యయో గొయ్యయో దయ్యము వ్రాసినది. తప్పదు. నీవు నాపై నాస విడిచి యీయావాన [illegible] బాసి వచ్చినత్రోవఁ బట్టుము. నావృద్ధజననీజనకులకు [illegible]మరణము [illegible]ఁగింపుము."

"బాలా! సిగ్గిడిలకుము నే నుగ్గడించునటు లొనరించి నీప్రార్థనలు వ్యర్థము చేసి నిన్నింతము శాదింప నున్నయా నిర్దయాస్వాంతు రూపుమాపక నీ విట్లు వాపోవ నేల! జంత్రవు

బొమ్మ నా నీ వెట్టు లాడించిన నట్టు లాడుకాంతుఁడు చేత నుండ నింతవంత యీచేఁత లేల చిత్రాంగీ! నీవు తలఁచిన నొవరువ లేని దేమి?"

"అవునే మనోరమా! పటమునఁ గనుఁగొనిననాఁట నుండి నన్ను మరులుకొలిపి పురమునకు వచ్చినప్పటి నుండియుఁ గనులఁ బడక వలవంత నిలిపి యేకాంతమున నెట్టెట్టో యులవడి వేడుకొనినఁ బాడి కా దని యూడనిఁబాడినయామూర్ఖుఁ గాలుసేతులు ఖండింపించినను గలుషము కలుగదు. "అరే! ఖలా! తాళుము తాళుము. ఇంకను బ్రదికి బట్టఁ గట్టుద మనుకొంటివా, ఈచిత్రాంగి నవమానించి నీమేనఁ బ్రాణములు నిలుపుదువుగా! రాజరాజనరేంద్రునకు గాజులు తొడిగించి యాడించు చున్న యీయాఁడుది నిన్ను చిత్రవధ సేయింప కుండు నే! ఈనీపాపురమును బైవలువయును నెంతకుఁ జాలవు! ఇదే చూడుము. మనోరమా! నా కీరాత్రి యాహార మక్కఱ లేదు. ఇన్నాళ్లమాత్రము నీముమ్మురునిమూలమున నరిగ నున్నదా! కడుపు నకనకలాడినఁ గాని యొడలు కనకవలాడవు. ఒడ లుడికినఁ గాని బెడిదంపునుడులు వెడలవు. బెడిదంపునుడులు వెసలినఁ గాని కాఁ గలకార్యము కాదు." అని జడ నిడిన జాదులు పెఱికివైచి మొగలియాకులు పీఁకివైచి నెఱికురులు విరియఁ బోసి బన్నసరములు విసరివేసి యొడలితొడవు లొలిచి వైచి యాణిముత్యమ్ములు మందిరమ్మునఁ జిమ్మి చెక్కుట

ముక్కునఁ జేతుల గీఱ్ఱిడి నిప్పులు గ్రక్కుచు నిలిచె. ఆభయంకరాకారము గనిన నాభైరవి తలఁపునకు వచ్చె. ఇంత యేల సమీపమున నున్నఁ దన్ను సమయించు నేమో యను భయమున నామనోరమయె యాయావాసమును బాసి చనియె. ఆరక్కసి యిట్లు పెం పెక్కినయక్కసునఁ జూపఱుఁ మానం బుల భయంబు గదుర వినువారివీనులు చెదర ప్రాసాదోపరి భాగము ప్రతిధ్వనుల నదుర గర్జించి తలుపులు మూసి తలఁ గట్టుకొని పరుండెను.

---

## పదుమూఁడవవ ప్రకరణము.

---

### విస్మయము.

రాజరాజనరేంద్రపుర మంతయుఁ దేజరిలు చుండెను. మృగయావినోదము నుండి రాజుగారు మున్నగువారు మఱలు చున్నా రన్నవార్త పుర మంతయు నలముకొనియెను. భేరీకా హళధ్వనులు ఘోరుకొనియెను. రక్షకభటులును శూరశిఖా మణులును కోతులు రైతులు దొరలు మన్నీలు హితులు దుర్గాధిపతులు వరుసగ వచ్చు చుండిరి. కంచుకు లెచ్చరింప వందిమాగధులు కైవారము లొనరింప వేత్రహస్తులు సంగ రక్షకులు ముందు వెనుకలం గొలువ నిక్కుఁపీనులజక్కి నెక్కి పక్కి మాదుజక్కి నెక్కి పురోహితామాత్యశిఖామణులు

తగురీతి వాహనముల నారోహించి రా రారాజు పట్టణమును బ్రవేశించెను. ప్రశస్తము లగుదంతిదంతములు వరాహదంతములు కుంభికుంభస్థలములఁ బందికొక్కులఁ బాఁపపడగల బొంగు వెదురుల దొరకినమంచిముత్తెములు, కస్తూరి, జవాజి, పునుఁగు గోరోజనము, జున్ను, చాఱపప్పు, చమరవాలజాలములు మఱియు ననేకవిధము లగువస్తుచయములు, కొండగొఱ్ఱెలయొక్కయుఁ గొర్రెనయిఱ్ఱులయొక్కయు నేకలమ్ములయొక్కయుఁ బరిశుభ్రమాంసఖండములు, బఱ్ఱెకొమ్ములు గొఱ్ఱెకొమ్ము లిఱ్ఱికొమ్ములు లేడికొమ్ములు సింహశార్దూలమృగాదులచర్మములు, వ్యాఘ్రాదులవాఁడిగోళ్లు మేర మీఱి వచ్చుచుండెను. ఊరిలోనివారు రాజుగారి రాకతోడ వింతవింత లేమి వచ్చునో యని నిరీక్షించుచుండిరి. కొందఱు మన్నెగాండ్రబన్నము లన్నియుఁ బటాపంచ లైనవి కాఁబోలు ననుకొనుచుండిరి. విస్మయము! విస్మయము!

ఇట్లుగాఁ గొంతసేపు పట్టణము మాఱుమ్రోఁగిన వెనుక నెవరియిండ్లు వారు చేరిరి. మన్నీలు మొద లగువారు తమతమ నెలవుల కరిగిరి. పురము సద్దుపడియెను.

పట్టణముఁ బ్రవేశించుటకడవుగ రాజరాజనరేంద్రుఁడు మలికామకలఁ జాలఁగాఁ దీసికొని చిత్రాంగిభవనమును జొచ్చెను. విస్మయకలితుఁ డయ్యెను. దాసదాసికలు తొల్లిఁటివలె నుండక తొట్రుపడుచుండిరి. కత్తివేటు వేసినను

నెత్తురుచుక్క వారిమొగముల లేకుండెను. భర్మహర్మ్యము తేజోవిహీన మై యుండెను. వింతగ నున్న యాయంతిపురము నరసి యాభూకాంతుఁడు కవాటమునఁ గలచేటులఁ గారణ మడిగెను. కాని చిడిముడిపడుచు వా రేమిచేటులు కలుగునో యని యేమియుఁ జెప్ప రైరి. "దేవి యేడ నున్నది?" యని వెండియుఁ బ్రశ్నించెను. "దేవరా! క్షమింపుఁడు. రాత్రి నుండియు భోజన మ్ముల్లక మాకు దర్శన మ్మీయక యమ్మ గారు శయనాగారమ్మున నున్నా" రనిరి. ఆపలుకులు విని నంతన యాపుడమియొడయఁ డుల్లము తల్లడిల్లఁ దొందరమై శయనమందిరము డాసెను. ద్వారము మూసి యుండెను. తలుపు తట్టుచు ధరణీధవుఁడు "చిత్రాంగీ! చిత్రాంగీ!" యని యఱ చెను. ప్రత్యుత్తరము రా దయ్యె. "అయ్యో! నావియోగ మును సైరింపక యాపె నాపై నలిగి యుండెఁ గాఁబోలు! కోమ్మా! ముద్దుగుమ్మా! నానేరమును సైఁచి నన్ను నీదాసుఁ బోలె మన్నింపుము." "ఛీ! ఛీ! మూర్ఖుఁడా! ఇంకను నానేర మును సైరించు మని వేఁడుకొను చున్నావా! నీయిచ్ఛ వచ్చిన ట్లుచ్చికబుచ్చిక సేయుటకు నే నేమి స్వైరిణి ననుకొంటివా!" "సుందరీ! నే నెన్నఁడును నట్లు తలఁప లేదు. నీవ యూహిం పుము నీయెడ నా కట్టిభావ మున్న ని న్నింతగారవించెదనా! నిక్కముగ నిన్ను నాపతిగానె యెంచి యుంటిని." "ఇన్నాళ్ల నుండియు లేనిది నీ కిప్పు డేల జనించెరా నాపై

నీయుక్కువ! నీగారవము కాలి చల్లవాఱ!" "కారణవశ
మునఁ గాలహరణము గావించితిని గాని కాంతా! నీపై గౌర
వము లేక కాదు. క్షమింపుము. ఇప్పటికిఁ దెలిపి యయినది."
"హా! కూళవిధీ! న న్నింకను నేల మన్నిగొనక యున్నావు!
దినదినగండము వేయిదేండ్లాయు వన్న ట్లయ్యె! నే న ట్లీ
కాఁపురముఁ గడతేర్చెదను. నే నీయవమానము నోరువఁ జాల
నన్ను నీసన్నిధికి సత్వరము గొంపొమ్ము." "అయ్యో!
అయ్యో! చిత్రాంగీ! నీ వునుఱు విడిచిన నే నీవసుధ నసువులఁ
నిలుపఁ గలనా! నాకును నీతోడిదేలోకము. హాయిగ నిహ
లోకసౌఖ్యముల నందక సుందరీ! నీసౌందర్యము నగ్గిపాలు
చేసి పరలోకమున కరుగ నేల?" "అమ్మకచెల్ల! నా కక్కడ
దాపురించె నీగాము. స్వర్గమునకుఁ జనినను వడివేయులు తప్ప
వన్నట్లు మూర్ఖుఁడా! నాతోడిదేలోకమా నీకు? నిన్నుఁ గూడి
సౌఖ్య మనుభవింప వలెనా? నీనాలుకచీలికలుగాను నీకు సిగ్గిం
తయు లే దేమిరా! య ట్లనుటకు?" "ఔను నేను సిగ్గు
విడిచిన మాట నిజమే; కాని వ్రతము చెడినను సుఖము దక్క
వలదా! న న్నిట్లు మారుబారికిఁ ద్రోయుట నీకు సుకరమా!"
"ఛీ! ఛీ! కూళ! యింకను నీకావర మింక కుండెనా? అవ
లికిఁ బోక యుంటివా? ఛీ! యున్నఁ గుక్కయుఁ దొలఁగునే
దురభిమానుఁడా! నీవు పో వేమిరా! పా మ్మావలకుఁ
బొమ్ము." "ఏమి దీని కింత కావరము! కాఱు లఱచు

చున్నది. కామాంధకారమునఁ గడుఁగడు వేఁడుటను గదా న
న్నింత తేలికగ నీకాముని నిందింపు చున్నది. ఓసీ! మత్తకాసినీ!
తలుపు తీసెదవా లేదా? నీవు సవ్యముగఁ దలుపులు తీయ
కున్న బ్రద్దలుకొట్టించి యైన లోఁ బ్రవేశించి నిన్ను ముక్క
ముక్కలుగఁ జీల్చివైచెద.” “ఓరీ! బాలిశా! తుట్టతుద
కెట్టియిక్కట్టులఁ బెట్ట నొడిఁ గట్టితివిరా? నీవు లోనికిఁ బ్రవే
శించునంతపర్యంతము నేను జీవించెదనా? నాజీవితేశుఁ డేతెంచు
ననునాశ నుంటిని గాని లేనిచో నే నీవఱకె మరణ మొంది
యుందును. నీతో నుత్తరప్రత్యుత్తరములు జరపుట నాబుద్ధి
హీనతయే. హా! సారంగధరా! సారంగధరా! నీవు నాకు
మారుఁడ వనుకొంటిని గాని యిట్లు వలవంతల ముంచెద వని
కలలోను దలఁప నైతి. హా! మహారాజా! నేను మరణించిన
వెనుకఁ బంచప్రాణములు నాపై నిలిపి యుండినన్నీ వెంతగఁ
జింతించెదవో కదా! సిగ్గు! సిగ్గు! నిన్నిప్పుడే మని పిలిచెద?
నాథా! యందునా మామా యందునా! ఛీ! ఛీ! నేఁటి
దనుక నాథా! యని పిలుచుదాన నిన్ను మామా యనుటకు
నో రెట్లు వచ్చు? అదియు నిదియు ననకుండ నాయసువులె
విడచు చుంటి. ఇంతపర్యంతము నీవు వచ్చెద వీబన్నము నుండి
నన్ను విడిపించెద వనుకొంటిని గాని కార్యము లేకపోయె.”
అని బిగ్గఱగ గొంతెత్తి యేడ్వ సాగె. “అరరే! యేమి
నిష్కారణము తూలనాడితినే! అయ్యయ్యో! యిందువద

తామసి తామసి యగు ననిరి. ఇంతకు నదృష్టవంతుఁడనే
వేగిరింప నైతి. అరే! దురాత్మా! ఏమిరా నీ కీపోఁగాలము!
నీ వింతో సన్మార్గవర్తనుఁడ వనుకొంటిని గాని యీసన్మార్గ
వర్తనుఁ బోలి గురుదారనె కూడుదు వనుకొన లేదురా! పే
రోక్క మైనందులకుఁ బో నిచ్చితివి కావురా! నాసమక్షమున
నెంతయో వైరాగ్యమును వెల్లడించి నాపరోక్షమున నవతితల్లి
యెడ ననురాగమును వెల్లడించితివా! 'అతివినయమ్ ధూర్త
లక్షణ' మ్మని రిదియె కదా! పాప మిందుననే యీయిందు
వదన ద్వారమును బంధించి యున్నది. దేవీ! చిత్రాంగీ!
భయపడకుము. నేను నీమనోహరుఁడ. రాజరాజనరేంద్రుఁడ.
నాకంఠస్వరముఁ బట్టియైన నన్నానవాలుపట్ట లే కుంటివా?"
యనియెను. తలుపులు విడిసెను. చిత్రాంగి రాజరాజనరేంద్రుఁ
గాంచినంతన "హా! ప్రియా!" యని కౌఁగిలించి స్మృతి
తప్పిన ట్లుండెను. తొల్లింటికన్న విస్మయకలితుఁడై రాజరాజ
నరేంద్రుఁడు "అయ్యో! ప్రాణేశ్వరీ! యి దేమి నీరూప
మిట్లుగ నున్నది. కటకటా! నేను కన్నులఁ గాంచఁ గలనా!
చూడఁ జాలఁ జూడఁ జాల!" అని భుజముపై మోమిడి
మూర్ఛ నున్నయన్నుమిన్నను మెల్లమెల్లన సేద దేర్చు
చుండెను. ఆహ్లాదనయనయు నల్లనల్లనఁ గన్నులు విప్పి "హా!
జీవితేశ్వరా! మి మ్మీజన్మమ్మునఁ దిరుగ నరయుదు ననుకొన
లేదు. తిరుగ నా కీసుందరపాదారవిందములకు వందన మొనర్చు

భాగ్యమును ముఖారవిందము నరయుపుణ్యమును నబ్బ నను
కొన లేదు.” “ఊరడిల్లు మూరడిల్లుము. కాంతా! సంగతి
సవిస్తర మెఱింగించి నాసంశయ మెడలించెదే?” “సంశయ
మెడలించుట యేమి యన్నియు నెడలించెదను. అయ్యో!
నా కీళ సిగ్గేల! చావ నున్నవారికి సముద్రము మోకాలి
బంటి కదా! వినుఁడు: నేను మీరు కాననముల కరిగినదిమొదలు
కంటినిండ నిదురయుఁ గడుపు నిండ నన్నమును లేక చలువ
వలువలు కట్టుటయు జాజివానగలు పెట్టుటయు మాని యహ
రహము మిమ్మే నెమ్మనమ్మున స్మరియింపుచు నుండ నిన్న
సాయంకాలము సందెచీకటివేళఁ జక్కఁగ నలంకరించుకొని
వచ్చియు రానిమీసములు చే నవరించుకొంచుఁ గులుకుచు—
అయ్యో! వానిరూపు మాపుగాను వానిసౌందర్యము నమసి
పోను—యాదృచ్ఛికముగ నిచ్చోఁ బ్రత్యక్ష మయినాఁడు.
ఏమి చెప్పుదును స్వామీ! నాప్రాణములు కడఁ బట్టినవి.
నోట మాట రా దయ్యె: ఒడల దడ పుట్టుటయే కాక చెమ్మ
టలు పట్టినవి. అంతిపురములోపలకు—అందును నాశయనమం
దిరములోపలకు—నింతధైర్యముగ వచ్చిన యీవింతవాఁ
డెవఁడా యని పరిపరివిధముల నాలోచించి యెట్టెటో గద్దరికను
పిల్లవ నెవరు మీ రంటిని. నా సుందరీ! నేనా నేనా యెఱుఁ
గవా నాఁడు నీ కనిపిన రూపపటముల నే[illegible] లేనా! అది యేల
తొలుత నీవు వరించినది నన్నే కాదా! కావున నీమనోహ

రుఁడఁ గానా!" యనియెను. "ఔరా! సారంగధరా! యెంతకృత్రిమస్వాంతుఁడవురా! ఇంతకపటాలోచన కల దని కలలోను దెలియ నైతినిరా!" అని యవనీధవుఁడు ఆలోచనాన్వితుఁ డయ్యెను. "అప్పుడు నా కాచిత్రపటము దృష్టి వచ్చి—యంతపర్యంతముఁ జూచితినా యేడ్చితినా మీకుమారుఁడు—అయ్యో! మీకుమారుఁడా నాకు మారుఁడా!—అనుకొని యాత్మజా! నీరాకకుఁ గారణ మేమి యంటి. ఏమో యీభూమి నెందఱు మాఱుతల్లులు లేరు! ఎందఱు సవతితనయులు లేరు! వారివలెనే నేను ననుకొంటిని గాని నాకర్మ మిట్లు కాలిపోవును వాఁ డంతకపటమున వచ్చినాఁ డనుకొంటినా కావున న ట్లడిగితిని. అడుగుటతడవుగ మీఁదిమీఁదికి వచ్చి నారాకకుఁ గారణమా బింబాధరీ! నీయధరసుధారస మానుటకే యని తటుక్కునఁ జెక్కిలి నొక్కి మోము మోమునఁ జేర్ప నుండెను. అంత నే నల్లంతన నెగిరిపడి రే! దుర్మతీ! యేమిరా! నీ కీయంత్యకాలము! అనుచుంటి. కాని నామాటలైన నెడ మీయక వగలాడీ! ఏమి వగలుపోవు చుంటివే! వల పెంత యున్నను బడతులు వగలఁ బోక మాన రని నే నెఱుఁగుదు; రమ్ము కౌఁగి లిమ్మని కరములు పట్టి లాగె. నాథా! యివే యాగీఱలారయు" మని వెక్కి వెక్కి యేడ్చుచుఁ జెక్కిలిఁ జేతులఁ జూపెను. రాజును దోఁక త్రొక్కిన త్రాఁచు రీతి మండిపడుచు "నరే! పాపాత్మా! నీ కింతట నంతముఁ

సమీపించినది కావుననే యిట్టిసాహసమున కొడిఁ గట్టితివి.
వినవే వినాశకాలే విపరీతబుద్ధి యని?" "జీవితేశా! యంత
టిలో నే మయ్యె. అనంతరము నను బలిమినిఁ బాన్పునఁ బడఁ
ద్రోయ నుంకించి పెడనగవు నగి దానికన్న మున్న గాను
నాయాణిముత్యములహారమున నమరించినమాంగళ్యము గని
ప్రియసీ! నీ కీతాళిబొట్టేల! ఎవ్వఁడో కట్టినదాని నీ వింకను
దాలుప నేల యని యమంగళవాక్యము లాడుచుఁ దటుక్కున
నామంగళసూత్రహారమును బుటుక్కు మనిపించె. ఇవే ముత్య
ములు కనుఁ డీగది నెల్లు చెల్లాచెద రయి యున్నవో! హా!
నామదుటివ్రత! ధవుఁ డుండఁగనె విధవవ్రత విధాతఁ
లిఖించెఁ గాఁ బోలు" నని బుడిబుడియేడ్పు లేడ్చెను. ఇఁక రాజు
గారియాగ్రహము వర్ణనాతీతము. ఆసమయమున నాకలియు
రుద్రుఁడును నక్కడ నిలువఁ జాల రన నతిశయోక్తి కా నేరదు.
వెంటనే కత్తి దూసి యామదమత్తుని దుత్తునియలుగ నొనరింతు
నని వెడల నుండెను. కాని చిత్రాంగి వాని నాఁపి "నాథా!
మీరు వృద్ధులు. వాఁడో కండబలువున నున్నవాఁడు; వలదు
నావలు కాలింపుఁడు: బ్రదికి యున్న బలుసాకైనఁ దిని
యుందుము." "ఓసీ! బేలా! వాఁడు న న్నేమియుఁ జేయఁ
జాలఁడు. ఈవాలువాలునకు వానితల బలి యియ్యనే" యని
ఖడ్గము ఝళిపించి యపరంజిపరుంజు వోడిసిపట్టెను. "నావృ
త్తాంతము దుద మట్ట వినుఁడు. తొందరపడకుఁడు. ఎవ్వఁడు

నామంగళసూత్రమును వాఁడు త్రెంచివై చెనో యప్పుడ నేను
పరుగిడఁ దొడఁగితి. గది వెలువడితిఁ; గాని కాళ్లు సాఁగలేదు.
తడబడియెను. పుడమిఁ బడుదు నని జడుపు జనించెను. ఆ
దుర్మార్గుఁడును నన్ను వెన్నాడు చుండె. అంతలో నింకను
నాకు మీదర్శనభాగ్య ముండుటను గాఁ బోలు నొక్కదివ్యో
పాయము పొడమినది. వెంటనే వానిఁ గొన్ని యడుగులు
ముందునకు రప్పించి తిరుగ నన్ను చేర కుండనే మందిరము
ప్రవేశించి తలుపులు బిగించితి. కాని యాయవినీతి తరలక
తలుపుఁ దట్టుచు నెన్నెన్నియో దుర్భాష లాడెను; ఎన్నెన్నియో
బాసలు చేసెను; ఎన్నెన్నియో యాసలు గల్పింపఁ జూచెను.
ఆహేతువుననె మనోనాథా నేను తెలియక తిరుగ నేఁడును
వచ్చె నని మి మ్మనరానిమాట లంటి. కొలఁ గట్టుకొంటి.
ఎఱుఁగక చేసిననాయపరాధమును సైఁచి నన్ను మన్నింపుఁడు."
"మన్నన ల కేమి యాపాపిష్ఠుని మన్ని గొనుదనుక నాకు శాంతి
యలవడదు" అనియెను. "అయ్యో! మఱచితి వానివలెవాటు
పాము గాను; ఇదే చూడుఁ డీబంగారువ్రాఁత రంగారుకందువా
హళాయలు మీఱ వైచికొని నేను పాన్పు డిగి ప్రశ్నించు
నప్పుడు తాను శయ్యఁ జేరి యాయుత్తరీయము నందునిచెను.
పాపము ముప్పతిప్పలు పెట్టి మెట్టు లైనఁ దనకొక్క నెరవేర్చు
కొనఁ దలఁచినాఁడు కావున నిది యీమాంసతూలికాతల్పమున
విడిచెను." "ఇంతగందరగోళ మయినప్పుడు నీదానదాసిక లే

మూలఁ బడి యున్నారు? ఒక్కరును దరిఁ జేర లేదా! వారును
వానితో నేకీభవించిరా?" "ప్రాణేశా! అభిమానము మా
నముఁ బోనాడుకొన లేక యెవ్వరు వినిన నవ్వుదురో యే మను
కొనెదరో యేమి దెప్పెదరో తనువు గలిగినంతపర్యంత మీ
యవమానమునకుఁ దల యొగ్గ వలయుఁ గాఁ బోలు! లోకులు
కాకు లనిరి. అల్లరి చేసిన మన బ్రదు కెల్లయు నల్లరి యగును.
నాయనస్మృతి నెఱిఁగి నైన వివేకము దెచ్చుకొని మనసుఁ జిన్నఁ
బుచ్చుకొని పోక పోవునా యని యాయడిగినమూఁడుమాటలు
నెంతో శాంతమున నుడివితి. తరువాత నేను తలుపులు మూసిన
కొంతకాలమునకు నాసఖి మనోరమ వచ్చు చుండుట నెఱిఁగి
కాఁ బోలు నతఁడు నిష్ప్రయోజన మని నిర్ణయించుకొని నిరాశఁ
జేసికొని పఱుఁగిడె. నన్ను నా చెలికత్తె పిలిచి "యమ్మా! యి
దేమి యెన్నఁడు లేదు, నేఁడు తలుపు మూసికొని యున్నా" వన
"మనోరమా! యేమో నాకు దేహమున స్వస్థత లేదు. నాథుఁడు
కాశకుఁ బోయిననాఁట నుండియు నా కేమో యదియొకవిధ
ముగ నుండె నని నీవ యెఱుఁగుదు. నేఁడ వచ్చెద నని రా
కుండుట మఱి యింత బెంగగ నున్నది. నే నయి వచ్చి కోరు
వంతపర్యంత మెవరును నాచెంతకు రా వలదు. నన్ను పిలువ
వల" దంటి: కావున వారును నేరును రా రైరి. "అహా! నేను
పురము వదలుట యెంతముప్పు వచ్చినది! నీవు రచ్చ కెక్క
కుండ నీప్రవర్తనముఁ గప్పిపుచ్చ నెన్నియో ప్రయత్నము లొన

రించితివి కాని యది మానదు. ఏలయూ యతని నెత్తురు కన్నులఁ గాంచినఁ గాని నేను నిదుర పోను." అని యొక సేవకుని బిగ్గఱగఁ బిలిచి "ఓరీ! యీయుత్తరము నీముద్రికను గొనిపోయి సుమంతుని కొసఁగి నాయాజ్ఞ నీక్షణము నెరవేర్పు మను" మని యొకయుత్తరము వ్రాసి ముద్రికతో నిచ్చెను. భటుఁడు వెడలెను. "దేవీ! నీవు వచించినట్లు తొందరపడక నాసభాస్థానముననె వాని దోషిగ నిరూపించి నిర్మూలించుటకు నిశ్చయించుకొంటి. అయ్యయ్యో! చిత్రాంగీ! నీయీరూపు గనుఁగొనినకొలఁది నాకుఁ గంప మెత్తు చున్నది. ఇఁక నీవు లోని కరిగి జలకము లాడి చలువవలువలు కట్టి యలకలు తిలకము దిద్ది చక్కనై రమ్ము." అని బ్రతిమాలి యామెను లోన కనిపెను.



## పదునాల్గవ ప్రకరణము.

దుః ఖ ము.

ఛున్న నేను గురుద్రోహి నైతి. నాకళంకము మాపుకొన నేఁడు నాసంతతిని నాపేరునను జన్మించి గురుదార నంటకయ వచ్చినను నా కీయిక్కట్టు తప్ప దయ్యెనే యనుకొని కాఁబోలు సారంగధరుఁడు మా మెట్టువారఁ బొడకట్టు చుండెను.

"కట్టా! నేఁడు నాపాపిహస్తము లెట్టిపాడుపని నొనరించినవి. నా కిట్టికానికార్యము ఘటిల్లు నని కలలోను దలఁప

నైతి. అయ్యో! రాజున కంతకంతకు బుద్ధి పోవు చున్నది. ఆమోహానికిఁ జిక్కి ముందువెనుక లాలోచింప కున్నాఁడు. మోహపాశములఁ గట్టుపడి న్యాయాన్యాయవిచక్షణ విడనాడు చున్నాఁడు. ఇ దెట్టిచెట్టల కాటప ట్టగునో! ఈవేంగిరాజ్యము క్షీణించుట కిదియ మొదలు కాఁ బోలు! దైవమా! నీ వైనఁ దోడుపడవా! ఓరామలింగస్వామీ! ఓకోటిలింగేశ్వరా! మమ్మీయాపద నుండి తప్పింపవా? నీ భక్తుఁ గాపాడవా? ఓ కామసంహారా! మామహారాజుగారికామము నణఁపవా? కామావేశమునఁ గన్ను గానక యున్నమాప్రభున్ను జ్ఞాన దివ్య దృష్టి ప్రసాదింపవా? దేవా! తగదు తగదు రక్షింపుము రక్షింపుము. ఆహా! కామమునఁ గ్రోధము, క్రోధమున లోభము, లోభమున మోహము, మోహమున మదము, మదమున మత్సరము నిట్లొక్కటొక్కటిగ నరిషడ్వర్గము లెల్ల విజృంభించి రాజు గుణవిహీనుఁ జేయు చున్నవి. పూర్తిగ బంధించివేయు చున్నవి. సుహృద్వరులపలుకులు చొరవు మిత్రులయాలోచనలు వినఁ బడవు. అహర్నిశ లాచిత్రాంగిమందిరము నెడఁ బాయ కున్నాఁడు. అత్యంతావసరములఁ దక్క సభాస్థానమునఁ దనమోమే చూపఁడు. చెట్టు చెడుకాలమునకుఁ గుక్కమూతి పిందె లని యీవృద్ధత్వమున నెక్కడ వలవడిన దీకామము. ఈపిశాచమును వదల్చుమార్గము లేదు. ఒకరు చెప్పిన వినఁడు. తనకుఁ దోఁచదు. ఇవి యన్నియు న ట్లుండనీ హా! యువ

రాజా! సారంగధరా! నీపై నాస లెల్ల నిల్పి యున్నమాకు
నాయాసలును బాసి పోవు చుండెను. వృద్ధరాజుకే నెన్నాళ్లు
పరిపాలించును యువరాజ్యాభిషేక మొనర్చినతనతనయున
కేలుఁబడి నిడక కావున నింతటనె మనము వేగిరపడ నేల కొన్నా
ళ్లలోనే యీయాపద లన్నియుఁ గొన ముట్టునని పుట్టెఁడాసతో
నుంటిఁ దండ్రీ! సారంగధరా! నీ కిచే లేమి! సుగుణగుణో
ద్దామ! సర్వకళాభిరామ! సారంగధరనామ! యువరాజా!
నీ కెంతవంత వాటిల్లె! అయ్యో! వంత యను చుంటినా!
హా! జితేంద్రియా! ఇంతభంగ మొనర్చినను రాజు నొక్క
పలుకాడవు! ధైర్యము తూలవు; దైవము దూఱవు; కల్ల
నిజములు బయల్పుచ్చవు! హా! రాజకుమారా! ప్రథమమున
నీజనకుఁడు పాలించిన ట్లుండు ననుకొన్న నీధర్మపరిపాలనము
నభివృద్ధి యొనరింపుచు సర్వనుజనాశ్రయుండ వై దిగంతకీర్తి
విస్తారుండ వగునీసురుచిరాకారమున కండ నుండ మేము నో
మమా! స్వప్నమునందైనఁ బరులఁ దూలనాడవే; యనృతా
లాపము లాడవే; కుసుమకోరకముల నైన గోట గిల్లవే; పర
కాంతలఁ గన్నెత్తి చూడవే; యట్టి నీవా యంతఃపురద్రో
హివి! హా! ధాతా! నీ కెంత జాలి లేదు! నీమానసము దారువో
లోహమో వజ్రమో యయి యుండు. అక్కటా! సారంగ
ధరా! నిన్ను నానుబుద్ధికన్న మిన్నఁగఁ జూచుచున్నాను గదా!
నానుబుద్ధితో నేమి తెల్పుదును! అన్నమున కింకను రాక తడసె

నేమో యని యెదురుఁదెన్నులు చూచుచునీకన్నతల్లి కెట్లు వినుపింతు నోయీ తండ్రీ! పాపిదైవమా! యిందుకేనా యీ సుమంతు నింకను బ్రదికించితివి!" యని యెంతయు వాపోవుచుఁ జెలువవలువలు దొడిగికొని యుత్తరీయమున నయనములఁ బారలుజలముల నద్దుచు నొకవృద్ధుఁడు రత్నాంగిదేవిగారిదివ్యభవనమును డాయుచుండెను.

రత్నాంగిదేవి క్రమప్రకారము మందిరమునకు రాని తనతనయునకై యాందోళనపడుచు మందిరద్వారమునఁ గని పెట్టుకొని యుండెను. ఆయమ్మచిత్తమ్ము తమ్మిపత్రమ్ములోని నీరమ్మువిధమ్మున నిలుకడ లేక తబ్బిబ్బగుచుండెను. మఃస్నానఁడును వేళ నతిక్రమింపనిసుతుఁడు నేఁడు రాత్రి యధికమగు చున్నను రాకుండుటఁబట్టి యేమో పట్టి యెట్టు లున్నాఁడో! యెచట కేగెనో యని యామె తల్లడిల్లుచుండెను. ఆహా! మాతృప్రేమ!

"ఏమి! సారంగధరుఁ డింకను రాఁడయ్యె. నే నూహించినట్లు ముప్పు వాటిల్లెనా! మాయలాడి చిత్రాంగి మాకొంపఁ దీయ లేదు కదా! నే నెంతచెప్పినను వినక నామిత్రుఁడు విధి పట్టి యీడ్చినట్లు పోయె. కట్టా! యేమి నావామాక్షి యదురుచుండె. ఇంకను శయ్యామందిరమును జేర రాఁడు. అయ్యో! గుడ్లగూబ గూయుచు నెదురయ్యె. సానంగాశినం గతి నామనంబును జేయి పెట్టి కలఁచుచున్నది. నామానసము

డోలాయమాన మగు చున్నది. అడుగులు తడఁబడు చున్నవి. అకటకటా! యెంతనడచినను జననిరత్నాంగిదేవిభవనమును డాయ కున్నానే!" అనుచు సుబుద్ధి రత్నాంగిదేవిమందిరమును నధిూపించెను.

తత్క్షణమ రత్నాంగి "నాయనా! సుబుద్ధీ! నాసారంగ ధరుఁ డేఁడి?" యని యడిగెను. "అమ్మా! నానెచ్చెలి యింకను రా లేదా! భోజన మాలస్య మగు చుండెనో లేక తమతో నే దేనివింతసంగతి ప్రసంగించు చుండెనో కాలాతిక్రమణ మయ్యె నని నేను వచ్చితి. మాతా! నేఁటిసాయంకాలము నుండియు మీకుఁ గనుపింప కుండెనా?" "కుమారా! సాయంకాలమే యన నేల మధ్యాహ్నము నుండియు కనుపడఁ డయ్యె. నిన్ను వీడి యెన్నఁడు నెక్కడకుఁ బోయి యెఱుఁగఁడే తండ్రీ! యి దేమి!" "హా! దైవమా! ఏమి కల్పించితివో కదా!" యని సుబుద్ధి విచారింపఁ దొడంగె. "సుబుద్ధీ! అది యే మది యేమి! త్వరఁగఁ దెల్పుము. గోరుచుట్టుపై రోఁకటిపోటు నా నీపలుకులు నాచెవులను ములుకులవలె నాటినవి."అని తత్తరపడఁ జొచ్చె ను. "సూర్యచంద్రాదులు గతులు తప్పినను సప్తసముద్రము లింకినను భూమి క్రుంగినను నగ్ని చల్లఁబడినను నామిత్రుఁడు తప్పతోవఁ ద్రొక్కఁడు నిక్కముగఁ ద్రొక్కఁడు. కావున నావనిత యేదో గ్లాని కలిగించినది. గతరాత్రియు నీదినమునను నే నెంత తర్కించి యడిగినను సుబుద్ధీ! యీయెుక్కసంగతిని

గుప్తముగ నుంచినందులకు నన్ను మన్నింపుము. నే నట్టిప్రతినఁ జేసికొంటిఁ గావున నన్నావిషయమై బాధింపకు మని బ్రతి మాలెనే కాని విషయ మేమో వివరింపఁ డయ్యె. యథావిధి లేక యలజడినున్న ట్లతనివైఖరియ చెప్పక చెప్పినది. ఏదో బలవత్తమ మయినకారణ ముండ కున్న నట్లనునా! మా యిరువురిమనము లొకటియే కదా! మఱియు నిది నాతోన యంతరించుటకు—అని వంశయింపుచు—ఆజగన్నియంత నెంతో ప్రార్థింపు చున్నాను. అనిరాను. హా! దైవమా! మా కేమి ఖామ నమ్చిలివి! రాజు కామమదాంధుఁ డయి యుండుటయే గాక చిత్రాంగిదగు కేలుఁ గీలుబొమ్మ నా నాడు చున్నాఁడు. ఆపె పంతగొండి. ప్రయత్నము కొనసాగమి నేమిపాటు కల్పించెనో" యనుచు లోలోనఁ దలఁపు చుండెను. రత్నాంగిదేవి తిరుగ "మాటాడ వేమి నాయనా! నీవైఖరి చూడ నాకు మఱియు నాందోళన ముద్భవించు చున్నది. ఒడలు దడ పొడము చున్నది. అదవదపడు చున్నావు. కారణ మేమో తెలుపవు. తండ్రీ! ఏమయిన హాని సంభవింపదు కదా!" అనునంత నుమంతుఁడు ప్రవేశించు చుండె.

"కారణ మేమో నే నెఱుఁగను గాని జననీ! నిన్నటి నుండి నామిత్రుఁ డొకవిధమున నుండెను. మీరును గనిపెట్టియే యుందురు. నామాట వదేమో త్రోసివేసి యాచిత్రాంగిదేవి గారిభర్మహర్మ్యమునకుఁ జనినాఁడు."

"అదియు నేఁడు ముప్పు వచ్చెనో కుమారా!" యనుచు సుమంతుఁడు నుడివెను.

"ఏమిముప్పేమిముప్పు తెలుపుమా!" యని వెంటనే సుబుద్ధియు రత్నాంగియు నడిగిరి.

"చెప్ప నోరాడకున్నది. ధైర్యము చాలకున్నది. యువరాజుగా రంతఃపురద్రోహ మొనర్చి రనునపోహమున రాజుగా రతనిఁ గారాగారమునఁ ద్రోయించిరి—"

"హా! కుమారా! సారంగధరా!" యని వినియు వినకయే రత్నాంగి వెనుకఁ బడ నున్నతఱి నాపెఁ గనిపెట్టుకొని యున్న దాసియొకర్తా మెను నేల వ్రాలకుండఁ గైలఁబట్టెను.

"హా! మిత్రమా!" యని సుబుద్ధియు నిలువున నీ రయ్యెను. కొంతపర్యంతము నిశ్శబ్ద మయ్యెను. తోడ్తోనఁ దెలివి వచ్చి సుబుద్ధి "తండ్రీ! నాసంగడీఁ డిపు డేడ నున్నాఁడు?" అని యడిగెను.

"కొడుకా! నేర మారోపణమై విచారణ యొనరింపఁ బడు వాఁడగుఁడు చెఱసాలను." అనునంత నొక్కక్షణమును నాఁగక "నా చెలికాఁడు చెఱసాల నుండ నే నిచట నిలుతునా" యనుచుఁ గడుశీఘ్రమునఁ బరు గిడెను. చెఱసాల సమీపించె. చేరినతోడనే పేరుతోడ మిత్రుని జీరెను. అది యంధకార బంధురమై యుండుట నెట్టెట్టో తడవి యునుపతలుపుఁ బట్టుకొనియెను.

"కంఠస్వరముఁ బట్టి సుబుద్ధి నా నున్నాఁడే! మిత్రమా! సుబుద్ధీ!" యని యీయెడ భగవచ్చింతనయే ప్రధానముగఁ జేసికొని యున్న సారంగధరుఁడు పిలిచెను. "హా! సారంగధరా! సారంగధరా! పావురములయాటయే వ్యసన మని వారించితిని. అధర్మమార్గమున నడు గిడ వల దని ప్రార్థించితిని. విన వైతివి. అయ్యో! కలరవక్రీడ తుద కిట్లుగాఁ బరిణమించెను. నమ్మఁ జాల నమ్మఁ జాల నేనే కాదు సకలచరాచరములును నమ్మఁ జాలవు—ఒక్క—కామమదాంధుఁడు నీజనకుఁడు గాక—"

"మిత్రమా! వద్దు వద్దు. బుద్ధిశాలివి. నాజనకు నింతయు నిందింపకుము." అని నడుమ సారంగధరుఁడు నుడివెను. వానివచనములు వినిపించుకొనకయే సుబుద్ధి "మూర్తీభవించిన దోషగుణకదంబమా! నీవా దేవి చిత్రాంగిఁ జెఱుపఁ బూనుట!" "సుబుద్ధీ! ఏమో యెప్పటి కేదియో నీవా యట్టిపనిఁ జేయఁ బూనుట యనెదవు నే నన నొక లెక్కయా!" "నెచ్చెలీ! యెందుకు నన్ను వెడత్రోవఁ ద్రొక్కింపఁ దలఁచెదవు? నీ వాకానిపనియొనరింతు వని యగ్నిఁ జొఱ వచ్చుఁ గుబుసము లూడ్చినభుజంగములఁ బట్ట వచ్చు వ్యాఘ్రాదిఘాతుకమృగముల నోరఁ జేయి పెట్ట వచ్చు. ఓ చిత్రాంగిరాహుగ్రహమా! నామిత్రు నెట్టిచెట్టలఁ బెట్టుచున్నావు!" "సుహృద్వరా! మందప్రజ్ఞుఁడ వగుచున్నావు వగచు చున్నావు. పూజ్యుల దూషింపు చున్నావు: వలదు

వలదు." "ఓ తల్లీ! రత్నాంగీ! యద్దాలమేడలో హంస తూలికాతల్పమున విద్యుద్దీపకళికలు వెలుఁగఁ జెలఁగు చుండు నీసుకుమారుఁడు—అమ్మా! నీసారంగధరుఁడు-అయ్యయ్యో! కటికనేల గాఢాంధకారమున నొకగట్టికొట్టులో నొంటరిగఁ గలఁగు చున్నాఁడు. హా! ధాతా! పుట్టి బుద్ధి వచ్చినదిమొద లెన్నఁడు నేకశయ్యఁ బవ్వళించుమమ్మ నేఁడు వేఱు కావించితివి; నీ కన్నులు చల్లఁబడెనే! నీ వెట్టికట్టెఁడివి నవివేకివి నగుటనే ని న్నెవరును బూజింప కున్నారు. హా! సారంగధరా! నన్ను విడిచి నీ వొంటరిగ నాపన్నుండ వై పన్నుండ నున్నావా! వలదు వలదు. నిన్ను నేను విడిచెదనా!" యని యాయువపతలువును యావచ్ఛక్తి నూఁపెను. ఆధ్వని విని యాయుధహస్తుఁ డొకఁడే తెంచి "ఎవ రది ప్రాణములపై నాన లేని—" అని యేదియో యింకను నడువ నుండెనే కాని "రాజసేవకా! యీసు బుద్ధి నిలిపి యీనుగుణాలవాలు సారంగధరుఁ బ్రాలుమాలి కారాగారమునఁ బడఁ ద్రోయించి యీ సుబుద్ధి నీవల నిలిపె నారాజు; నీ వైన నీతని నిందునం ద్రోయ రాదా!" అని ప్రార్థించెను. "నమస్కారము మంత్రిపుత్రా! క్షమింపుము వాయసమర్థతను." అని యతఁడు మగిడెను. "సుబుద్ధీ! నీవు మహామోహప్రవాహమునఁ గొట్టువడి పడి కుడివడి పోవుచు నీయార్తనాదముల నన్నును ముంప నున్నావు. కావున నీతోడ లోఁతున దిగుటకన్న నిదే హరనామ మను

మాఁత నీ కొసఁగు చున్నాను. దానిఁ గొని తరింపుము. ఆపన్న మగ్నుల కదియే సర్వప్రదము. హర! హర! హర! హర! శంభో! మహాదేవ! శంభో! యని సారంగధరుఁడు భగవన్నా మసంకీర్తనమునకుఁ దొడంగెను.

“మిత్రమా! భోజనమునకు రా వైతి వని యాదవద పడునీయమ్మ కేమి వినిపించెదు. అయ్యో! ఆమె మొగ మే మని చూచెద. ఏ మని యూరడించెద.” అని సుబుద్ధి నెత్తి మొత్తుకొను చుండెను. “సుబుద్ధీ! తనకు సారంగధరుఁ డను తనయుఁడే కలుగ లే దనుకొని సృష్టివైచిత్ర్యములు బాగుగఁ బరికించి మాయాప్రపంచమునఁ దగులువడక నామాతను దన పతినే యనవరతము స్మరియింపు మనుము. మహాపతివ్రతా శిరోమణి యామెకుఁ జెప్ప వలసిన దేమి! కారణవశమునఁ జేసి కలుగుచుఁ బోలియుచు నుందురు నందనులు. ఇంతవగ పేల! నానిజమాతృమృదుతరకరసరసీరుహములోనియిష్టమృ ష్టాప్తి తినుభాగ్య మన్నింటిని బోలి నేఁటితో సరిపోయినది. సృష్టికర్త నా కిడినబత్తె మంతయుఁ జెల్లినది.” యనియెను. “చెల్లెనా! జ్ఞప్తి వచ్చినది నాఁటి దగుచిత్రలేఖ. దాని నేమం దును. కే పది నిదర్శనము కాదా నీనిర్దోషమునకు!” అని సుబుద్ధి శరవేగమున బరుగిడెను. సారంగధరుఁడు వెలవెలఁ బోవుచు “అయ్యయ్యో! నాతోడనే యంత మొందు నను కొన్నయాయుదంశము రాద్ధాంతమునకు వచ్చెఁ గాఁ బోలు!

కట్టా! అయ్యమ్మను నింద నొందింప కుండ వలె ననునాతలంపు నిష్ఫల మగుచు గాఁ బోలు! హర! హర! హర! మహా దేవ! శంభో! అని తనశివోపాసనను బ్రారంభించెను.

రత్నాంగిదేవి దాసిక లొనరించినయుపచారముల సేదదేరెను. "హా! కుమారరత్నమా! నే నింకఁ బ్రతుకఁ గలనా!" యని నిట్టూర్పుపుచ్చి యూరకుండెను. పరివార మెల్లయు నశ్రువు లొలికింపు చుండెను. సుమంతుఁడు నెలుఁగు రాల్పడ నూరడింపు చుండెను. "పాపీ చిరాయు స్సుకృతీ గతాయు" వని వరతనయా! నీ కింతలోనె కాలము చెల్లెనా! హా! గౌరీమనోహరా! యాయువు లేనిమూను నొసంగితివా! ఇంతకన్న సంతానమే లేకున్న నొకయేసంతాప మయి యుం డునే! ఇచ్చినవాఁడవు వానిబూర్ణాయురారోగ్యవంతుఁ జేయక పూర్ణసుందరుఁ బూర్ణసుగుణు నేల చేసితివి! ఇవి యన్నియుఁ దలఁచుకొని పలవించుటకేనా! హా! సారంగధరా! మాకుఁ గాక యేగర్భదరిద్రులకయిన జనించిన నీ వాయుష్మంతుఁడ వగుదు వేమో కదా! తండ్రీ! యౌవనాంకురముననె యాయు రాంతమా! నాయనా! నేమి యనుభవించితివి నీ వీయిలఁ జనియించి! రాకపోకలశ్రమ యేనా! నీముద్దుమొగముఁ గనుఁ గొనుచు నీనిద్దపుచెక్కిళ్ళ ముద్దు లిడుచు నీచక్కనిచిన్నినోట ముద్దు లిడుభాగ్య మింక నాకు లేదా నాకొడుకా!" యని యెండియు నామె మైమఱచి యుండెను.

"అమ్మా! దేవేరీ! రేపు విచారణ కదా! నీ వింత వంత నొంద నేల! బెగ్గడిలకుము. కారాగారమునఁ బడి యిడుమ లొందినాఁ డని యిక్కట్టియే కాని యాతని కింక నేగ్లానియు లేదు. నాశక్తివంచన లేక ప్రయత్నించి నీసుపుత్రు నీముప్పు నుండి తప్పింపఁ జూతు. తల్లడిల్లకుము తల్లీ! కడతేఱ కుండనే కడతేఱినవానిగాఁ దలఁతు వేమి?" అని సుమంతుఁడు ధైర్యము నెలకొలుపు చుండెను. "ఇఁక నేమి యాశ! పుత్రా! సారంగధరా! మమ్ము పున్నామనరకము నుండి లేవ నెత్తవా! రత్నమునకే రాయిడి, కనకమునకే కాకలు, చందనమునకే యెత్తుడులు, కీరశారికలకె నిర్బంధములు, వరఫలయుత గురుతరులకె రాళ్ళదెబ్బలు, సూర్యచంద్రులకె గ్రహణము, లట్టులు సుకుమారా! నీకే సంభవించెనా యిక్కట్టు" లని కన్నీరు మున్నీరు గాఁ గారుచు చుండెను.

"అమ్మా! పుడుకుఁదోడుకువకె యొడుదోడుకులు; కల్పవృక్షమునకె కష్టజాలములు; ఔన్నత్యము గలవానిపైనే పిడుగు పడును. ఘనతరువుఁ గూలఁ ద్రోయును గాని ఝంఝామారుతము మ్రోదుమ్రొక్కఁ గదల్చునా! కష్టసుఖములు కావడికుండలు. వెన్నెల కొన్నాళ్ళు చీకటి కొన్నాళ్లు. ఇది స్థిరము గాదు. ఓర్పు మార్పు" మను చుండె సుమంతుఁడు.

"హా! తండ్రీ! మాపాలిటి వెన్నెలలు మాసినవి. సారంగధరుఁ డుండమిఁ జీకటి కాక వెన్నెల లెట్లు వచ్చు.

ఈచీకటిలోకమున నే నింక జీవింపఁ జాల! భర్తగారిపాద
ములకుఁ బ్రణమిల్లి యాజ్ఞఁ బడిసి మరణించెదను" అనియెను.

"అమ్మా! తటి నరసి రాజగారియొక్క మనముఁ గరఁ
గించి దివ్యోపదేశము చేసి నీసుతు రక్షించుటకు నీవు ప్రయత్నిం
చిన బాగుగ నుండు నని నాయభిప్రాయము. అంతియ కాని
తల్లీ! కాఁ గలకార్య మంతయు నింకను నుండఁగనే నీవు జీవ
ములు తొఱఁగుట తగునా!" యని సుమంతుఁడు నుడివెను.

"పతికి నాపైఁ బ్రేముడి వీడినది. చెల్లెలుచిత్రాంగియు
నన్ను దయఁ గనదు. నాప్రార్థన లరణ్యరోదనములు. అడవిఁ
గాయువెన్నెలలు. అయినఁ బ్రయత్నించెద. ఓసర్వేశ్వరా!
సర్వరక్షా! ఆలింపుము పాలింపుము. మాయాపదఁ దూలిం
పుము. కినుకఁ జాలింపుము. యమపాశమునఁ జిక్కి పొక్కు
మార్కండేయుఁ గాపాడినమహానీయునకు నీకుఁ గారాగార
మున నుక్కునాగాదిలికొమరుఁ గాపాడుట కష్టమా! సారం
గధరా! సారంగధరుఁ గాపాడ నీవు గాక వేఱువా రెవ్వరు!
నీయక్షీణకరుణాకటాక్షముల వృద్ధి నొందు ననుకొంటిని గాని
నాసూనుఁ డి ట్లింతటనే క్షీణించు ననుకొన లేదు మాంరక్ష!
మాంరక్ష! దయానిధీ! మృత్యుంజయా! యీమృత్యుము
ఖము నుండి నాపుత్రు రక్షింపుము. శంభో! శంకర!
గౌరీశా!" యని కొంత యూరడిల్లెను.

## పదునేనవ ప్రకరణము.

---

### కారాగారము.

రాజమందిర మష్టకోణాకారముగ నిర్మింపఁ బడినటు లిదివఱకె తెలుపఁబడెను. ఆయష్టకోణములలో విదిక్కులు గాక తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరదిశలు తేటగుబాటల విలసిలు చుండెను. కావున రాజమందిరము గలమెట్ట యొక విధముగ నలుచదరముగ నున్న దనవచ్చు. ఈబాట లేట వాలుగఁ గ్రింద నున్న పచ్చికబయలునకు దిగిన వని వేర వ్రాయ వలయునా! మెట్టచుట్టును జెట్లు దట్టముగ నలమి యొకరకమగు శోభను గలిగించెను. మందిరోపరిభాగమున నిలిచి నలుదిశలఁ బరికించెదమా యే మానందముగ నుండును! అందును బడమరఁ గాక మిగిలినదిక్కు లన్నతపాందారణ్యమున భయంకరములై యున్నను నక్కడ నుండి చూచువారి కది యంతయు నొక్కచక్కనిబయలుగఁ దోఁచును.

రాజమందిరమునకు నడుపునాలుగుమార్గములకును గ్రింద నవఁ బ్రారంభమున నాలుగుచిన్నయిండ్లు గలవు. అయిండ్ల రక్షకభటు లున్నారు. ఆమార్గములను భద్రముగఁ జూచుట వారిపని. కావున వింతవా రెవరైన లోన కేఁగఁ దలఁచిన ముందుగ వారిదగువనుమతిని బడయ వలయును.

పడమర నుండి వచ్చుమార్గమధ్యమున నన రాజమం దిరమునకును రక్షకభటునిమందిరమునకును మధ్య బాటప్రక్క సాలఁ బోలునిర్మాణ ముండెను. అది లెక్కగదులఁ గలిగి యుండెను. మలిసినశిలలచే దృఢద్వారముల నది నిర్మింపఁ బడెను. గది యొక్కొటి కొక్కొక్కకిటికీ యుండెను. ఆగవాక్ష ములును గట్టియినుపకమ్ముల నలరారు చుండెను. ఆగదు లంతవిశాలములు గా కున్నను మూఁడుగజముల వెడలుపును నాలుగుగజములపొడవును గలిగి యుండక మానవు. అవి యన్నియు దక్షిణముఖములుగ నుండెను. గది యొక్కయుత్త రపుగోడల నంటియే గజమున్నర వెడలుపు గలయరుఁగొకటి ప్రతియాగారమున నుండెను. ఒక్కొక్క తిన్నెపై నొక్కొక్క కంబళియుఁ జాఁపయు నుండెను. నాలుగు లేక మూఁడువ్రేళ్ల వెలితిని గమ్ములతో నలరారుతలుపుల నవి నిర్మింపఁ బడుట లోపల నున్నవారు చక్కఁగ నెల్లరకుఁ గనుపించెదరు. ఆకొట్టు లన్నియు నస్త్రశస్త్రధారులైన యోధులచేఁ బూర్ణరక్షణమున నుండెను. ఇది చెఱసాల యని వేరుగ వ్రాయ వలయునా!

ఇది నేర మారోపింపఁబడి విచారణలో నున్నవా రుం డునది. శిక్షితు లగువా రుండుటకు భూరికారాగారమును వేరుగఁ గలదు; కాని యది తెలుపుట యిట ననవసరము.

నేర మొనర్చినవా రంతఁగా లేమి నీ చెఱసాలగదు లును నపరాధులఁ గలిగి యుండ లేదు. కాని యొకకొట్టున

మాత్ర మెవఁడో యున్నాఁడు. పాప మిం దుండుట కెంతయుఁ దగఁ డని చూపఱుల కాచూపరియే చెప్పక చెప్పెను. ధనాపహారుఁడు గాఁ డని యాతనిలక్షణములె వెల్లడించు చున్నవి. ప్రాణాపహారుఁడును గాఁ డని యాతనిమృదులావయవములె నిర్ణయించు చున్నవి. ఆమోహనసోము నానేత్రచకోరకములు నామారాకారము నావర్చస్సుఁ గనుఁగొనిన నెట్టివారికిని నతఁడు రాజకుమారుఁడు తప్పక రాజకుమారుఁ డని తోఁపక పోదు. అతఁడు విస్మయకలితుఁ డయియే యున్నాఁడు. కాని విచారాంధకారమగ్నుఁడై యుండ లేదు. వారికిని నపరాధులకును హస్తిమశకాంతర ముండును. అరుఁగుపైఁ గూరుచుండి పరిపరివిధముల నాలోచించు చున్నాఁడు.

"ఆహా! స్త్రీలు చంచలచిత్తలు గదా! తాము పట్టిన కుందేటికి మూఁడేకాళ్లనుమూర్ఖతయు వారియం దెక్కుడుగ నుండును. శాస్త్రములు చదివిన నేమి శౌర్యధుర్యుఁ డెట్టపట్టిన నేమి కలుముల నోలలాడు చున్న నేమి సద్గంధ మలవడ నప్పుడు! తద్గ్రంథపఠనము సద్వినియోగమునఁ గదా రాణించు. స్మశానపురాణప్రసూతివైరాగ్యములకరణి నేతత్కాలమున నుండి యుత్తరకాలమున నంతరించిన నాయాచదువు లేల శాస్త్రములేల! చదువు సంధ్య లేకున్నను బుద్ధియే ప్రధాన మెల్లెడలను. బుద్ధి లేనివారు కంటి కింపగు పెద్దపులులతో సమానులు. ఔరా! యౌవన మెంతెంతటి యకార్యముల నయిన

కొనరంపించును గదా! వానివరుసల గణింప నీదు. హెచ్చు తగ్గుల నెన్న నీదు. మంచిచెడ్డలఁ గాంచ నీదు. పాపపుణ్యములఁ బరికింప నీదు. అంధకారబంధురమున వల్లలాడించును: గావున నే పిల్లలఁ జేసినకూ్రరసర్పములును మదించినయావనులును నొక పోలిక. స్త్రీలకు దుర్బుద్ధి పుట్టకయే యుండవలెఁ గాని పుట్టిన దాని మట్టుపెట్టుట శాతమ్మపుట్టువునకుఁ దరము గాదు. కొందఱు వారు చెడిపోవుటకుఁ గారణము విద్య యని యభిప్రాయపడుచున్నారు. కాని సద్విద్య యెన్నటికిని గారణము కానేరదు. విద్య నా నేవో నాలుగక్షరములు నేర్చి నీతులు లేక బూతులతో నిండినపాత్రములు చదువుట కాదు. అమిడి మిడితెలివి యన్నిటను జెఱుపే. ఇహపరముల నెఱుఁగఁ జేసి యుచితానుచితములఁ దెలియఁ జేసి ధర్మాధర్మములఁ దవులఁ జేసి తిన్ననితెన్నున నడిపించుచు జ్ఞానేంద్రియమును వికసింపఁ జేయునదియే విద్య. ఆచారము, ప్రవర్తన, యోగ్యత వీని వెల్లడించునదియే విద్య. తనయునికి, యిరుగు పొరుగు, సహవాసము, సాధారణముగ గుణములఁ దెలుచునే కాని యవి స్వాంతమున జనించినదుర్గుణమునకు సాటి గావు. పుట్టుకతోడఁ బుట్టినది పుల్లలతోడనే యన్నట్లు జననదుర్గుణ మనివార్యము.

అకటకటా! రక్తసంబంధ మనివార్య మనియో ధనాశా పాశంబులఁ దగులఁబడియో చేఁకిందువారుగ నుండుటను భయంపడియో యొనరుచునసమానవివాహము లీరీతిగఁ బరిణమించుఁ

తనమనమునకు వచ్చి వలపులకు సొచ్చిననరుని పరిగ్రహింపఁ దరుణు లరయు చుందురు. కావున వారిదోషము లేశము లేదు. ఈడు జోడు లేనిహీనపాణిపీడనము లొనరించు పెద్దలనే యూయుసురు పట్టి పల్లార్చు. తమయకార్యము తా మెఱుఁగక పాప మాయబలల రండలు ముండ లని రట్టుపెట్టుటకన్న నీచము దూష్యము దుష్కృతము కలదా! కట్టా! యిట్టివివాహములకతమున నె సదాచారసంపన్నలకు నేకపత్నీవ్రతస్థులకుఁ జరిత్రలకు నాటప ట్టయినయీహిందుమాత యిపుడు జారచోరులతో నిండు చున్నది. వలికలే మట్టుపెట్టుటకుమాఱుగా నిట్టికట్టిఁడికార్యము లాచరించు చుండఁ బ్రజ లుడుగు టెట్లు!

ఆహా! కామమునకుఁ గన్ను లేదని యిదియ కాఁబోలు! అరిషడ్వర్గముల నణఁపఁ జాలనివా రెంతటివా రైన నింతియ కదా! అందునం బ్రథమశత్రువు కామ మధిరోహించిన నిఁక జాసరియుక్కసంగతిఁ జెప్ప నేల! ధనధాన్యములు తఱిఁగి పోవును. ఆరోగ్య మంతరించిపోవును. సర్వసుగుణములును నమసిపోవును. కీర్తి మాసిపోవును. పరము వాసిపోవును. స్వతంత్రమును దొలఁగఁ జేసి కామునకుఁ గానివానికి దాసునిఁ జేయు నీకామమహాత్మ్యము వర్ణింప నేరికగు! ఎన్నెన్ని యొన్నిక కెక్కిన వంశములు ధ్వంసము కా లేదు! ఎందఱెందఱు రాజపురందరులు కుందునం దవిలి మ్రింద లేదు! లక్షాధీశులు భిక్షాధీశులు గా లేదు!

ఔరా! పూర్వభవపరిపాకమునఁ జేసి యన్నియు సాగుచుండును. నుదుటివ్రాఁత యెట్టివాని నైనఁ బట్టి యీడ్చును. లేనిచో నా కాపాపురాలాటపై బుద్ధి పుట్ట నేల: పుట్టిన నా ప్రాణమిత్రుఁడు బోధించిన వినక పోవ నేల; కలరవమును విడువ నేల; యది క్రమము తప్పి యామెగీముఁను జేర నేల; తిరుగ నేను పితృనిహితములు తిరస్కరించి యచటికిఁ బో నేల; యామె కీదుర్బుద్ధి పుట్ట నేల; నా కింత రా నేల; పూర్వజన్మమున నెవరికిఁ బెట్టితినో యిప్పు డనుభవింపు చున్నాను. ఆహా! నిన్నఁ గాక మొన్న హంసతూలికాతల్పమున నత్తమిల్లినవాఁడను నేఁడు రిత్తనేల నత్తమిల్లు చున్నాను. కాలమహాత్మ్యము! ఎవ్వనికిని దప్పదు గదా. ఆగర్భశ్రీమంతుని గర్భమున జనించినను నాగర్భదరిద్రుని గర్భమున జన్మించినను వంతు వచ్చినప్పుడు కర్మ ననుభవింపక తప్పదు.

కట్టా! కానక కానక కన్న కడుపు. ఒక్క కన్ను కన్ను కాదు: ఒక్క కొడుకు కొడుకును గాఁ డనిరి. తలఁపుల నెల్లయు నామీఁదనే నిలిపి యొక్కగడియ వేళ కాలన్యమైన దురంత వంతాపమునఁ జిక్కు నాతల్లి నా సుకుమారజనని పిడుగుఁ బోలిన యీనాయవస్థ నాలించి పంచప్రాణములు బిగఁబట్టి యుండెనా! ఆహా! నాయవివేకము నాయపకారము నన్నొక్కనినే కాక నన్ను గన్న కారణమునను నాతో నున్న కారణమునను బ్రియ జననిఁ బ్రియమిత్రుఁ గూడ నగ్నిహోత్రముభంగి నావరించి

దహింపు చున్నది. ఇందువనే యిక్కయువివేకి యుండిన నుత్తమవంశమున కెల్లఁ జేటనిరి.

అయ్యో! నాయీసంకటమునకు నే నావంతయు వంత నొందను గాని మదీయ మాతాసుహృద్వరులదుస్థితికిఁ జింతింపు చున్నాను. వారు వివేకులు ధైర్యధుర్యులు కదా! వా రంతగఁ జింతింతురా! విచారింప కేమి; తేలు కుట్టినప్పు డెట్టివాఁడైన విచారించున ట్లనుకొననియాపద తటస్థించి నప్పు డావివేక మంత రించు: ధైర్యము తూలు. ఊరడించువా రెంద ఱున్న నా విచారపారావారము నడ్డు కట్ట లేరు. హా! సారంగధరా! నీ కతమున నీసుక్షత్రియవంశాబ్ధి యెంతగా ఘూర్ణిల్లు చున్నది!

ఛీ! ఛీ! నేను మాయామోహమున వెండియుఁ బ్రవే శింపు చున్నాను. ధైర్యకవచమును దొలఁగింపు చున్నాను. ధైర్య మనుకవచమును ధరించి, సత్య మనుడాలు దాల్చి, క్షమ యనువాలు కేలఁ బూనితిమా యేశత్రువు నైన నింతలో నీటు సేయఁ గలము. కైలాసము గాని కైవల్యము గాని కరతలా మలకమై యుండు. మిథ్య! మిథ్య! యీజననీజనకు లీసుహృద మాత్యబంధువు లీయశేషవిశేషవైభవము లీభూరిసామ్రా జ్యము లీసురుచిరరూపలావణ్యాతిశయములు మిథ్య. పుట్టి గిట్టుటకే కాని కర్మ నిర్మూలించి యాసర్వేశ్వరునితో నైక్య మొనరించుట కివి యేవియు సహాయభూతములు కావు. తన్నువు దక్క మరణ మయినవెనుక నీచరాచరము లేవియు

వెనుతవులవు. పుట్టినవా రెల్ల రెప్పట్టున నైన గిట్ట కుండరు. మానాళ్ళముచ్చట లివి యన్నియు. అంతమాత్రమునకె యీమాయాప్రపంచమును నమ్మి యరిషడ్వర్గములకు దాసు లగుచు మమకారమునఁ దగిలి యధర్మ మాచరింపు చున్నారు. హా! శంభో! మాంపాహి! మాధవ! నాధైర్య మెడలింప కుము! నిన్నే సర్వకాలసర్వావస్థల నమ్మి యున్నాను. నీ వొక్కఁడవు దక్క నా కీవిశ్వమానమున నేరును గానఁ బడ కున్నారు.” అను చుండెను.

సుఖదుఃఖములు సమానములుగఁ బంచుకొను చుండు వారే సఖులు. సంతోషసంతాపములు సమానములుగఁ బంచుకొనుట వారు తమనెచ్చెలుల నెన్నఁడును మాయావాగురలఁ బడ నీక కాపాడు చుందురు. కావున నిక్కపునెచ్చెలులఁ గలవా రెందుదొడుకునఁ బడక యిహపరసౌఖ్యము లనుభవించు చున్నారు. అట్టివాఁ డొకని వీడి మఱియొకఁ డుండఁ గలఁడా! లేడు. వారి యాకారములె రెండు కాని యంతరాత్మ యొక్కటియే! వారివే యనుమాట యేమి సర్వేశ్వరభేదము లైనయీయంతరాత్మ లన్నియు నొక్కటి కాదా! నడుమ నవాంతరముగ వచ్చినకామక్రోధలోభమోహమదమాత్సర్య ముల దుస్సాంగత్యమునఁ బలుతెఱంగుల వేర్వే రగు చున్నారే కాని లేనిచో నందఱు నాయానందమయునితో నైక్యము కా వలసినదే!

ఇప్పుడు సారంగధరుఁడు కారాగారమునఁ ద్రోయఁబడినట్లు మనము వినియే యున్నాము. వానికిఁ బ్రియమిత్రుఁడు సుబుద్ధి యొకఁ డున్న ట్లింతకుమున్నే విని యున్నాము. ఒక్క కంచమున భుజించి యొక్క మంచమున నిద్రించువారు వారిరువు రని యెఱిఁగియే యున్నాము. అట్టివా రనివార్యముగ దృగ్గోచరము లగుతనువుల నుండి నేఁడు విడఁదీయఁబడి యున్నారు. దృగ్గోచరము లగునస్థిరశరీరముల నుండి వారు వేరు కావింపఁబడినను మనోదృగ్గోచరము లగుస్థిరాంతరాత్మల నుండి దూరము కావింపఁ బడిరా! లేదు లేదు. అట్లొనర్పుట కేతన్మనుష్యమాత్రులు చాలుదురే! మర్త్యులే కా దమర్త్యులును జాలరు.

వీరివారియొక్క యంగీకారముల నెట్టెట్టో పడసి మగుడ వసివాడినమోముతోఁ జెదరి వ్రేలాడుచున్న కురులతో నలిగి యున్న వలువలతోఁ జిడిముడిపడునడకతో నొకసుఝూపి యతి శీఘ్రమునఁ గారాగారద్వారము సమీపించి "హా! మిత్రమా!" యని యుమ్మవశమ్ముల నాని శోషిల్లెను. తోడ్తోన సారంగధరుఁ డులికిపడి వచ్చి "అయ్యో! యిదేమి! పరమమిత్రమా! పామరత్వమునఁ బడు చున్నావు! నీజ్ఞానేంద్రియమును వికసింపఁ జేయుము. ప్రవాహములోనిగడ్డిపరకలవలె గాలిలోని జలదశకలములవలె సుఖదుఃఖములు కలియుచుఁ దొలఁగుచు నుండును. ఈశరీరములే జలబుద్బుదము లన నీకే నీకష్టసుఖ

ము౹౹గా కళవళపడు చున్నావు. సుబుద్ధీ! నీవు చెప్పఁ దగినవాఁడవు కాని చెప్పించుకోఁ దగినవాఁడవు కావు. నన్ను బిగ్గఁబట్టి తెప్పిఱిల్లఁ జేయుట కీదృగ్గోచరము లగునినుపకమ్ము లెట్లు నా కడ్డము వచ్చినవో యట్లే నీజ్ఞానేంద్రియమును వికసింపఁ జేయుట కీమాయామోహము నీ కడ్డు వచ్చు చున్నది. ఈ యడ్డంకి లేకున్న నాహ్లాద మలవడున ట్లీ యాయడ్డంకియు లేకున్న నాహ్లాద మలవడును: నమ్ముము నామాట" యని యూరడింపు చుండెను. సుబుద్ధియు కొంత సేపటికిఁ దెలివి వచ్చి కన్నులు విచ్చి "హా! సారంగధరా! అకళంకసారంగధరా! నేఁటికి నీ కీయపవాదదోష మబ్బెనా! అన్యాయ మన్యాయము! కామమదాంధుఁడై యున్న యాభూమిపతి కిది యేమిచేటు." "నద్దు నద్దు. రాత్రి నీకంతగాఁ జెప్పితినే! సుబుద్ధీ! పూజ్యుఁ డగుజనకు నించుకయుఁ దూలనాడకుము. మనము మనకర్మనే నిందింప వలెఁ గాని యొరుల నెంతమాత్రము నిందింప రాదు. ఏలయనా మనుష్యులు చేయఁ గలిగిన దొకటియు లేదు. విశ్వసింపుము. ఈవిశ్వమంతయు సర్వేశ్వరమయము. ఏది చేసిన నతఁడె చేయ వలయుఁ గాని యొరులు చేయఁ జాలరు. నే నపమూరునకు లోనయితి ననియు వగలఁబొగలకుము. పూర్వభవమున నే నేరికో యొనరింప కున్న నీనిందమాత్రము నన్నుఁ బొందఁ గలుగునా! ఇదివఱకు రాఁగలిగెనా! ఇప్పటికి నాకర్మ పాకమునకు వచ్చినది." యని

"అయ్యో! పాపము సత్యాసత్యములు తెలియక సహజ
మగునప్ర[illegible]మునకు లో నయి యీజనులు నాకతమునఁ గించి
దఘమునకు లో నగు చున్నారు. హా! సారంగధరా! నీమూ
లమున నెందఱెందఱు చేడ్పడు చున్నారు." అనియెను. హా!
నెచ్చెలీ! కుజనులు తక్క ఘనతరులు కవివతంసులు ద్విజ
శ్రేష్ఠులు మంత్రిసత్తములుఁ బెల్లుగఁ దల్లడిల్లు చున్నారు.
ఎవరికిఁ దెల్లవాఱినదో కాని మిత్రమా! యీరాజరాజనరేం
ద్రపురవాసులకు మాత్రము తెల్లవాఱ లేదు. అంతయు నంధ
కారబంధురమై యున్నది. దుఃఖతమోనిమగ్నమై యున్న యీ
కువలయము సారంగధరా! ముఖవిజితసారంగధరా! నీప్రత్య
క్షమునఁ గాని ప్రకాశింపదు ప్రకాశింపదు. దుఃఖతమమునఁ
గళలఁ బెడఁబాసి యున్న వారియొక్క చక్షుశ్చకోరకములు నీ
రాకఁ గాని విలసిలవు. అన్న మన్నమాటయే లేదు. నిదు
రయుఁ గుదురు వొదవదు. అశ్రుజలధారలు కట్టవు. అయ్యో!
మహ్యాద్వరా! నీ వాచిరాత్రిఁగిక్కిఁ దక్క మిగిలినజనులకెల్లర
కును బుత్రుఁడవే కదా! కన్నకుమారుఁడు కానఁ బడ కున్నను
నింతగా వంత నొందరు కాని కువలయామోదకరుఁడవును సర్వ
గుణగణుఁడవును సారంగధరావతారమవును నగునిన్ను గనక
నీపాటు విని హా! యేమి తెల్పుదు ప్రళయము సంభవించినట్లు
వలవింపు చున్నారు. నెచ్చెలీ! ముదమూర నిన్ను కౌఁగిలింపుద
మన్నఁ గల వయ్యెనా! కట్టా! నాచక్షుద్వంద్వ మిఁక నమయ

కున్న దేమి! దుఃఖతమాభ్రింకపోత్తుంగభంగభ[illegible]ముల నల్ల
లాడు నేను—ఒక్క చిన్న మోటునావను—ఇంకను నేలోకో
రూపుమాయ కున్నాను. నీకర్మ పరిపక్వమునకు వచ్చినట్లు
నాకర్మయుఁ బక్వమునకు రాఁ గూడదా! నే నంతఘోర
పాపుఁడనా! నీయాపద చూడకయు నీకొఱ కెదురు చూడ నా
పరమేశ్వరుఁడు నా కనుగ్రహింపఁడా! హా! హా! మిత్రమా!
నీ విన్ని గా దీఁక నిన్ని చెప్పము: నాబుద్ధి యిఁక నిలువదు.”
అని పెల్లుగఁ దల్లడిల్లి తిరుగ స్మృతి తప్పెను. సారంగధరుఁ
డును జేయునది యేమియును లేక యించుక ధైర్యము దూలి
నివ్వెఱపడి యుండెను. సుమంతునితనయునకుఁ దిరుగ స్మృతి
వచ్చెను. కాని యేమిప్రయోజనము! మతి చలించెను. వెడ
నగవు నగుచు వింతగఁ బరుగులెత్తెను. “చిత్రాంగి” “చిత్ర
లేఖ” యని సంచరించు చుండె. ఆమిత్రునిబుద్ధివైకల్యము
గని సారంగధరుఁడు పిడు గడిచినభంగిఁ బుడమిఁ బడెను.

రెండుమూఁడుజాములప్రొద్దెక్కినది. సుమంతుఁడు
కన్నులఁ గారునీరముల నుత్తరీయమున నొత్తుచు నడుగులు
తడఁబడఁ గత్తులు దూసి యున్నకొందఱుభటులతోఁ గుఱంగట
నున్నయాచెఱసాల సమీపించెను. పుడమిఁ బడి ధూళి బ్రుంగి
యున్నయాపుడమిఱేడయునిబుడుతను గనఁగనె నయనాభ్యం
తరములఁ బగుల్చుకొని నిరభ్యంతరముగ వెలువడుప్రవా
హము నడ్డపెట్ట నేరఁ డయ్యెను. కట్టా! యాయునికి మొట్టి

గట్టివాని [illegible] గరఁగించు నన్ను నిఁక జాలిగుండెఁ గలవారి సంగతి వ్రాయ నేల! కఱకుకరవాలములఁ గైలఁ బట్టి యున్న యాభటులును మిడుకఁ దొడఁగిరి. ఎవ రేమి సేయఁ గలరు. రాజాజ్ఞ చెల్లియే తీరవలె.

ఎట్టకేలకు సుమంతుఁ డాయినుపతలుపు తాళము తీసెను. "రాజకుమారా! సారంగధరా!" యని గద్గదిక నెట్టట్టో యుచ్చరించి తనువుఁ ద్రట్టెను. సారంగధరుఁడు తెలివి తెచ్చుకొని కన్నులు విప్పి సుమంతుని గనుఁగొని "హా! సచివోత్తమా! యీపాపిసారంగధరుఁడు నీశోకాత్మజనక—మబుద్ధికి—బిచ్చి కలిగించెను." అని మొగము దిగవైచి యిట్లనెను. "తండ్రీ! సారంగధరా! ఆత్మజాతికయుండ వగునీ కిట్టియాపద దాపురించ నాయాత్మజున కట్టిపాటు కలుగుట యొకయాపదయా లెక్కయా! నీముప్పు విని జీవచ్ఛవమై యున్నయీసుమంతుఁ డిఁక సుబుద్ధి గిబుద్ధికై వగవఁడు. లెమ్ము రాజగారియాజ్ఞ యైనది రమ్ము. రెండవపెండ్లామువలఁ జిక్కి యున్నయీరా జింకను విచారణ యని యొకటి కల్పించి" నని రక్షకభటులు నలుప్రక్కల నడువ సారంగధరునిసభాస్థానమునకుఁ బూర్వమువలెనే కన్నీరు దొఱఁగుచు నడిపించుకొని చనియెను.



## పదునాఱవ ప్రకరణము.

### విచారణ.

రాజసభాస్థానము ప్రజలతోఁ గిక్కిఱిసి యుండెను. సభాస్థానమునకు నడుమ నాలుగుమార్గములును బ్రజలమయ ములై యుండెను అందు దక్షిణమార్గ మింత తెఱపి లేదు సరి కదా జనులతోనే నిర్మింపఁ బడినదో నా నుండె. రాజమందిర మును జుట్టినపచ్చికబయలును బ్రజల నీనిన ట్లుండెను. ఒక మొకమునను గళ లేదు సరి కదా కన్నుల నశ్రువులు క్రమ్మి యుండెను. ఏమి యెందుమో వీనులకు విందో మందో యని యత్యంతశాంతులై యుండిరి. స్త్రీలు—ఒక్క మందిరమునం దొక్కతె యిరువురుం దక్క తక్కుం గలమందిరమునం గల—స్త్రీలందఱుం గన్నీరు మున్నీరు గాఁ గార్చుచుండిరి. వారి యొక్క యాక్రందననినాదముల మందిరోపరిభాగములును మాఱు మ్రోఁగుచుండెను. ఆకోకిలాలాపముల నాలించువారికిని జాలి కలుగక మానదు.

రాజరాజనరేంద్రుఁ డట్టయెదుట సింహాసనస్థుఁ డై యుండెను. నన్నయభట్టారకాదికవివరేణ్యులును సుమంత్రాది మంత్రిశిఖామణులును నిరుదెసల వెలుఁగుచుండిరి.

సరిగంచుపంచె సవరించుకొంచు జానువు లంటు చున్న

తెల్లటంగీని గలజేబుల నప్పు డప్పుడు చేతులు నిడుచు నొఱగు పాగ సరిఁ జేసికొనుచు లోచనముల నుండి జాఱుచారునులో చనముల నెగఁ ద్రోసికొనుచుఁ బ్రత్యేక మొక్కప్రక్క నున్న యున్నతప్రదేశమున నిలిచినద్వారపాలకునొకని బ్రమాణా నంతర మీక్రిందివిధమునఁ బ్రశ్నించు చుండె నొకఁడు అతఁ డొకన్యాయవాది యన నేల!

న్యాయ:—ఓయీ! నీపే రేమి?

ద్వార:—అయ్యా! నాపేరు వీరపాలుఁడు.

న్యాయ:—నీయుద్యోగ మేమి?

ద్వార:—చిత్రాంగిరాజ్ఞిగారిమందిరద్వారమును గాచుట

న్యాయ:—అయిన లోపల కేగువారు ముందుగ నీయను మతి నంద వలయును. అంతయేనా?

ద్వార:—అయ్యా! దేవిగారిదాసదాసికలు దక్క వేఱువా రెవ్వరైన సరే మహారాజుగారియాజ్ఞాపత్రము లేనిదే లోని కేగ రాదు.

న్యాయ:—ఆమెడ నున్న యాతని నీ వెఱుఁగుదువా?

ద్వార:—ఎఱుఁగుదును యువరాజుగారినే యెఱుఁగనా?

న్యాయ:—అతఁ డెన్నఁడైన నీకక్ష్యంతరము దాఁటినాఁడా?

ద్వార:—దాఁటినాడు.

న్యాయ:—ఎప్పుడు? ఏవేళ?

ద్వార:—మొన్నను సాయంసమయమున.

న్యాయ:—నీయంగీకారముం గొనిమేనా?

ద్వార:—లేదు

న్యాయ:—ఇదివఱ కెన్నఁ డైన నతఁ డామందిరమునకు వచ్చెనా?

ద్వార:—లేదు

న్యాయ:—అతఁడు మందిరము నెందుకుఁ జొచ్చెనో యెఱుఁగుదువా?

ద్వార:—ఎఱుఁగను

న్యాయ:—అతఁడు తిరుగ నెప్పుడు వచ్చినాఁడు?

ద్వార:—కనుచీకటి పడిన వెనుక.

న్యాయ:—వాని నీవు బాగుగాఁ బరీక్షించినావా?

ద్వార:—పరీక్ష సేయుట కే నెంతవాఁడను.

న్యాయ:—అది కా దోయీ! నీవు వాని లోన కేగునపు డె ట్లున్నాఁడో చూచితివా?

ద్వార:—చూడ కేమి?

న్యాయ:—లోన కేగినపు డె ట్లున్నాఁడో చెప్పఁ గలవా?

ద్వార:—అయ్యా! యుచితరీతి నలంకృతుఁ డై యుత్తరీయమును వలెవాటువేసికొని యున్నారు.

న్యాయ:—తిరిగి వచ్చునప్పు డె ట్లుండెనో చెప్పఁ గలవా?

ద్వార:—అయ్యా! కురులు వీడి పై వలువ లేక చిడిముడి పడుచుఁ బరుగుపరుగున వెలువడినారు.

న్యాయ:—సరే నీసాక్ష్యము చాలు.

అంత రాజరాజనరేంద్రుఁడు మఱియొకన్యాయవాదిపై దృష్టి సారించి "మీ రేమైన నడుగ నున్నారా?" యని యెను. వారు వాతఁడు లేచి యి ట్లడిగెను.

న్యాయ:—ద్వారపాలా! రాజుగారియాజ్ఞాపత్రము లేనిదే లోనికిఁ బో నీకుండుట నీపని యయినపుడు నీవు సారంగధరు నేల విడిచితివి?

ద్వార:—అయ్యా! యువరాజుగారు కాన వారి నడ్డుపెట్టిన నేమి వచ్చునో యని తందర నొందితి.

న్యాయ:—ద్వారపాలా! ఎవ్వ రైన నేమి కారణ మొఱుఁగక మందిరముఁ జొర నిచ్చుట నీకుఁ గానిపని కాదా?

ద్వార:—కానిపనియే కాని యయ్యా! వారిసామ్ము తిను నేను వారిఁ బ్రశ్నించుటకుఁ జాలినవాఁడను గాను. మఱియు నాయన మహానుభావులు! సద్గుణాలంకారులు!

న్యాయ:—ద్వారపాలా! యతఁడు దొడ్డవాఁ డని నీకు దృఢనమ్మకమేనా?

ద్వార:—అయ్యా! దృఢముగఁ జెప్పఁ గలను: నేనే కాదు లోకమంతయు నొక్క వక్కాణించును.

ఆసమయమున సభాస్థాన మెల్ల జయజయధ్వనులఁ జెల రేగెను. అనంతరము ద్వితీయసాక్షి మనోరమను బ్రమాణముఁ బలికించిరి. న్యాయవాది యడుగఁ బ్రారంభించెను.

న్యాయ:—మనోరమా! నీ వెవరవు? నీపని యేమి?

మనో:—నేను చిత్రాంగిదేవిగారి చెలికత్తెను. ఆమె వేడుకం బడఁ జేయుటయే నాయవశ్యకృత్యము.

న్యాయ:—నీవు దేవిగారియొద్దనే యెల్లపుడు నుందువా?

మనో:—సర్వకాలసర్వావస్థలయందుఁ జెంత నుండకున్నను దఱుచు దగ్గఱనే యుందును.

న్యాయ:—ఆసారంగధరు నెన్నఁ డైన నారసితివా?

మనో:—చూచితిని యెన్న.

న్యాయ:—ఏ వేళ? యెందున?

మనో:—సాయంకాలమున మా చెలికత్తె యంతిపురమున

న్యాయ:—అతఁడు నీ కెక్కడఁగనుపడియెను?

మనో:—నా కతఁడు నా చెలి పరుండుమందిరముముందునఁ బ్రత్యక్షమయ్యె.

న్యాయ:—వాని నీవు పలుకరించితివా?

మనో:—అయ్యా! నేను పలుకరింపకపూర్వమే "నా చిత్రాంగి యెం దున్న దంగతి నీకుం దెలియునా?" యని యతఁడు నన్నడిగెను.

న్యాయ:—ఏమి! (అని చిఱునగవున) తనచిత్రాంగిఁ గూర్చి ప్రశ్నించెనా! సరే నీ వేమిప్రత్యుత్తర మొసంగితివి?

మనో:—నాకుఁ దెలియదంటి. నీకుఁ దెలియకున్న వేగము పోయి చిత్రాంగిదేవితో నీకుమారుఁడు వచ్చె నను మనెను.

న్యాయ:—బాగు బాగు నీకు మారుఁడు వచ్చెఁ దెలుపు మనియెనుగా! నీ వేమి చేసితివి?

మనో:—నేను పోయి సంగతి నానంగారికిఁ దెలుపుద మను కొని యరుగు చుంటి. నా వెంటనే యాతఁడును వచ్చె.

న్యాయ:—అంతయే కాని నీప్రత్యుత్తరము నందుకొన నందు నిలువ లేదు.

మనో:—లేదు నా వెనుతవిలి వచ్చి గదిఁ జొచ్చెను.

న్యాయ:—అప్పుడు దేవిగా రేమి చేయు చుండిరి?

మనో:—పతిరాక కై నిరీక్షింపుచు నొకసామాన్యశయ్య నొఱగి యుండెను. నేను వెంటనే వంట సేయుటకుఁ బోయితిని. కావున నా కప్పటి కంతయు తెలియును.

న్యాయ:—తిరిగి నీ వెప్పుడు వచ్చితివి?

మనో:—దీపములు వెలిఁగించు వేళకు.

న్యాయ:—వచ్చి నీ వేమి కనుఁగొంటివి?

మనో:—తత్తరమున నుత్తరీయము లేక పరుగిడుసారంగ ధరు నరసితిని. ఏమో యనుకొని పడకటిల్లు సమీపించితిని. తలుపులు వేసి యుండె. నాచెలిని బిలిచితిని. ఆమె యేమియో మెల్లనిగొంతున "మనోరమా! నా కిదివఱకె యాహారాదులపై రాగము తప్పినది; యిప్పు డంతకన్నఁ దప్పినది. అన్నాదులే నొల్ల: నేను వచ్చునందాఁక నీవు గాని మఱి యేరు గాని నన్ను డాయకుఁ" డనియె. నే నంతఁ జింతింపుచునె చనితిని.

న్యాయ:—ఇంత యేనా? నీ కింక నే మైనఁ దెలియునా?

మనో:—అధిక మేమియు నే నేర

"మీా రేమైన నీమనోరమ నడుగ నుంటిరా?" యని రాజరాజనరేంద్రుఁడు సారంగధరునిపక్షము వహించినన్యాయవాదిఁ బ్రశ్నించె. "చిత్తము. కొంచెము ప్రశ్నించెద నని యిట్లుగ నడుగఁ దొడఁగెను.

న్యాయ:—మనోరమా! నీకును జితాంగిదేవిగారికి నెప్పటి నుండి చెలిమి?

మనో:—చిన్ననాఁట నుండియు.

న్యాయ:—నీ వెక్కడకు రాఁ గత మేమి?

మనో:—మిక్కిలిమక్కువతో నసఁగి పెనఁగి యున్ననన్ను హారణముగ మాధవళచంద్రుఁడుగా రనుపుటచేత

న్యాయ:—నీవు యువరాజుగారిని బ్రథమమున మొన్న నేనా చూచినది యిదివఱకుఁ జూచి యుంటివా?

మనో:—నే నాయన నిదివఱ కొకటిరెండుసారు లారసి యుంటి.

న్యాయ:—ఏవిషయమున నెక్కడ?

మనో:—ఏమో నేను చెప్పఁ జాలను.

న్యాయ:—అంతగ జ్ఞప్తి లే కున్నఁ గొంచె మించుమించుగ నైనఁ జెప్పఁ గలవా?

మనో:—చాలను.

న్యాయ:—సరే సారంగధరుఁడు ద్వారము దాఁటి మందిరము నెట్లు ప్రవేశింపఁ గలిగెనో యెఱుఁగుదువా?

మనో:—ఎఱుఁగను.

న్యాయ:—యువరాజిదివఱ కెన్నఁ డైన నాయంతిపురము నకు వచ్చెనా?

మనో:—లేదు

న్యాయ:—ఎన్నఁడును రానివాఁ డేకారణముననో వచ్చి సెజ్జగీమునకు నిన్ను వెన్నాడు చుండ నతని నీ వెందుకు నిరోధింప వైతివి?

మనో:—తల్లి కదా యనుచనువున వచ్చు చుండె. తల్లి పిల్లల కెం దైన భేద ముస్నదా యని మిన్న కుంటి.

న్యాయ:—చూడుము నీ వింతకుమున్ను "చిత్రాంగి యుం దున్నది. నీకు మారుఁడు వచ్చె నను" మన్నట్లు నుడివితివే నిజమేనా?

మనో:—నిజము గాక నేను కల్పించితి ననుకొంటిరా?

న్యాయ:—లేదు! అట్లె యతఁడు ప్రశ్నించినచో నీ కప్పుడ యతఁడు తప్పుదారి త్రొక్క నున్నట్లు పొడకట్ట వలయున్నే!

మనో:—సంశయించితి

న్యాయ:—సంశయించియు నీ వెందు కతని నిలువ లేదు?

మనో:—ఏమో నాకు ధైర్యము చాలినది కాదు.

న్యాయ:—నీవే చిత్రాంగిదేవిగారివంటక త్తెవా?

మనో:—వంటకత్తెను గాను చెలికత్తెను. అప్పు డప్పుడు సమయముపట్ల నదియుఁ జూచు చుండును.

న్యాయ:—తిరిగి చనుతఱిఁ దత్తరమున నుత్తరీయము లేక పరుగిడితివి నంటివే కారణ మేమో నీవు చెప్పఁ గలవా?

మనో:—చెప్పఁ జాలను.

న్యాయ:—కావున సారంగధరుఁడే చిత్రాంగిదేవిగారిని బలవంతపఱచినట్లు నీవు చెప్పఁ జాలవు

మనో:—ధర్మమార్గమును బట్టి యూహించుటయు కాని నిర్ధారణగఁ జెప్పఁ జాలను.

న్యాయ:—ధర్మమార్గ మన నేమి?

మనో:—కాము మెంత యున్నను గామిని మగవాని బలిమిఁ బట్ట నెంచుట విని కని యెఱుఁగము. పురుషుఁడు వలపు లేని స్త్రీని జెఱుప నెంచుట చాలఁగా విని యున్నాము. లౌక్యము.

తరువాత మూఁడవసాక్షి యగుసుబుద్ధిఁ బిలువు మనిరి. సుబుద్ధి నప్పు డిరువురుభటులు బలిమిని లోనికిఁ దెచ్చిరి. న్యాయస్థానమునఁ దగుచో నిలిపిరి. న్యాయవాదు లెన్ని ప్రశ్నించిన నతనిప్రత్యుత్తరము వెడవెడనగవునఁ "జిత్రాంగి" "చిత్రలేఖ" యనుట కాక యింకేమియు లేదు. కావున నాయున్మాదునితోఁ గార్యము లే దని వాని వీడ నెంచిరి. కాని యాతనిచేత నున్న యేదో కాగితముముక్క యొక్కటిమాత్రము నూడఁ బెఱికికొని రాజుగారి కిచ్చిరి. అది సగము చినిఁగినచిత్ర

లేఖ. మీఁదఁ జిత్రలేఖ యనియును గ్రిందఁ జిత్రాంగి యని
యును దక్క పూర్తిగ దానిభావమును గ్రహింప నది వీలుగా
కుండె. రాజుగారును నది యచ్చెరువున జాగ్రత్తపెట్టిరి. తరు
వాత సారంగధరుఁ బ్రశ్నించిరి. అతఁడును బాపురమున కై
చనినమాటయును బంగారునరిగంచువ్రాఁత రంగారుకండువా
యును నిజ మనియును దన దనియును బ్రత్యుత్తర మిచ్చి
ఘాఋమాట నుడువఁ డయ్యె. పాపము! వెనుక నుయ్యి
ముందు గొయ్యి. అటన్న మానభంగము. ఇటన్నఁ బ్రాణ
భంగము. ఏ మయినను మానమే ప్రధానముగ వర్తింపఁ దగు
మాఋశల్లికిఁ దలవంపులు గూర్చుటకన్న ననిత్య మగుతన
తనువునె పరిత్యజించుట మే లని తలఁచెను. తలఁచియు సత్య
భామణుఁ డగుట నోరు మెదల్పఁ డయ్యె.

* చిత్రాంగి దేవిసాక్ష్యమును నవసర మని యనంతరము
యువరాజుగారిన్యాయవాది యనియెను; గాని ప్రత్యక్షముగఁ
గన్నులారఁ గన్నతా ముందుట నాపెరాక యనవసర మని
రాజుగారు తెలిపిరి. సారంగధరునియులజడియు నుపశమిల్లెను.

పిమ్మటఁ గలరవ మనుమిష పన్ని సారంగధరుఁడు
చిత్రాంగి దేవిగారియంతిపురమును జొచ్చె ననియును బారా
వతమే వ్రాలుట నిజ మైన నోరు ననుపక యతఁడే యేల పో
వలయు ననియును బోయినవాఁడు మనోరమను జూచి నా
చిత్రాంగి యిం దున్నది నీకు మారుఁడు వచ్చె ననుద్వంద్వార్థ

పదములు ప్రయోగించుటయును సమాధానము రాకమున్నె
శయనాగారము చొచ్చుటయును దిరుగ నుత్తరీయమును విడిచి
చిడిముడిపడుచు మేడ వీడి పరు గిడుటయును బ్రభువా రడి
గినప్రశ్నల రెండింటికే కాని మాఱుమా టాడ కుండుటయును
విచారింప రాజుగా రూర లేరు కదా యింతకన్న సమయ మల
వడ దని యదను వేచి దురుద్దేశమున యువరాజు మందిరముఁ
జొచ్చినట్లు బుద్ధిమంతులకు స్పష్ట మగు చున్న దనియును నిఁక
దేవరచిత్త మనియును జిత్రాంగదేవిగారిపక్షమును బూనిన
న్యాయవాది వెల్లడించెను.

"నాపారావత మామేడమీఁద వ్రాలును నేను పో
వచ్చును అని ముందే సారంగధరుఁ డూహించె నను టంతయు
విచారణీయము; అసంగతము. అంతిపురమునకుఁ బరపురుషు
ననుచుట తప్పని తల్లి గదా యని యతఁడు పోవుట యకార్యము
కాదు. మనోరమతో నాతఁ డట్టిద్వ్యర్థివాక్యములు నుడువు
టయు నామె వెన్నాడుటయు నమ్మఁ దగనిది. అతని శాంత
గుణము నాతనిమనోనిగ్రహము నెఱుఁగనివా [illegible]
ఏదోసాకున నతఁడు భర్మహర్మ్యమును జొచ్చె ననుటకన్న
నేదోపన్నుగడ నాతనినే మేడఁ జొప్పించి రనుట యొప్పు.
రాజుగా రూర లేనియద నరసి యతఁ డట్టిపనిఁ జేసె ననుట
మృగ్యము. అట్లె యయినయెడల మాపో రేపో వారు రా
నున్నయెడనా యతని కలవడునవకాశము! తొలుత రూపపట

మునుఁ గనుఁగొని దేవిగారు యువరాజుగారిని వరించి రనుట లోకవిదితము. కాని పిదప రాజుగారు చెట్టపట్టుట నాపి యీ రాకుమారునే మనమున నిడుకొని మరూపామై నాతని రప్పించి యొప్పించ లేక బలిమిని పై వలువ లాగఁ దత్తరమున నతఁ డుత్తరీయము నరకుసేయక మానరక్షణార్థమై పరు గిడె ననుట విదితము. లజ్జాభరమున వెలిపుచ్చరానిదోష మగుట సత్యమునే పలుకువాఁ డగుట దేవరవారిప్రశ్నలకు రెండింటికిఁ దక్క మిగిలినవానికి సమాధాన మియ్యనంతమాత్రమున దోషి యనుట చెల్ల దని నామతము. ఇదివఱ కెన్నఁడును నతఁడు దేవిగారిమేడ కరుగ లే దనుట నంతపర్యంతము లేని దుర్బుద్ధి యప్పుడే యతని కలవడె ననుటయు విచారణీయము. పో నిండు దేవిగారి నిదివఱకు రూపపటమునఁ గాక మఱి చూచి యెఱుఁగఁడు. రూపపటము నైన వైరాగ్యకారణమున నొల్లఁ డయ్యె. కావునఁ దాత్కాలికముగ వలపు జనించుటయుఁ గల్ల. అపవాదుపాలు పడినయాయకళంకునికతమునన ప్రాణ మిత్రుఁడు సుబుద్ధి బుద్ధి చెడి యుండె ననుట యొప్పు. ఆలేఖ-అభిప్ర—మేమి యో స్పష్టము గా కున్నను దీని సంబంధించియే యుండు నని నామనోనిశ్చయము. కావునఁ బ్రభువులు ప్రబల విచారించి న్యాయము దయచేసి విచారపారావారనిమగ్నులయినపురజనుల నెల్లర నుద్ధరింప వేఁడుచున్నాను" అని శారంగధరునిన్యాయవాది సమర్థించెను.

అంత న్యాయస్థాన మంతయు జయజయధ్వానముల మాఱు మ్రోఁగెను. భటులెల్ల కోలాహలమును సద్దు పఱచిరి. కొంతవడికి నిశ్శబ్ద మయ్యెను.

"సారంగధరుని బారావతక్రీడకుఁ జేరేచి యాకలరవ మును బట్టుట యొకయంగనకు సాధ్యము కాదు. అచింతనుఁ డగుసారంగధరుఁడు పావురములయాట కంగీకరించె నెట్లు. క్రీడా సక్తి కామమునఁ గలుగు నని వినియెద. "సర్వం క్షణికం క్షణిక" మ్మని యెప్పటి కేబుద్ధి పుట్టునో! అతఁడు భగవంతుఁ జూచియే వైరాగ్య మూనెనే' కాంతఁ జూడ కున్నఁ గామము కలుగ దనుటకు! ఎంతవాఁడైన నింతిచెంత నున్నతఱిఁ గంతు బారిఁ జిక్కుట నిక్కము. ఎంతవల పున్నను బురుషునే బలిమిని గవయునంతసాహసము జంతల కుండ దని నాతాత్పర్యము. మరి నాదేవి ముగ్ధ యని నే నెఱుఁగుదును. ఎవరియొక్క ప్రాణము లెవరికిఁ దీపి కావు! అట్లయ్యుఁ బ్రాణభరమును మాని యొకయన్యాంగనకై—తన కపకృతి యొనర్చినసతికై—మానాభిమానముల నూని సారంగధరుఁ డూర కున్నాఁ డనుట పొసఁగదు. ఎంత విచారించిన నాయంతరంగమునకు సారంగ ధరుఁడే దోషి యనియు నంకుఁపురదో్రహి యనియు నిష్పాడు తోఁచు చున్నది. కాన శాస్త్రప్రకారము కుమారుఁ డని యెన్నక న్యాయదృష్టిపై సారంగధరుకరచరణములు కాన ఖండింపఁ దీర్పు చెప్పుట కంతయుఁ జింతింతును." అనియెను.

సభాస్థానమంతయు హా! హా! కారముల నిచ్చుచున్నట్లుండె. తత్క్షణము దండధరులఁ బోలినదండధరులు సారంగధరుని వెనతెక్కలు విఱిచి త్రాళ్ళఁ గట్టి చేతఁ బట్టి నెట్టుకొని పోవుచుండిరి. యమకింకరులఁ బోలినయాకింకరులచేఁ గొని పోఁబడుచున్న సారంగధరు రక్షింపఁ బూనియు సారంగధరునిదివ్యోపదేశమునని తెలివి వచ్చి రాజశాసనమునకు వెఱచి బిట్టఱచుచు నేలఁ గూలుచు నెత్తులు మొత్తుకొనుచు గుండెలు బాదుకొనుచు సాంతవారంతము నొందినను బొందనిచింత మునిఁగి పోవుచుండిరి రాజరాజనరేంద్రపురవాసులు.

※※※

పదునేడవ ప్రకరణము.

---

జయోత్సాహము.

"ఏమో! మగవారి నమ్మరాదు. వారిమాటలు నీళ్ళలోనిమాటలు! ముఖప్రీతికై కన్యాఱితికై వారు వేయి యాడెదరు. అందును గ్రామపశీకరుల బొత్తిగ నమ్మరాదు. ఈవేళ నన్ను చెట్టఁబట్టినట్లే రేపు మఱియొకర్తెఁ జెట్టఁబట్టుదురు. వారి కెదుర సుందరముగ నున్నదే పెండ్లికూఁతురు. యుక్తాయుక్తము లుండవు. యుక్తాయుక్తము లున్నను నాకివి యన్నియు నేల: ఈశరీరము చీఱుకొన నేల! ఈయేడ్పులు పెడబొబ్బ లేల: యిందఱిని బ్రతిమాలుట యేల: ఇన్నియవస్థ

లేల: ఈవృద్ధరా జిప్పటికి నామాట జవదాఁట కున్నాఁడు; కావున నాకోరిక లీడేరు ననియే నాసమ్మిక.

ఆహా! నిష్కారణ మీరాకుమారు మీరాకారు మట్టుపెట్టు టేమికార్యము. కార్యము కాదా యన్నివిధముల బ్రతిమాలినను నన్ను కా దని త్రోసివేసినవాని నే నెట్లు చూడఁ గలను. సహజముగ స్త్రీల కుండుగుట్టును బట్టబయలు గావించి ప్రార్థించితినే! వాని కింతయుఁ గరుణ లేకపోయెను. నే నేమి యకార్యమొనరించితినా! నేను తన్నే వరించితిఁ గాని యీభూవరు వరించితినా! ఎలప్రాయమున నున్న నే నీవృద్ధ నిఁకోఁ గాఁపురము చేసి తనివితీరుదు ననుకొనెనా! అందఱుం దన్నుఁ బోలి వైరాగ్యమే పూనుదు రనుకొనెనా! సకలసౌభా గ్యముల నలరుచు నున్ననా కిది కొఱఁతగ దోఁచ దనియా తన మతము. రసములఁ దేలు చున్నవారు సరసములఁ దేలక యుందురా! ఇట్టివాఁడు నేను నిన్ను చెట్టఁబట్టుట లేదు; నా జనకుఁడు నిను గికురింపు చున్నాఁడు; నీ వేదేనుపాయ మాలో చింపు మని వివాహము కాకపూర్వమే తెలుప రాదా! తన కామాత్రము తెలియ కుండెనా! పితరునియిచ్ఛ నెరవేర్చిన వాఁడు నాకోరికమాత్ర మేల తీరుపఁడయ్యె. అకార్యము లయిన నీరెండును నకార్యములే కావా! ఒకదాని కొడం బడినవాఁడు రెండవదాని కేల యొడంబడఁడు? తనకుఁ దనది తిన్నఁగఁ నుండెఁ గాఁబోలు!

పో నిమ్ము మఱియొకమాఱైన నాయాశ నెఱవేరు నేమో యనుకొనుటకు నిప్పు డింతఁగా నేకాంతమునఁ జెంత కేగి మీఁదఁ బడి మిడికినను గా దన్నవాఁడు మీఁద నౌ ననునా! కల్ల! భూమిమీఁద నుండి తళుకు లొలయుచు నన్ను వలవంత మగువలపులపా ల్సేయుటకన్నఁ గాల్సేతులు లేక మొండినై యుండిన నాకామమును గడతేఱు నేమో! కరచరణములు నఱుకఁ బడిన నతఁడు మడియఁడా! అతఁడు మడిసిన నా మరు లును మడియును: గావున నతఁ డంత మొందియే తీరవలెను.

మనోరమమీఁదనే భారము వైచి యున్నాను. అది చాలతెలివి కలదియే కాని న్యాయవాదిపరీక్షల నిలుచునో లేదో. వర్ధించువాఁడు మనవాఁ డయి యుండఁ గడబంతి నున్నను నే మని తీర్పు చెప్పువాఁడు మనచేతిలోనివాఁడే కదా! కావున నాభయ మేల! ఈనాఁడి చల్లారిన నేమో కాని యిప్పుడుమాత్రము రాజగారినిశ్చయమును ద్రిప్ప నేరని దరము కాదు" అని యొకనాఁ డపరాహ్ణమునఁ జిత్రాంగి మందిరమునఁ దలపోయు చుండెను.

న్యాయసభాస్థానమున సారంగధరునకుఁ బ్రతికూల ముగ రాజరాజనరేంద్రుఁ డొసఁగినతీర్మానమును విని ప్రఫుల్ల వదనయై మనోరమ శీఘ్రముగఁ జిత్రాంగి డాసెను. సమీ పించినమనోరమను జిత్రాంగి "మనోరమా! ఏ మయినది?" యని ప్రశ్నించె.

"ఏ మగుట కే మున్నది! ఎఱుఁగము! కా వలసిన దేమో యయినది. అనుకొన్నంతయు నయినది."

"చెలీ! ని న్నే మెవ్వరు ప్రశ్న లడిగిరే? నీ వెట్లు ప్రత్యుత్తరము లిడితివి?"

"అడుగువారికిఁ జెప్పువారు లోకువ యని యెన్ని యయిన నడుగుదురు. అందున నిదియంతయు రంకుపురాణమే కదా! అందులకుం దగినసమాధానము లిచ్చువారే యచ్చటి కరుగ వలయు"

"ఛీ! ఛీ! వదరకుము. రాజుగారి దేవి యనియు నెన్నక యట్లు వెల్లడించుటకు గుండె లుండునా?"

"రాజుగారి దేవి కా నిమ్ము తొత్తుకింద బడుతొత్తు కా నిమ్ము రచ్చ కెక్కినతరువాత నందఱు నొకటియే. వారు నిగ్రహించుటకు వారు వీరు జయించుటకు వీరు కోరు చుందురు. కావున నెల్లిన నెదిరిఁ బడఁగొట్టుట కెన్నియో ప్రశ్నింతురు: కాన సాక్షు లాఁకలితి యుండ వలె. మఱి సాక్షులు వలసినలంచము లిచ్చి పాఠములు చెప్పి చెప్పి పంపించెద రెందుకు?"

"చెలీ! యింతకు నీ కే నేమియు లంచము పెట్ట వనియా? నీకుఁ గా వలసిన దేమి! కొఱంత గోరంతయు లేదు కదా. ఇఁక మన మనుభవింపవలసిన దే మున్నది! చలువ వలువలు జాళువానగలు న త్తరుమొ త్తములు సుందరమందిర ములు మందిరారామములు హంసతూలికాతల్పములు దాస

దాసికలు నిష్టమృష్టాష్టి. అవి సమృద్ధిగా నున్నవి. ముసలిమగని తో నున్న నేనును మగఁడే లేక యున్న నీవును నొకటియే."

"ఒకటియే యె ట్లగుదు మమ్మా! ఏముసలిమగఁడో యొకఁడు దొరకఁబట్టియే నీవు దేవి వైతివి"

"దేవి నైతి ననియే కాని చెప్పలేఁ బడుచుంటి నని లేదు కాఁబోలు!"

"మాఱుతిట్టును నొక్కయెుబ్బట్టునకు సరి రా దని చిత్రాంగి! యెన్ని యన్నను నీయందు భక్తి లేకున్న భయమైన నున్న దీనగరవాసులకు."

"నీయందుమాత్రము లేగా సెలజాణా! నాకెట్లు భయపడుచు నుందురో ప్రజలు దేవిగారిచెలికత్తియ యని నీకును నట్లే భీతిలు చుందురు"

అని వారు సంభాషించు చుండ జగముచుట్టము చల్లవాఱెను. ఆచల్లవాఱుట సహజము గాక యాదృచ్ఛికముగ మేఘపటలము లలముకొన నగరము కాఱుక్రమ్మటచే నని యెంచుకొనునది. ఔను సారంగధరునిమరణోపద్రవమును విని నగరవాసులందఱుం దుఃఖాంధకారమున నున్నట్లే నగరలక్ష్మి యు నంధకారబంధుర మయ్యెను. రేపు మాపు జగము నలమి యుండుపంచభూతములు సాక్షులు కావా ధర్మాధర్మములకు! ప్రాజ్ఞులు గ్రహింతురు పామరులు గణింపరు. అదియే భేదము కాని యెల్లప్పుడు నవి కీడుమేళ్ళ ననుసరించుచునే యుండును.

రాజరాజనరేంద్రుఁ డతిహర్షమునఁ జిత్రాంగిమందిర మును జొచ్చెను. కాలిచప్పుడు లుప్పతిల్లఁ బడకటింటికి వచ్చు చుండెను. వచ్చుచున్నవానియొక్క పాదపతననినదములు విని మనోరమ మాటలు త్రోవ నావలికరిగెను. రాజుగారిఁ గనినతోడనే "యతివినయమ్ ధూర్తలక్షణమ్" మ్మని యెన్నఁడు లేనట్లు చిత్రాంగి లేచి నిలుచుటయే కాక పాదాభివందనము నొనర్చెను. కార్యముపట్ల నట్లొనర్పక తప్పదు కదా! రాజును నాపె "నతనుసుఖ మలవడుఁ గాత" మని గీవించి "దేవీ! కావరమున నీనీవి వదల్చి భావజకేళిఁ దేల నెంచినపాతకిని నీతో వచించిన ప్రకారము కాళ్ళేతులు నఱుకఁ బంపితిఁ: గాని వానిగ్గానికి మానవులెల్లరు దుఃఖదందహ్యమానమానసులై యున్నారు సుమీ!" అనియెను.

"అద్దైగ్యమునకే యతఁ డింతసాహసముఁ బూనెను. అయ్యో! నాతోను నన లేదా నే నేమి చేసినఁ బ్రజలు విశ్వ సింపరు? నాయందు వాఁ కట్టిదృఢాభిప్రాయ మిదివఱకె నాటి యున్నది. నేరము నాదియైనను నీది యనియే నిక్కముగ నొక్కి వక్కాణింపఁ గలరు." అనియెను.

"పాపము ప్రజ లందఱుం దనపక్షమైనను శిక్షణ రక్షణకృత్యుఁడు నీపక్షమున నున్నాఁ డని యెఱుఁగరు!"

"ఎఱుఁగ కేమి యదియు నైనది. రాజుగారు నీపక్ష మున నున్నా రని నీ వింత నిక్కుచుంటివి కాని నే నూర

కున్నంత సేపే యనియెను. ఆభయముననె కదా నాథా! నేను మొన్న మీా రాగ్రహాగ్రస్తులై యరుగ నున్నపుడు వల దని ప్రార్థించి వారించితి: వారించుటయే కాక వాఁడు యౌవన మదమున నున్నాఁడు మీారు జరావస్థ నున్నారు: వాఁడు తెగింపనే తెగింపెను గాని నా తాలిబొట్టు నిల్పఁడు తాళుఁ డని మిమ్ము వేఁడితి."

"వాఁడా నన్నా చంపుట! యిప్పు డెవ రెవరిని జంపు చున్నారో చూచితివా! ముగ్ధాంగన వగుటఁ జితాంగీ! నీవు భయపడితివి."

"అబలల మగుమాకు మీాకుండు ధైర్య ముండునా! కావుననే మే మస్వాతంత్ర్యమున నున్నాము."

"అస్వాతంత్ర్య మేమి చిత్రాంగీ! నీవు సర్వస్వాతంత్ర్యము గలిగి యున్నావు. అహిచక్రముల నల్లలాడించు రాజే నీకడ నల్లలాడు చున్నాఁడు."

"చాలును లెండు మీా సరసము. ప్రాణేశా! తలవరు లీసరికి కత్తిగి యుండరా యీాయవివేకికరచరణములు ?"

"ఇంకను వంతవతుకుఁ గామ కాని యెదవినదుమకుఁ దెచ్చి యుందురు"

ఇట్లుగా వారు మాట లాడుకొనుచు నుండఁ గాఱుక్రమ్మి యున్న జలదములు భోరున నీరు కాఱింప మొదలిడియెను. ఆకాశాంగన తొలఁగుచున్న కన్నీరు నా ధారలు పడుచుండెను.

ఝంఝామారుతము ఘోషింపు చుండెను. భూదేవి నీట మునుంగు చుండెను.

ఇట్లుగ వర్షింపు చున్నను జక్కనిచింతపువ్వువన్నె గుఱ్ఱము లమర్చినశకటమొకటి వచ్చు చుండెను. ఆవారువములు తడియు చున్నతమనెమ్మేనులు ఝుళిపించుచు నెమ్మదిగ నడుగు లిడుచు నీరము లంతగఁ జిందకుండ నె వచ్చు చుండెను. పాపము బండిఁ దోలువాఁడు తడిసి కట్టుబట్టలనుండి నీరములు జారుచు చుండెను. బండితలుపులు బంధింపఁబడి యుండెను.

ఆశకటము వచ్చి వచ్చి చిత్రాంగిదేవిగారిమందిరద్వారమునను నిలిచెను. ఆఁగినవెంటనే లోనున్నదుప్పటములు లాగి రెండుస్త్రీవ్యక్తులు పరపురుషులకంటఁ బడకుండ లోనఁ గల వ్యక్తి పోఁబట్టెను. మఱియొకస్త్రీవ్యక్తి యంతఁ జిఱిముడి పడుచు సంతతధారలు గురియు చున్న యాశ్రువులఁ జేలాంచలములఁ బట్టుచుఁ జేటిచేయి నూఁతగాఁ గొని మేడమెట్లెక్కు చుండెను. దుప్పటములు తీసివేసి దాసికలు లోన కేగిరి. వర్షము పడకుండ శకట మొకసాలఁ బ్రవేశించెను.

చిత్రాంగిరాజరాజనరేంద్రులు కుంభపాతముగఁ గురియు చున్నవర్షమును సరకుసేయక వచ్చి "హా! ప్రాణేశా! సోదరీ!" యని పాదములఁ బడి మూర్ఛిల్లిన రత్నాంగిఁ గని విస్మయకలితు లైరి. కొంతవడి లేచి యారత్నాంగి "నాకుఁ బుత్రభిక్ష పెట్టరా!" అని దుఃఖింపు చుండెను.

‘‘మూఢురాలా! నీకుఁ బతిభిక్ష పెట్టినయీ దేవి నారా
ధింపుము. లేనిచో నే నీవఱకే లేకుందును.’’ అని రాజరాజ
నరేంద్రుఁడు నుడివెను.

‘‘అయ్యో! సిగ్గు! నేను పుత్రభిక్ష పెట్టనా? నాకే
నీపుత్రుఁడు పుత్రభిక్ష పెట్ట నెంచినాఁడు.’’ అని చిత్రాంగి
పలికెను.

‘‘హా! జీవితేశా! సర్వసద్గుణాలంకారుఁడు—

‘‘అవి యన్నియు నిదివఱకె విచారింపఁ బడినవి.’’

‘‘జితేంద్రియుఁడు—’’

‘‘ఇఁక నీమాటల కేమి మహామునులకే లేకపోయెను
జితేంద్రియత్వము!’’

‘‘ఏకాత్మజుఁడు—’’

‘‘ఏకాత్మజుఁడు కావుననే మాయిరువురకు నేకాత్మ
జుఁడు కా నెంచినాఁడు. ఏమి నీయభిప్రాయము? ఆత్మజుఁడు
కా ని మ్మేకాత్మజుఁడు కా ని మ్మాదిదైవము కా నిమ్ము
శాస్త్ర మందఱియెడ నొకటియే’’

‘‘పున్నామనరకము నుండి యుద్ధరించువాఁడు—’’

‘‘ముం దెన్నఁడో లేవఁ దీయ నక్కఱ లేదు నన్ను
కడతేర్చి యిప్పుడే చిత్రాంగి లేవఁ దీయ నెంచినాఁడు!’’

‘‘హర! హరా! దోషము ఘటిల్లు—’’

‘‘కావుననే దోషాకరుఁ డనిపింపఁ బడె.’’

"హా! కుమారా! సారంగధరా! నీ కెంతగతి పట్టె నురా! తండ్రీ! నీ కింతటనె యాయువు చెల్లెనా!" అని విలపించు చుండె. రాజరాజనరేంద్రుఁ డంతఁ జిత్రాంగితోఁ "జూచితివా! సుతుఁడు కలిగిన వెనుక పతులపైఁ బ్రేమ తొలంగును పతుల కనియెద రిదియె సుమీ!" యనియెను.

"శివశివా! నాథా! మనోదైవపంచభూతములు సాక్షులుగఁ దెల్పుచున్నాను. జీవితేశ్వరా! మీసేవకురాలు మీపాదపద్మములనె యాశ్రయించి యున్నది. ఈసుందర పాదారవిందములనె తన డెందమున నైక్యముచేసి యున్నది. మనోవాక్కాయధర్మముల మీమీఁద మనసు విడనాడ లేదని యీ పాదములు పట్టియే చెప్పుచున్నాను. కోపవశమునఁ గొడుకు వట్లు సేయ సెలవిచ్చి రనుతలఁపే కాని వేఱు కాదు."

"పాప మంత ప్రేమ కలదియే కాఁబోలు మిమ్ముఁ జంపఁ దలఁచినదుష్టబుద్ధి రక్షింప వేఁడుచున్నది! ఏమిమాటలమ్మా! ఇంతకు నిందుకే మాటలు కోటులు నేర్చి యుండు మున్నారు!" అని చెక్కిళ్లు నొక్కుకొనుచుఁ జిత్రాంగి రాజగారితో గుసగుస లాడి రత్నాంగితో ననెను.

"మనోహరా! అంతఃపురద్రోహి యనియే మీయంతరాత్మ నమ్మిన నేయెడ నైన ననిపి ప్రాణదానము సేయుఁడు."

"ఏమి సమయము వేచి యెప్పుడేని నన్నంత మొనర్చి యీకాంతతో నేకాంత మాడుటకా! మఱియు నిన్ని పలుక

కుము. రత్నాంగీ! నీసుతు నిదివఱకె కాలుసేతులు నఱికి యుందురు. అంతఃపురద్రోహి కదియే శిక్ష శాస్త్రముల విధింపఁ బడినది."

"హా! చెల్లెలా! చిత్రాంగీ! నాథునకు నాపైఁ గోపముగ నున్నది. నీ వైనఁ జెప్పి నాకోపము మాన్పుము." అని యామెకాలుల నొఱగెను.

"ఏమి! రాజుగారికి నీమీఁదఁ గోపమును నామీఁదఁ బ్రేమయునా! బాగు! బాగు! రాజుగారికి నేను చెప్పి చేయించుటకు యువరాజుగారికి నీవు చెప్పి చేయించితి వేమి? వారి వారియిచ్ఛచొప్పునఁ జేయుదురు కాని యొకరు చెప్పినఁ జేయుదురా? వదరకుము. పగచినట్లును వాఁత పెట్టునట్లును బలుకుచుంటివి నేర్పరివే!" అనియెను.

"హా! దైవమా! ఇంకను న న్నేల నిలుపుదువు? ఓ గోదావరీ దేవీ! నీవు నన్నంత మొనర్పవా! ఓకోటిలింగస్వామీ! నీకును గరుణ రాదా! ఓ పంచభూతములారా! ఏల నన్ను మీలోఁ గల్పుకొనరు! ఓతల్లీ! భూదేవీ! నన్ను నీలోనికిఁ దీసికొనవా! ఓయనలదేవా! న న్నాహుతి చేసికొనవా!

హా! తండ్రీ! సారంగధరా! ఇందుకే నే నాకల కంటినా! నాయనా! మొండివై తిరుగ నాపాపినేత్రములకుఁ గనుపట్టుచున్నావా! చూడ లేను జూడ లేను సూనుఁడా! అయ్యో! అయ్యో! నీ వీపటికి మొండి వైయే యుందువు.

కాఁబోలు! కాలుసేతులు కోలుపోయి నీవు జీవింతువా! కల్ల! కల్ల! కైలాసముఁ జేరియే యుందువు నీతో నేను నిదే భర్తృనాజ్ఞఁ గొని వచ్చెద

త్రికరణశుద్ధిగ నాభర్తను నేనేమఱక యుంటినా; పతివ్రతా ధర్మ మేమఁ దప్పక సంచరించితినా; యీనాపతిపాదములకడనే నాకు మరణ మగుఁ గాత! స్వామీ! నా కాఙ్క్ష యిందు. హా! శంకరా! అఘనాశంకరా!" అని రాజరాజనరేంద్రునిపాదములకడ నొడ లెఱుఁగక పడియెను.

తత్క్షణమ రాజు మనోరమను గేకవేసి రత్నాంగిదాసికలను బిలిపించెను. రత్నాంగి నందుండి స్వాంతఃపురమునకుఁ గొనిపోఁ బనిచెను. రత్నాంగిదేవిని నెమ్మదిగఁ జేతుల నెత్తి ద్వారమున సిద్ధముగ నున్నశకటమునఁ బెట్టిరి. వర్షధారలు పడుట మానుచు మానుచు నుండెను; జాలవఱకుఁ దగ్గెను; జాలవఱ కేమి యించుమించు వాన వెలిసిన దన వచ్చు; బండి చక్రములకరకరమనుచప్పుడులు ప్రారంభ మయ్యెను. కొంత కాలమునకు శకట మదృశ్య మయ్యెను.

"చూచితివా చిత్రాంగీ! యెన్నెన్ని యడ్డంకులు కలుగుచున్నవో! వీరందఱు సారంగధరు రక్షింప వలయు ననియే! సన్న్యాసాచార్యులుగారు నాప్రియశిష్యునిగుణములు నేను పూర్తిగ నెఱుఁగుదు, నతఁడు కలలోను నిట్టికానిపని యొనరుపఁడు నరికదా తలపెట్ట నైనఁ దలపెట్టఁడు, నమ్ముము నీవు

చిత్రాంగిదేవిని వివాహ మాడిననాఁట నుండి యతఁడు పరిపూర్ణమాతృభావమున నాపైయెడ నున్నాఁడు, నేను నొక్కి వక్కాణింపఁ గలను. ముందు విచారింతువు, వినుము. అని యిఁక నెన్నియో చెప్పెను."

"ఆమాటలు నిజమే" యనుకొని "నన్నేమి చేసినఁ జేయుఁడు; ఈగందరగోళమంతయు మీకారణమునఁ గలిగినది. ఈయుసురంతయు మీది: మాట వచ్చి చెప్పుచున్నాను కోపపడకుఁడీ!" అని యదను గని చిత్రాంగి యంటించెను.

"ఔను ఇది యంతయు నాకారణముననే. ఐన నీవును భాగస్తురాలవే! నీమూలమున నిది రాద్ధాంత మయ్యె."

"వెఱ్ఱివాఁడు నే నొడంబడమి నిన్ని వచ్చె ననుకొను చున్నాఁడే కాని యతఁ డొడంబడమి నిన్ని వచ్చె ననుకొన కున్నాఁ డనుకొని, ఔను మీ రన్న నెవ రన్న నీచిత్రాంగినే కాదే! అనుఁడు ఏమి సేయును నావ్రాఁత! ఎన్నిటి కైనఁ దల యొగ్గ వలయు" నని వగలుపోవ నారంభించెను.

"దేవీ! చిన్నఁబుచ్చుకొనకుము. ఏ మన్నను గోపమే! ముక్కున నుందును. అంద ఱన్ని విధముల నన్నను నే మయ్యె. నిన్నుఁ గాదని నడిచితినా! నన్నపాచార్యులేనా సుమంతుఁ డెన్నెన్ని చదివెను! ఎన్నఁడును మాట దాఁటనివాఁడను వారి వచనములు సరకుసేయు కుంట నీకుఁ బ్రీతి యొనర్పెద మనియే కదా!" అని రాజరాజు నుడివెను.

“భళిరా! కామదేవా! నీశక్తి వర్ణనాతీతము! నీకు లోకువ కా కుండ వలయునే కాని వశ మైనచో నీవు చేయు లేని దేది! యనుకొనుచు నరే వీరికి నాయెడఁ గలమక్కువ కిదివఱకు నూరివా రెన్నన్నో సాధింపు చున్నా రనుకొన్నానే కాని వీరును నల్లే దప్పుదు రనుకొన లేదు.”

“చెప్పు చున్నానా దేవీ! సంగతి చెప్పు చున్నాను గాని. చిత్రాంగీ! యిప్పుడైన నీమనసు కుదుటఁ బడినదా! ఎక్కడ నుండియో కొనివచ్చి చోర రానిచోటులు చొప్పించి నందులకుఁ జరణములును, వావివరుసలు విడనాడి కోర రాని కాఁగిండ్లు కోరినందులకుఁ గరములును గోలుపోవుటయే కాక యన రాని విన రానియధమసంభాషణ లాడిననోట గోల పెట్టుచు నిప్పటికిఁ దప్పక మరణించియే యుండు నాయధమాధముఁడు.”

“అధమాధముఁ డను టెందుకు చిట్టచివర! పాపము! వానికై పరితాపపడు చున్నారు కాఁ బోలు! ఎట్టివాఁ డయినఁ గొడుకు కొడుకే భార్య భార్యయే!—భార్యయుఁ గాదు ఉంపుడుకత్తె యన వచ్చును!—పట్టపుదేవి యున్నది కదా!”

“చిత్రాంగీ! మా టాడినఁ దప్పు. ఎట్లు తప్పు నా కీ ముప్పు. ఏమో యంద ఱన్నివిధములఁ జెప్పిన ననుకొన్నంతయు జయోత్సాహముగ నెరవేరఁ గదా యని నాయుద్దేశము. ఇది యంతయు నేల లెమ్ము వనవిహారమ్మునకు.” అనియెను.

## పదునెనిమిదవ ప్రకరణము.

---

### నిర్యాణము.

రాజరాజనరేంద్రపురమునకు నీశాన్యమున ఘోరాటవి కలదు. అది తాళతక్కోలతమాలహింతాళభల్లాతకామ్రాతచూతకేతకీమాతులుంగలవంగలుంగాది వృక్షవర్గముతోడను హరికరిశరభశార్దూలభల్లూకాదిభీకరమృగములతోడను కాకఘూకగృధ్రగండభేరుండాదిపక్షులతోడను నెరసిబెరసి యుండెను. అది తూర్పుకనుమల నంటి యుండెను. నడుమ నడుమ గిరులు పెక్కు లుండెను. కంటకశిలావృతము. నిర్గమించుటకు మార్గము దుర్లభము కావున దుర్గమము, వెదురుపొదలు గుబురుకొని యుండెను. గచ్చపొదలకు బొమ్మజెముడులకుఁ గొఱఁత లేదు. పడియలు చెఱువులు కొలఁకులు సెలయేఱులు బాగుగ నుండెను. సాధారణముగ నందు నరులస్పర్శయే యుండదు.

ఇరువురుహంతకు లొకసుకుమారుని గొని యతికష్టమున నాయడవి నడుచుచున్నారు. అబ్బా! వారియాకారములు కడుభయంకరములై యుండె. యమకింకరులకు సాటిగ నున్నారు. నీలిచెడ్డీలు దొడిగి దట్టీలు గట్టి నిశితకరవాలములు మొలయఁ బాప మాచూపరునిదండలం గట్టినత్రాళ్లొకచేతఁ

బట్టి చనుచు నున్నారు. కాలురంగులును భూతిదేహములును గ్రూరదృష్టులును వీరాలాపములును గలవారి నారసిన నెట్టిధులును బెంగఁ గొనకపోరు. ఆసుకుమారమూరాకారుఁడో వసివాడినమోముతోఁ గసిగందినమైసిరితో నెఱ్ఱవాఱిన పాదములతోఁ జూపఱుల కెంతయు విచారభూతుఁడుగ నుండెను. ఆ మోముదమ్మి చెమ్మటలఁ జిందులాడు చుండెను. ఆముక్తఘర్మబిందువులు ముక్తలఁ గేరు చుండెను. అయ్యయ్యో! జీవముల దేహముల నుండి వేఱు కావించి కర్మానుసారముగ నష్టకష్టములఁ బెట్టుచు నతిభయంకరమార్గముల యమకింకరులు నరులనయనములకుఁ గనఁబడకయ పోవుదు రని విని యున్నామే కాని యిపుడు బొందితోన కన విన రానియిక్కట్టులఁ బెట్టుచు దృగ్గోచరము లగుచుఁ గంటకశిలావృతగహనములఁ గింకరులు కొనిపోవుట కను చున్నాము! పాప మాదురదృష్టవంతుఁడెవఁడో వీరిబారి నెట్లు పడెనో యించుక యెఱింగించెద. పాఠకమహాశయా! అతఁడు మీసము లైన స్ఫుటముగ రాని స్ఫురద్రూపి సుగుణగణసంయుతుఁడు సారంగధరుఁడే. అంతఃపురద్రోహి యని నేర మారోపింపఁ బడినవెనుక నతఁడు రాజభటులచేఁ గాలుసేతులు ఖండింపఁ బడుటకుఁ గా నీహంతకుల కొప్పఁ జెప్పఁ బడెను. పాపము పురజనులు పెక్కండ్రతని విజ నాపఁ జాలక చాలదూరము వెన్నాడిరి. కాని రక్షకభటుల యాజ్ఞలను బెదరి తిరిగి పో వలసినవా రైరి.

వారివెనుకనె దూరము నుండి పరుగెత్తుకొని మఱి యొకఁడు వచ్చుచున్నాఁడు. అతఁడు సుందరుఁడె కాని యెండలఁ బడి యెండినట్లు మైసొగసు మాడియున్నది. మోము పోము నగుచుండెను. యౌవనప్రాదుర్భావమున నున్నాఁడని నూఁగునూఁగుమీసములే చెప్పుచున్నవి. మాసినబట్టలు కట్టియున్నాఁడు. ఒడలఁ దొడవులు లేవు. వెడనగవు నగుచు "నెలప్రాయముననే బ్రహ్మచారిగనే బొందితోడనే కైలాసమున కేగుచున్నావా సారంగధరా! భళిరా! సారంగధరా! నన్ను నీవెంటఁ గొని పోవా!" యనుచు నొక్కమాఱును "జితాంగి! చిత్రలేఖ" యనుచు మఱియొకసారియును "మునలిమగఁడు పడుచుపెండ్లాము" అనుచు నింకొకపర్యాయమును నిట్లుగాఁ బరిపరివిధములు పరిదేవనమొనర్చుచు మొగము మొత్తుకొనుచు దశదిశలకుఁ బరుగిడుచుఁ బడుచు లేచుచు భగవంతుని స్మరియించుచు నిందించుచు నతఁడు చిత్తచాంచల్యమున నున్నాఁడు. కింకరుల వెనుచఱచి వచ్చుచుఁ "గూళలారా! శూలికి విషము ద్రావుచున్నారా! మి మ్మనఁబ నేమి కన్నతండ్రియే కన్ను కానవపుడు! కా నిందు; మా క్రీకలికాలజీవనము కానిదియే! వారినే చిరజీవులు కా నిందు. ఔను జిరజీవులు చిరకాలము బ్రదుకును గాని రాజహంస లాఱునెలలే జీవించును. ఇదియు మాభాగ్యమే. అదే మాపరమహంస!" యనుచుఁ గొంతకెలివి వచ్చుట నుడువుచున్నాఁడు.

నల్లఱాళ్ళఁ బోలి కఠినతమము లనుకొనిన యాకింకరుల
మనములును నాపెట్టెవానిపలుకులం గరంగినవి కాఁ బోలు
వారును విచారపడఁ జొచ్చిరి. తమనీచకృత్యమును నిందింపఁ
దొడఁగిరి. ముందిఁకం దా మాపని మాని చెప్పులు కుట్టుకొని
జీవనము సేయ నిశ్చయించిరి. అజితేంద్రియుఁ డంపుటకును
వెనుదీయ నుండిరి. ఆతనిఁ జంపినపాతకమ్ము తమ్ముఁ దమయాలు
బిడ్డలు మున్నగువారి నెన్నో యిడుమల ముంచు నని తలఁపోయు
చుండిరి. బలికి బత్తెను బలిమిని లాగుకొనిపోవున ట్లిదివఱకు
మరణదండన నొందినవారిఁ దీసికొని పో వలసినవా రతఁ డ
ట్టీస్వఁబడుట కవకాశమే యీయానందున నచ్చెరువుపడఁ జొచ్చిరి.

కంబాలచెఱువునకును గాననము కొంతపలుచనఁగ
నుండుట వారి కంతకష్టము లేకపోయెను. కాని యాచెఱువుఁ
గడవఁగనె చెట్లు దట్టముగ నలముకొని యుండెను. ముండ్ల
పొదల వాఁడిఱాళ్ల మెఱకపల్లముల నగ మెండుట నీళ్ళింకి
యూబినేలలుగ నున్నపడియలఁ గడుఁగడు దాఁటవలసి వచ్చెను.

సారంగధరనామస్మరణమాత్రమేమఱక యాసారంగ
ధరుఁ డేకాగ్రచిత్తుఁడై తన్మయుఁడై యుండుటఁ దనపోవుతా
వేదియో తా నేమిబాములఁ బడుచున్నాఁడో తెలియ
కుండెను. అమ్మ! యనఁడు. అబ్బ! యనఁడు. బెగ్గడిలఁడు.
బెంగఁ గొనఁడు. హర! ఓం హర! హర! హర! మహా
దేవ! శంభో! యనుచునే మార్గము నగిడించి యుంచినాఁడు.

వెఱ్ఱివాఁడును ముండ్లడొంకల దాఁటుచు శరీర మెల్ల గీఱుకొనిపోయినను గట్టుబట్టలు చించుకొనిపోయినను గంటకములు పాదముల విఱిగినను గణన సేయక భగవంతు స్మరియింపుచుఁ "జిత్రాంగి చిత్రరేఖ" యను రెండుపదములను వదలక తెలివి వచ్చినపుడు సారంగధరునియవస్థకు బోరుబోరున నేడ్చి కన్నీరు మున్నీరు గాఁ గార్చుచు "మిత్రమా! నీతోడిదే నాకు" ననుచుఁ "గింకరులారా! ఆఁగుఁ డాఁగుఁడు; నన్ను రానిండు: నాప్రాణమిత్రునిముద్దుమొగము నన్నుఁ గన్నులారఁ గాంచ నిం" డనుచు "హర! హర! హర! శంకరా! అఘనాశంకరా! రక్షింపుము రక్షింపు" మనుచు వెంటాడుచుండెను. తిరుగ బాగుగ వానిదురవస్థఁ బరికింపఁగనె మతి వికల మై "ఓగహనమృగావళులారా! రండు: రండు. వనంతోత్సవము సేయఁ బోవు చున్నారు వే రండు. సారంగధరుఁడు పెండ్లికొడుకు గా నున్నాఁడు. ముక్తికాంతఁ జెట్టపట్టు చున్నాఁడు. ఓకాంతారలక్ష్మి! వనపురంధ్రిరత్నమా! పుష్పఫలపత్రముల వీనిఁ బరిఢవిల్లఁ జేయుము. ఏమఱకుము. నేత్రానందదాయకము లగుపతంగమంగళాంగనలారా! మీమృదుమధురస్వరముల మంగళహారతు లొసఁగుఁడు. ఓప్రకృతివర్గములారా! మీరే మాపెండ్లిపెద్దలు. ఓద్విజబృందములారా! మంత్రోచ్చారణ ప్రారంభింపుఁడు; ప్రారంభింపుఁడు. కవులారా! ఆశీర్వాదము లొసఁగుఁడు. మీయాశీస్సులబలమున

మాసారంగధరుఁడు ఆనందతేజోమయుఁడు ఆదిమధ్యాంతరహితుఁడు అనంగుఁ డగుం గాక! ఓ మేఘపటలములారా! ఓ సింహశార్దూలమృగాదులారా! భూరిభేరీకాహళధ్వనులు మ్రోయింపుఁడు. గంధవహా! సదస్యులఘర్మబిందువులు హరియించి ఘూర్ణేంద్రియోత్సాహము గావింపుము గావింపుము. తాళవృక్షములారా! వీవనలు వేయుఁడు. చమరమృగములారా! వింజామరలు విసరుఁడు. రంభాదులారా! విజృంభింపుఁడు. ఘనతరులారా! సుమనోల్లాస మొనర్పుఁడు. చూడఁ జూడ వేడుక. మాయఁ బడిన నేడుపు. మాసారంగధరుని పరిణయము చాలసంతోషము. ఇదే పెండ్లికొడుకు పెండ్లియరుఁగెక్కు చున్నాఁడు. పెండ్లి! పెండ్లి! పెద్దపెండ్లి!" యని యనేకరీతులఁ బ్రలాపించుచుండె. పాపము! బుద్ధిమంతుఁడా సుబుద్ధి కెంతయవస్థ సంభవించె.

మిత్రుఁ డాసారంగధరునిపాటు పరికించియ ట్లాఁబోలు దురభిప్రాయపడినరాజరాజనరేంద్రునిమనము దహింపఁ దలఁచి యగ్నిజ్వాలలఁ బఱపెను. దృఘాంతఃపురమున మూర్ఛఁ డై యున్నయతని సమయింపఁ జాలమి మొగ మెట్టినౌపట్యంతముఁ గరములఁ గరము చాఁచి శకుంతసంతానరవంబుల దివంబు మాఱు మ్రోయ నేడ్చుచుండెను. తనచేతఁ గాని నాసారంగధరునియవస్థ నాసారంగధరునకే తెలిపిన నే మైనఁ గార్యముండునో యని తనకడ నుండి యతిప్వఁరితముగ ఛాయాపుంజ

ప్రొంట్లఁ దూర్పునకుఁ బంపు చుండెను. బ్రహ్మలక్ష్మీనివాస
ములఁ నీట మునిఁగించు చుండె. సుజనులమనముల దుఃఖము
చౌనుపుటమే కాక లోకమంతయుఁ జీకటిని విడిచెను. యువ
రాజాస్తమయముఁ గాన లేక మునుమున్నె యాదినరా జస్త
మించెను. చీకటిమిత్తి తెల్లనిచుక్కలు గలనీలాంబరముతోడ
లోకము నలమి యుండెను. పాములు బుసలుకొట్టు చుండెను.
పులులు గాండ్రు గాండ్రుమను చుండెను.

రాను రాను హంతకులును సారంగధరుఁడును సుబుద్ధియు
నగరమున కరకోసు దూరమున నున్న యొకమెట్టయొద్దకు
వచ్చిరి. అది పలువిధము లగుచెట్లచే దట్టముగ నలంకరింపఁ
బడి యుండెను. రమారమి ముప్పదిగజములయెత్తుండును.
ఎండకాల మగుట నెండి యుండినకొండయేఱులదారుల నడుగు
లిడుచు వా రెట్టెట్టో మెట్టమీఁది కెక్కిరి. అది రాజమంది
రము గలగిరివలెనే యుండెను. అదియు నిదియు నొకటే యెత్తు.
వైశాల్యమునను నిదియు నదియు సమానమే. అది నగరమునఁ
జుట్టఁ బడి యుండ నిది నగములఁ జుట్టఁ బడి యుండెను. యువ
రాజు గావున రాజుగా రితని క్షిధ్రనివాసము కల్పించిరి కాఁ
బోలు! రాజమందిర మక్కడకుఁ జక్కఁగఁ గనఁబడును.

ఆగిరి రాజరాజనరేంద్రపురమునకు నీశాన్యమున
నుండెను. ఆశైలము నారోహించినంత సారంగధరుఁడు కైలా
సము నెక్కినట్లు తలఁచు చుండెను. ఆహా! రాజరాజనరేం

ద్రినినిరంతభక్తికైంకర్యముల కలిరినయీశాన్యనిగ్రప నవ
తరించినయాసారంగధరుఁ డీశాన్యగిరిమీఁదనే నిర్యాణ మొంద
నీశ్వరేచ్ఛ కాఁ బోలు!

ఆశైలోపరిభాగమున కలిగినయనంతర మారాజకింక
రులు సారంగధరు నన లేక యన లేక తప్పనిసరి యగుట వధ్య
శిలపైఁ బరుండఁ బ్రార్థించిరి. ఊర్ధ్వముఖుఁడుగఁ బన్నుండి
వారివేఁడుకోలు నతఁడు వెంటనే నెరవేర్చెను.

"మిత్రమా! మిత్రమా! యనిమేషు లారయు చుండఁ
బెండ్లిపీట నలంకరించితివా! నేను నీకుఁ దోడిపెండ్లికొడుకును
జుమీ! మఱవకుము మఱవకుము. చిన్ననాఁటి నుండియుఁ
గలచెలికారమున నాకును భాగ మున్నది." అని సుబుద్ధి
యఱచెను. కాని జితేంద్రియుఁడై పంచప్రాణములు బంధించి
వైచినయాపరమహంస కవి వినఁ బడనే లేదు. "తలవరులారా!
తాళుఁడు తాళుఁడు. ఓపంచభూతములారా! మీరే
సాక్షులు! ఓయష్టదిక్పాలురారా! మీరు చూచు చుండుఁడు!
హే! తల్లీ! గోదావరీదేవీ! నీవు నరయుము! అమ్మా!
రత్నాంగీ! ముక్తికాంత ముదమారఁ బరిణయ మగు చున్న
నీకన్నకుమారుఁ గాంచవా! మితి లేనిజపతపము లొనరించి
యతులోపవాసముల స్రుక్కి చిక్కి నవమాసములు మోసి
నానాకష్టములు పడి వృద్ధి గాంచిన నీయనుఁగుఁదనయుని
యుద్వాహము గనుఁగొన నోమ వైతివా! అమ్మా! అమ్మా!

రమ్ము. హా! రాజరాజనరేంద్రా! నీయాజ్ఞానుసారమే రక్తాంగుఁడు కా నున్న నీయంతవాఁ డగునంగజుఁ జూడ రావో! హా! చిత్రాంగీ! చిత్రాంగీ! నిన్ను చెట్టపట్టుట తప్పటఁ గాఁ జేఁ డితని మోక్షాంగనఁ జెట్టపట్టించు చున్నావు! ఉత్సాహపూరితమతిపి కమ్ము. రాజరాజనరేంద్రపురవాసులారా! యువరాజుగారి కిఁక నొకగడియకుఁ గా నున్న వసంతోత్సవమునకు రారా! అయ్యో! యీవసంతోత్సవముఁ గనులారఁ గాంచ నేతెంచిన మీావలువలును దడియ ననియా తప్పించు కొని యున్నారు పో నిందు మీా కందఱకుం దప్పినను నీనుబుద్ధికి మాత్రము తప్పదు సుఁడీ! సృష్టిస్థితిలయకారకుండ వగునో జనార్దనా! రక్షింపుము! రక్షింపుము! ఆర్తజనశరణ్యుండవు కావా! రావా! లేవా! దేవా!" యని యఱచు చుండెను.

తలవరులు తళుకు లీనుతమకత్తుల నేకకాలమున నెత్తి యొక్కవ్రేటువకే సారంగధరునికరచరణములు నతికి నెత్తుటఁ దోఁగించిరి. ఆ రాజకుమారుఁడు "హా! శంభో! యుమాపతీ! మాంపాహి! పాహిమాం!" అని యఱచుచు విలవిల లాడుచు రక్తసిక్తగాత్రుఁ డయ్యెను.

"హా! మిత్రమా! సారంగధరా! సారంగధరా!" యని యామొండెమును బట్టుకొని సుబుద్ధి నేలఁ గూలి కొంత ముడకు లేచి "హా! సారంగధరా! హా! సారంగధరా!" యుని వెండియు నఱచు చుండెను. దిక్కులు మాఱు మ్రోయు

చుండెను. విలవిలలాడునా కొండెమును "హర! హర! మహా దేవ! శంభో!" యని చిట్టచివఱఁ బలికి బిఱ్ఱబిగిసెను. సుబుద్ధి యది గని వెండియు "సారంగధరా! సారంగధరా! అదిగోఁ బ్రకృతి నుండి బదు లిడుచున్నావు! అప్పుడే పంచభూతముల నైక్య మైతివా! హా! సారంగధరా! చరాచరముల నన్నిఁట నిండి యుండిననీ కిదే ప్రణమిల్లి నేనును వచ్చుచున్నాను వచ్చుచున్నాను. దూరము పాఱకుము." అనుచు వధ్యశిల శిరము వ్రక్కలు చేసికొనియెను.

శివకేశవనరనారాయణులవలె స్వల్పకాలమే ధర జరించి యానందతేజోమయుతో నైక్యమైన యామిత్రయుగముఁ గని ప్రకృతియు ఝంఝామారుతముల ఘోషింపుచు విఱిగి పడు వృక్షశాఖలఁ దట్టుకొనుచు మిన్నునకు మన్నునకు నేకధారగా వర్షించెను. జగమెల్ల యంధకారబంధుర మయ్యెను. పిడుగులు పడియెను. దిక్కులు మిఱుమిట్లుగొలిపెను. జంతువర్గము హా! హా! కారములు సలిపెను. ప్రళయము సంభవించిన ట్లుండెను. ఏదువార్ధు లేక మగు నని తోఁచెను.

పాపము! నిర్దోషి యగుసారంగధరు నతిక్కినపాపమునఁ గా నోపు నాతలవరులును బెబ్బులులవాతలఁ బడిరో యాకుంభ వర్షమునఁ గూలిరో తెలియదు కాని తమ నెలవులకు మగుడ లేదు. కూళలఁ గొలుచువారియవస్థ యిదియ కదా!



# పందొమ్మిదవ ప్రకరణము.

---

### ప్రాయశ్చిత్తము.

త్రిమూర్త్యాత్మకుఁడు నడిమింటఁ దీక్ష్ణవీక్షణములు పఱపుచు సకలచరాచరముల మలమల మాడింపుచు సార్థకసారంగధరనామమునఁ బ్రజ్వరిల్లు చుండెను. పుట్టలలో నుండఁజాలక పాములు బయలువెడలు చుండెను. సారంగములు చెట్టునీడల నెమరు వేయుచు మేనులు వాల్చెను. ఎండమావులు చెలరేఁగెను. మృగములనేకము లామృగతృష్ణలకై పరుగులిడు చుండెను. కోకిలలుమాత్ర మొందొండు మీఱఁ గేకలిడు చుండెను. కరులకిరులమదము కరఁగి నీరై కారు చుండెను.

ఉప్పరులు మున్నగుకష్టజీవులు హాయిగ ఛాయాద్రుమములక్రింద నిద్రించు చుండిరి. శ్రీమంతులు సన్ననివలువలు కట్టి వీవనలు ముందు వెనుకలాడ నిదురఁబోవు చుండిరి. చిత్రాంగియు నిజశయనాగారమున నిదురింపు చుండెను.

ఆలోచనాన్వితుఁ డయి లోచనములు నిగుడ్చి రాజరాజనరేంద్రుఁడు "ఇది యేమి! ఈసగము పత్రము సుబుద్ధి కెట్లు చిక్కె! చిత్రలేఖ యని పైనను జిత్రాంగి యని యడుగునను బూర్తిగ నున్నవి. ఆద్యంతములు చూచినఁ గాని యిది యెంత చదివిన నర్థ మగుట నర్థము కాక యుండె. కొన్ని చిన్ని వాక్య

ములు పూర్తిగ నున్నవి. దాన నిది నేను నగరమున లేనియెడ దేహస్వాస్థ్యము తప్పి చిత్రాంగి లిఖించినట్లు స్పష్ట మగు. పైన మారా! యనుపర్ణములే మిగిలి యుండుట నన్నే సంబోధించినట్లు తోఁచు. లేక 'కుమారా!' యని యున్నను నన్ను త్వర రప్పించుటకును నంతలో వైద్యసాధనమున స్వాస్థ్య మొనర్చుటకును వాఁడే యప్పు డధికారి కాన వానిఁ గోరి యుండు. మగుడఁ జదువుదును"

చిత్రలేఖ.

మారా!

మహాఁడ వని మిగుల విందు నాపై
గూర్మి నినుఁ జూచుభాగ్యము నాకు
రా జూర లేఁదు. కాలయాపన
మయ్యె నా కిపుడు గలదాహ
ఒడ లుడికెదు. మహోదార
వలయు. నీయాగతిని
కాదు. మదిఁ గాల్చి
వైద్యుఁ బిలిపించి నీవ
యుఁ జాల కున్న
నముఁ బిదు
న్న దానను."
చిత్రాంగి.

ఏమియు బోధ కాదు. ఒక్కటిమాత్రము నిశ్చయము నావియోగము సైఁపక చిత్రాంగి సారంగధరుని కనుఁ బడి సగము చిచ్చిఁగి వానిపరమమిత్రుఁ డగుసుబుద్ధికిఁ జిక్కియుండు. వాఁత చిత్రాంగిదే యన సందేహ మించుకయు లేదు. దీని సంగతి చిత్రాంగిమూలమున నెఱుంగ వలయు." అనుచు మెల్లన మేడమెట్లెక్కి శయనమందిరద్వారమును జేరెను. చేరి వింతమై ద్వారమునన నిలిచి తెఱచి యున్న గవాక్షము నుండి చిత్రాంగిఁ గనిపెట్టు చుండెను. నిదుర నున్న యాకోకిలవాణి కలువరింపు చుండెను. రాజు తలపోయు చుండెను.

"సారంగధరా! సారంగధరా! ఇట్లుడికింపు చున్నావేర!" అన రాజరాజనరేంద్రుఁడు సాశ్చర్యుఁడై "ఏమీ యీసారంగ ధరుఁ డెవఁడు? నాకుమారుఁడు కాఁడు కదా! కాఁడు. విరహి జనవేదనాకరుఁడుచంద్రుఁడై యుండు. వాఁ డీదేవిముఖమున కనగామి ని ట్లుడికింపు చున్నాఁడు. ఔను మత్సరగ్రస్తులు తమమాలిన్యమును మాపుకొనఁ బ్రయత్నింపరు కాని యెదిరి మాడింపఁ జూచెదరు. ఇది యెట్లు పొసఁగు? ఇప్పుడు సారంగ ధరుఁడా ప్రకాశింపు చున్నవాఁడు! కలలో నతఁడే కనుపట్టు చున్నాఁడా! కాదు నేనే త ప్పాలోచించితి. మధ్యందినమా ర్తాండుఁ డాకాశమధ్యమునఁ బ్రకాశింపు చున్నాఁడు. అతఁడు సారంగధరాకారము ధరించి యుడికింపు చుండుట నీరమణీ మణి యిట్లు వాకొనియెను."

"గురుద్రోహివి—"

"ఓహో! చంద్రికే! ఆసారంగధరుఁ గాంచి నే నెట్లు కలఁత నొందితినో యట్లే వీనిఁ గని నరిత్సతి కలఁత నొందుట లేదు గురుద్రోహి; మఱియుఁ దారారమణి మారు బారిఁ జిక్కించి గురునకు ద్రోహ మొనర్చినవాఁడు గురు ద్రోహి యనుట కింకను సందేహమా! దేవీ! నీవు పతివ్రత వగుటఁ దప్ప కాని లేనిచో నావిషయమునను వాఁడు సమా నుఁడే యై యుండు; నేబుధునో కని యుందు. ఇది నాపూర్వ భవార్జితపుణ్యము.

చిత్రాం:—"గురుద్రోహివి కాక యుండిన నీ కీకళంక మబ్బ కుండునే కదా!"

రాజ:—ఈపె సారంగధరుఁ గూర్చి ప్రసంగింపుట లేదు కదా! గురుద్రోహి వన ఘనద్రోహి వని కాదు కదా! జాలి గుండె గలది గావున వానిమరణమునకు విచారించు చుండెఁ గాఁ బోలు! దేవీ! నీ కింకను జాలి యేల! మూర్ఖనమాన యునియు నెన్నక నిన్ను బలిమి గవయ నెంచినపాపాత్ముఁడు. అట్టిఁడులపై దయఁ బూన రాదు. కూరవ్యాళమునకుఁ బాలు పోసి పెంచిన ట్లగు. ఇప్పుడు జాలి దలఁచి విడిచిన మఱియొక్క ప్పుడు ఘాత దలఁపక మానఁడు. ఏమి నా వెఱ్ఱి! గురుద్రోహివి యన బృహస్పతిమొదఁ గావించినద్రోహ మై యుండు దానసే కదా వాని కాకళంక మబ్బె.

చిత్రాం:—నే నెట్లు గురుద్రోహి నందు వేమా నీయంగీకారమునఁనే.

రాజ:—ఎట్లనఁ గలఁడు? తార కోరె ననుకొమ్ము కోరినంతమాత్రమున వాని కాకోరిక యేల! ఛీ! ఛీ! యిది కూడనిపని యని తోలఁగఁ ద్రోయ రాదే! ఏమి మున్ను దేవయాని యన్నివిధముల బ్రతిమాలినఁ గచుఁడు వినెనా!

చిత్రాం:—నీవు దోషాకరుఁడవు

రాజ:—నిజమే. దోషాకరుఁడు కా కుండు టెట్టిట్టియ కార్య మొనర్చినవెనుక! అయ్యో! నిష్కారణము వాని దూషింపు చుంటివే! ఎంతవానికైన నింతి నేకాంతముగఁ జెంత నున్నంతనే వలపు జనించు నిఁకఁ బైఁబడిన జనియింపదా! ఎవఁడో శుకుఁడు కచుఁడు తప్ప యినుపకచ్చడములు కట్టినముని వృద్ధులును దమనియమములు దప్పి దాసులైరి కదా! ఎలపాయమున నున్నవాఁడు నిగ్రహింపఁ గలఁడే గ్రహింపక: కావున నీపై దురభిప్రాయమునఁ బక్షపాతమునఁ బలుకు చున్నది. స్త్రీ కావున నాపై నిందించినఁ దనజాతికే తలవంపు లని వాని నిందింపు చున్నది. ఒకవేళ రాత్రిఁ గలిగించువాఁడు కావున నట్లను చున్న దేమో!

చిత్రాం:—నిజముగ దోషాకరుఁడవు. నీపైఁ బ్రబల హేతుయుక్తముగ నెంతో కూర్మి కలిగి యుండ లేదా! ఇంతవల వంతపా ల్పేత లగునా! కాన దోషాకరుఁడ వన నొప్పు.

రాజు:—ఔ నౌను దనకుమారునికలనే తలపోసినపుడు వాఁ డట్లవమానపఱచుట తగనిదే!

చిత్రాం:—నిన్ను మగుడఁ గాంచుటకు మన మెట్లొవ్వ?

రాజు:—ఛీ! ఛీ! ఎట్లు?

చిత్రాం:—ఆకారణముననె నీయాకారము మాపఁ బ్రయత్నించుట

రాజు:—ఔను దేవరాజు చేవఁ జిక్కినవాఁ డగుట వాని నేమియుఁ జేయఁ జాలఁ డయ్యెఁ గాని రూపుమాప వలసినదే. పాప మణుమాత్రము కలుగదు. ఎంతబలహీనునకును దనకాంత నొరుఁడు చెఱచె నన్న నెంతేనిక్రోధము పుట్టి వాని యంతముఁ గనుఁగొనును. ఇంత మేల నే నేమి చేసితిని గాదిలికొమరుఁ డయిన వానిపేరివాని!

చిత్రాం:—తొల్తఁ బంపినలేఖ గని నీపట్టు వదలిపెట్టవు

రాజు:—లేఖ యనుచున్నది నాయొద్ద నున్న లేఖ కాదు కదా! కాదు కాదు. లేఖర్షభుఁ డనిపినలేఖ. ఇట్టికూళకడ సామోపాయము పనికి వచ్చునా! కుక్కకాటునకుఁ జెప్పుదెబ్బ యని దండనమే మంచిది. వెఱ్ఱిఁ బడి సామమున గార్యము చక్కఁ బడు నని తలఁచినాఁడు.

చిత్రాం:—ముఖాముఖి వేఁడినఁ గరఁగ వైతివి.

రాజు:—ఆనవ్వాక్యనమితి బూదిఁ బోసినపన్నీరును బీడునేల నాటినసస్యబీజములు నయ్యె. దుష్టబుద్ధి: వాని కేమి నాటు!

చిత్రాం:—నిష్ప్రయోజన మనుకొని యుపాయాంతరము లేమి నిన్ను సమయింప నెంచుట—

రాజు:—కాను దానితోన యన్నియుఁ జక్కఁ బడును. అంతే కాని సామదానభేదములు బెదిరింపులు పనిఁ జేయునా కల్ల కల్ల.

చిత్రాం:—కాని జంకుఁ గొంకు లేనినీస్థిరచిత్తమునకు మెచ్చ వచ్చు!

రాజు:—నిజమే యచ్చెరులును నచ్చెరు వొందిరి వానిస్థిర బుద్ధికి.

చిత్రాం:—కట్టా! నీవు క్షీణించినను మరులు క్షీణించ కుండె.

రాజు:—చింత చచ్చినను బులుపు చావ దనుగతి వానికా వరకు తఱుఁగ కుండుట నిజమే. వానిఁ గనినఁ జాలును—గన వక్కఱయే లేదు వినినఁ జాలు—మరులు పొడమును.

చిత్రాం:—మఱియుఁ బెరుఁగు చున్నవి. ప్రయత్నము కొనసాగిన నివి యన్నియు లేకయే పోవును గదా! హాయిగ సుఖింపు చుందుము.

రాజు:—నిజము చిత్రాంగీ! విరహిజనులయాందోళనము వానితోన యడంగి యుండును—

చిత్రాం:—నీకరములు పాదములు పోయి నీవు జీవించిన మరులు గొలుపవు—

రాజు:—చిత్రాంగీ! పొఱపడు చుంటివి పొఱపడు చుంటివి. క్షీణించియు మరలు గొలుపువాఁడు కరములు పాదములు తఱిఁగిన మరలు గొలుపఁడే!

చిత్రాం:—రాజా! ఎలప్రాయమున నున్నన న్నిట్లేడిపించు చున్నావు నాయుసురు నీకుఁ దగుల కుండునా?

రాజు:—ఈమె నన్ను దూషించుట లేదు కదా! నిక్కముగ నే నీపైఁ గికురించితిని. లే కున్న నన్ను వలచునా! కష్టపడి కన్నందుల కీసుఖ మొకటిమాత్ర మలవడె నాకు వాని కతమున. వాఁడే లే కున్న నా కీయున్నమిన్న దక్కదు. అయ్యో! తిరుగఁ బొఱపడు చుంటి. రాజన్నఁ జందురుఁడే. కార్యనిర్విష్టమున నుండునావియోగము సైఁపక యీజవ్వని యిట్లను చున్నది.

చిత్రాం:—తగుల కేమి నీవంశము నీతోన యంతరించును

రాజు:—ఏమి! వాఁడు మఱియు నావంశ మె ట్లంతరించు! బుధుఁడు లేఁడా! అహో! బుధుఁడు వీనికి స్వభార్యకుఁ బుట్టిన వాఁడు కాఁ డనియా యీమె యిట్లు నుడువుట! బుధుని వాని కుమారుఁ డనియే నిశ్చయించి యొప్పగించిరి కాదే నిలింపులు!

చిత్రాం:—హా! సారంగధరా! సారంగధరా! మగుడ నిను జూచుభాగ్య మబ్బునా! యీసారి యైన నాకోరికఁ దీరుపవే!

రాజు:—ఇది యేమి! నేనే బుద్ధి మాలి కినిపలుకు లన్నియు నన్యథాకరించితి. నిక్కముగ నిది నాతనయునే పేరుకొను

చున్నది. చూడఁ జూడ దీనిపోలిక లక్ష్మి యిటీవలఁ గనుపించు చున్నవి. సారంగధరునిరూపపటము చూచి దీని నే మోసపుచ్చుట నిది వానిపై మరులుగొని నన్ను మోసపుచ్చినది. అయిన నింకను వేగిరింపక పరికించెద దీనిచర్యలు. తామసి తా మసి యగు నన్నారు.

చిత్రాం:—రమ్ము రమ్ము నీకౌఁగి లిమ్ము (అని బయలు పట్టుచు నులికిపడి లేచె) రాజరాజనరేంద్రుఁడు "కటకటా! కులటా! నీవే నాకొంపఁ గూల్చితివే" యని తలఁపుచునె యామెకుఁ గనఁబడకుండ నొక్కప్రక్క కొదిగెను. లేచినయా చిత్రాంగి వెచ్చనూర్చి చింతింపుచు సాయంకాల మగు చుండుట కంపవదారి నుద్యానవనమునకుఁ జనియెను. చని యొకచంద్రశిలావేదికఁ జదికిలఁ బడి విరహవేదన ననుభవింపు చుండెను.

ఓకోకిలా! యేల నీ కింతగయ్యాళితనము! ఎంతగ గొంతు చించుకొనదవే! ఈ కేకలే కొంప తీసినవి. సహవాసదోషము పో లేదు. పలుగాకులచెలిమి బాగుగఁ బట్టుపడె. సుగుణములు పట్టుపడవు; దుర్గుణము లింతలో నలవడు. ఏఘనుఁడో వచ్చి నీగొంతు నొక్కనదాఁక నీమిడిసి పాటు పోదు.

ఓకీరశారికలారా! మీరును గేరు చున్నారా! మీ కిందుకే యావాఙ్జానసుఁడు బంధనాలయవాసము గల్పించె!

హా! గంధవహా! నీవును నేను బులకరింప వీచు చున్నావా! యనుచు నుండె.

రాజరాజనరేంద్రుఁ డొరులకంటెఁ బద కుండ మెల్లన నాయుద్యానవనమునని యీపెసవీపమునని యొకపొదరింట మాటుపడియెను. చిత్రాంగివచనము లన్నియు విను చుండెను. వినినకొలఁదిఁ గొలఁదికి మీఱి కోపము వచ్చు చుండెను. అయినను దుద ముట్ట వీను లొగ్గి విను చుండెను.

««ఏమే భ్రమరమా ! నాముఖము నిట్లు చుట్టుకొనెదు ? ఛీ ! పో ! సారంగమా ! నిన్నారక పశువున్నర యనిరా ! కమలమో ముఖకమలమో తెలియవు. మారునారి వగుట వాని వలెనే యుక్తాయుక్తము లెఱుఁగ కున్నావు. పో పొమ్ము తెలిదమ్మి చెఱఁ బడుయోగము కలదులే ! ” యని ఝు మ్మనుచు డాయుతుమ్మెదను గొట్టు చుండెను. అంత మనోరమ డాసెను. డాసి యాచిత్రాంగిలక్షణములు విలోకించి ‹‹ చెలీ ! హాపు దొఱఁగియు నామారునివలెనే నీకు మారుఁ డగుసారంగధరుఁడు నిన్ను వేచు చున్నాఁడా ! ” యనియెను.

««మనోరమా ! యేమి నుడువను: గుడిచినఁ గూర్చున్నఁ బన్నుండిన నతఁడే ప్రత్యక్షం బయి యుండు. నిష్కారణము చంపించితివే. చంపింప కున్న దూ పయినఁ గని సంతోషింపు చుందు నేమో యింతవంత లేకుండు నేమో యనుకొను చుంటి.

««సఖ ! నీబ్రమయే కాని మఱింతవంత నొంది యుం దువు: కన్నులకుఁ గనఁబడినకొలఁది పెత్తియే. నీ వాతనినే తలంపు చుండుట నీ కి ట్లుండెఁ గాని లేనిచో దుఃఖపశమన

మయి యుండు కాన నీకె వాని స్మరింపకుము. స్వర్గుఁడును వీఁడును. మనోవిచారమునకు మందే లేదు. చూడుము నీ వెట్లు కృశింపు చున్నావో! నీభర్తకు, వానికే యన నేల యందఱకు, నిది యనుమానాస్పదము. ఇట్లున్న నీగుట్టు బట్టబయలు కాక మానదు. నీకు నీవే వినాశముఁ గల్పించు కొన్న దాన వగుదువు. నమ్ముము దుఃఖ మ్మోడఁ బాయు" మనియెను.

"మనోరమా! నీ వింకను నీచిత్రాంగిపై నాస గొని యున్నావా! వలదు వలదు నాయాయువును ముగిసినది."

"నిజము నిజము నీయాయువు ముగియుటనే నీ కాదు ర్బుద్ధి పుట్టినది. హా! కామినీ! యెంతఁ జేసితివే!" యని శోకవిషాదములు వెలిపుచ్చుచు నుండె రాజరాజనరేంద్రుఁడు.

"మనోరమా! మన మెంత కప్పిపుచ్చినను నిప్పుడు కాకున్న మఱియొకప్పుడైనఁ గల్లనిజములు బయలుపడక మానవు. మనచేఁ గా నగున దేమియు లేదు. మఱియు మఱి చిత్రి సుబుద్ధియొద్ద నుండి రాజు నాఁడు నేను వ్రాసినచిత్రిలేఖ భాగమును గొనియెనా?"

"కొనియెను. చిత్రాంగి చిత్రిలేఖ యనుపదములు గాక వేఱు నుడువమి వానియొక్క సాక్ష్య మప్రయోజనమని సభాస్థలి నుండి వెడల నడుప నున్నతఱి నది యతనియొద్ద నుండి తీసికొనఁబడియెను. భూపాలునిమ్రోల నిడఁబడియెను."

"నీయొద్ద నున్నసగ మేమి చేసితివి?"

"ఇదె యెక్కడ నుంచిన నేమగునో యని కంచుకమున నుంచితి" నని మనోరమ చీటితునుకను దీసి యిచ్చెను.

చిత్రాంగి చీటి చేఁ గొనె. అంతకన్న మంచి సమయ మబ్బద దని గర్జింపుచుఁ గత్తి దూసి రాజరాజనరేంద్రుఁడు వారియెదుటఁ బ్రత్యక్ష మయ్యె. చిత్రాంగి భయజ్వలితయై చీటిని జాఱ విడిచి నిలువున నీ రయ్యెను. మనోరమయు భయాక్రాంతయై "హా! పొంచి యుండి యితఁ డన్నియు నాలకించెఁ గాఁ బోలు" నని గడగడ వడఁకుచుండెను.

"ఛీ! ఛీ! కులటలారా! మీకుత్తుక లీకత్తిని గోసి వేసినను దోసము రాదు. ఎంతపని చేసినారు. అరే! యెవఁ డురా యక్కడ?" నని యురుస్వరమున నఱచెను. ఇఁక నెట్లును జావు తప్ప దని మనోరమ పరుగిడి గోదావరి నుఱికెను. అంతఁ జిత్రాంగి చావ నున్నవారికి సముద్రము మోఁకాలిబంటి కదా నా కిఁక మరణమే శరణ మనుకొని తెగువఁ గలిగి "మహారాజా! మనవి. పంచభూతములప్రమాణముగ నష్టదిక్పాలకులయాలోకనముగ నంతర్బహిఃఖ్యాతములనధికార వశముగ స్వాహాసతీవల్లభునిసాక్షిగ నేనాఁడు నాయీపాడు దేహము—యేమట్లని కేమని— దేహ మన్నందులకా మూఢా! చిత్రపటసందర్శనమాదిగ నాచిత్రవిచిత్రగాత్రు శతపత్రనేత్రు పవిత్రస్తోత్రపాత్రు సారంగధరు—హా! యాసారంగధరు— ముఖజితసారంగధరు-విభూతిసారంగధరు-మాకుమారు మీకు

మీకుమారు మీకుమాఱు నే మనసార వరియించి యున్న దాన నగుటఁ గత్తికిఁ గంకణము గట్టు చున్నను నద్దానిధవళ ధళ్యంబున న్నాతండ నామమనశరోపరాజితసుమనఃపీఠమునుండి ప్రతిబింబించు చుండుట నిరాపేక్షగ నిరాక్షేపణగ నిరీక్షణ మయి మరులు తఱఁగక మెఱుఁగు తొఱఁగక మురియుచుఁ బరి ణయము జరుగ నిచ్చితిని. గాన—నాయీపాడు దేహమే-కట్టా! చెట్టుఁ గొట్టి మీఁద వైచుకొని యిప్పు డెందుకా కుందు? వివ ర్ణము విహ్వలత్వము వివశత్వము చపలతయే చేటున కాలవా లము!—నాయీపాడు దేహము నాయీనవనవసువర్ణావయవ ముల విలసిలునాయీపాడు దేహము—యని కల్పించిన దగుట దానిఁ దఱిగి పాతర వైచిన నాకావంత యావంతయు మనము నకు నచ్చుట లేదు నచ్చుట లేదు: ఈశిక్ష యావశ్యము దీనికిఁ దగుఁ గాని యిచ్చమై మెచ్చి యిచ్చి యచ్చుపడఁ జేసినమనమును నేనును జపలత నీపర్యంకముఁ బల్యంకము నలంకరించినపంకిల పంకులమున వానియనన్యతారుణ్యలావణ్యమును బునర్భవ మున నయిన ననుభవించుభాగ్య మీభూరిదారుణకార్యకారణ మునని యలవడ దనుఘనచింత నను ముంచి యుంచు చున్నది. ఆహా! యాసుకుమారాకారు—మారాకారు—మేరుధీరు— బహిరంతర్ద్విశత్రు—కువలయమిత్రు—సచ్చరిత్రు—సన్మార్గ వర్తి—సన్మార్గపరిదర్శను—సన్మార్గప్రవర్తను గలిసి మెలసి విలసిల నఖిలాతులాచలసత్కార్యాచరణ వరపదనిశ్శ్రేణి నొగ్

యొక ధుష్కామపీడాశాంతికై విభ్రాంతి నిరంతరచింతాక్రాంత స్వాంత నై యధమాధమవర్తనమున నరకశ్రేణి డిగిన నన్నుం బోలె యాలాపింప నే మగు. అయ్యో! పతితపవిత్రన నాతనితో నిహాలోకాస్థిరసౌఖ్యమునే యాసించితిని గాని పవిత్రపవిత్రనం బరలోకసుస్థిరసౌఖ్యము నాసింపనైతి. బులుపులమునలికిం దలంపులసతియు వలపులభర్తకు సొలపులభార్యయును! ఇంక నా కాంపుర మెట్లు కడతేరు రాజా! యిట్లు కాక! త్రికరణశుద్ధిగ బుద్ధిమై నిక్కము వక్కాణించు చున్నాను. నీనుకు మానునెష దోసము పీనమును లేదు. ఇప్పు డేమి యొచ్చి యేమి ప్రయోజనము. మించినదానికి విచారించి యాచరించు న దేమి! నీవును వనతికాలముననే యంగజపరితాపమున నింతయుం గలిగించుకొని యంత యొందు చున్ననన్నుం బోలి యంగజపరితాపమున నెంతో వంతం గలిగించుకొని యంత యొందుదువు. బలిమిని జెట్టపట్టుననమానవివాహములఫలిత మిది యని మనచరిత్రయె జగమును నేంక నయినం బ్రబలనిదర్శనపూర్వకముగ సన్మార్గమున నడిపించు చుండుం గాక'' యని వచించి తల వంచెను. రాజుగారిస్వరము వినినతోడనే సేవకుండొకండు పరుగుపరుగున వచ్చెను. అవచ్చిన వానికిం జెత్రింగి నప్పం జెప్పి దూరముగం గొని చని యుప్పు పాతర నేయ నాజ్ఞాపించెను. ఆయుమదిశ నొక్కచో నాయమనదనమున కనుప నాయమ ననంతిర మిరువురు భట్లట్లు చేసిరి. (అ పెం బొతినచోటే

పాతేరు. కాని కాలక్రమమున నేఁ డది పిన్నంగట్టుఁ బోలి కాతేరు నాఁ బడు చున్నది. ఇది సారంగధరుని మెట్ట కట్టయెదుటనే రాజరాజనరేంద్రపురమున కుత్తరదిశ నున్నది.)

నేల నున్న తునుకఁ దీసి తనకడ నున్న ముక్కలతోఁ గలియఁ జేసి రాజరా జిట్లు చదువఁ దొడఁగెను.

చిత్రలేఖ.

రాజకుమారా!

“నీవు మహామహుఁడ వని మిగుల వింటి. నాపై నానాథుని పెన్గూర్మి నినుఁ జూచుభాగ్యము నాకు ఘటింప దాయెను. రా జూర లేఁడు. కాలయాపన మో చింతచేఁ గష్ట మయ్యె. నా కిపుడు గలదాహ ము నిం తనఁ జాల. ఓప లుడికెదు. మహోదార తిలకుఁడవు. నీవ రా వలయు. నీయాగతిని జేకువ గలుగుఁ గాక వేఱు కాదు. మదిఁ గాల్చి కాయము పేల్చు చున్నది. వైద్యుఁ బిలిపించి నీవ కుమరింపఁ జాలుదు. నీవు విచ్చేయఁ జాల కున్న బ్రదిమి నా కింక సాధ్యము. దయారసముఁ బిదు కఁ జాలునీకై నేఁ డెదురు చూచు చున్నదానను.”

ఆద్యంతము నినుఁ జూడఁ గోరుచిత్రాంగి.

(ఇది కీర్తిశేషులైన శ్రీధర్మవరము రామకృష్ణమాచార్యులగారి విషాద సారంగధర నాటకములోనిది.)

ఏమి యాద్యంతములు చూడఁ గోరుచిత్రాంగి యనియా! ఆద్యంతము లేమి యున్నవి! "నీపై నాకు ఘన మోహము. రతిని దేల్చి కావ కున్నఁ బ్రదుకను. హా! కుమారా! సారంగధరా! సారంగధరా! ఎంతమోస మెంత దోసము చేసెరా! ఆద్యంతములు శాంతముగ సాంతముగఁ బరికింపక నిను వధకుఁ బంపితిఁ గదరా! సారంగధరా! అయ్యో! యింక నెక్కడ సారంగధరుఁడు నాకు. శంభో! హర! హర!" యని నేలఁ గూలె.



## ఇరువదవ ప్రకరణము.

### పరిసమాప్తి.

ఎన్నఁడు చూచినను గన్నులపండువుగ నుండు రాజరాజ నరేంద్రపురము నేఁ డకటా! యేడుపులతోను వెడబొబ్బల తోను నిండి యుండె. పూర్వశోభ యంతయు నంతరించినది. బాటలు వాటికలు మిద్దెలు మేడలు సమస్తముఁ గళావిహీనము లై యుండెను. ప్రజలచేఁ గ్రిక్కిరిసి యుండుపురము నిర్జన మై యుండెను. పురజనులు పురపురఁ బొక్కు చుండిరి. ఇంతకుఁ గారణ మా తోఁకచుక్క చిత్రాంగియే. ఆగ్రహము దాపురించి యుగ్రహముల నెల్ల నిట్లు పీడించు చుండె. దేవాంతరిక్షభౌ మోత్పాతము లని యివియు గాఁ బోలు!

రాజమందిరము ధూళిమానరిత మై యుండెను. అభ్రం కషోత్తుంగజ్వలితసితకేతనములు చినిఁగి చెన్ను తఱిఁగెను. మందిరద్వారములు తెఱచుటయే లేదు. లో నున్న వెల గల పదార్థములు తస్కరింపఁ బడ కుండఁ గావలి యున్న స్వల్పభట సంఖ్య గాక యందు సుహృదమాత్యాదిగురుతరులు మందున కయినఁ గానఁబడ కుండిరి.

ఉద్యానవనము లన్నియుఁ జెన్ను తొఱఁగి యుండెను. ఆమందరతరుబృందము లాపుష్పలత లాశుకపికశారికాదిపతంగ సందోహము లాజీవనయంత్రము లానున్ననితిన్ననిసన్నని తెన్ను లాకేళాకూళు లాపూఁబొదరిం డ్లానిర్మలజలజలజాకరము లవి యివి యన నేల యన్నియు నంతరించు చుండెను.

జారచోరులు మేర మీఱు చుండిరి. క్రూరమృగబాధ యధిక మగు చుండెను. రక్షకభటులు తమపనుల నిర్వర్తిం పరు. వ్యాపారము సాగ కుండె. చతుర్వర్ణములవారును దమ యాచారముల నడు గంటించిరి. భూమి ఫలింప కుండె. గోవులు పాలు పితుకవు. దేవాలయముల జే గంటలు వినిపింపవు. పడ వలపడకలు లేవు. కళాశాలలు గనుపింపవు. ఆతతాయు లధిక మైరి. తొల్లి భూమండలమునకు మండన మైనపుర మిపుడు పెద్దమ్మకుఁ బేరు తెచ్చు చుండెను.

కకుబంతసంచారకీర్తివిస్తారుండు, ఆంధ్రగీర్వాణభాషా విశారదుండు, గుణగణశోభితుం డగుసారంగధరునిగురుండు

నన్నయభట్టారకుండు రచింపఁ బూనినతనయాంధ్రమహాభార
తము మూఁడుపర్వములుమాత్రమే పూర్తి గావించి ప్రియ
శిష్యునిమరణము వీనుల విని గుండె చెదరి యనతికాలముననే
కైలాసము నలంకరించెను. సుమంతుఁడును నాశాస్త్రపారం
గతు వెన్నాడెను.

పావనగోదావరీతీరమున నున్న చిత్రాంగిమందిరము
దయ్యముల కిరవై యుండె. పచ్చికయు గచ్చపొదలును
బొమ్మజెముడులును దుమ్మమొక్కలును నేలుబడి చేయు
చుండెను. ఖరములు కిరులు నక్కలు కుక్కలు పొరలాడు
చుండెను. పల్లేరుముల్లు పచ్చికఁ గొల్లలుగ నుండెను. గబ్బిలములు
గుడ్లగూబలు కాఁపురములు సేయు చుండెను. "జ్యేష్ఠాదేవీ!"
యన నాభవనము "ఓ", యని బదు లిడు చుండెను. కట్టా!
పట్టమహిషికన్న మిన్నఁగ నుండినచిత్రాంగి కెట్టి కీడు మూడెనో
రత్నాంగిరాజ్ఞిగారిభవనమునకన్న వేయి మడుఁగు లెక్కుడుగ
నుండినయామందిరమునకు నట్టిచేటు పట్టెను.

పట్టపురాణి యగురత్నాంగీదేవిగారిదివ్యభవనము శోభా
విహీన మై యుండెను. మున్నింటివలె ధూపదీపనైవేద్యములు
లేవు. సుగంధములు గుబాళింపవు. దాసదాసికలసంచారములు
కేయూరకంకణమంజీరరవములు కన రావు విన రావు. కన
కరజతపీఠములు గ్రాలవు. రంగవల్లిక లలరారవు. చిత్రపట
ములు శోభిల్లవు. రాజదంపతులు పాన్పులు పట్టిరి.

ప్రజలు చింత మునిఁగి యుండుటయే గాక “అయ్యో! యెట్టివినాశము సంభవించినది. ఈరాజ్యమంతయు దాయలచేఁ జిక్కును గాఁ బోలు! మా కిఁక దిక్కు లేదు కాఁ బోలు! కడుపులోనినీళ్లు కదలక యుండినరాజరాజనరేంద్రపురవాసుల దురితము పండెఁ గాఁ బోలు! హా! క్రూరదైవమా! సకల సౌభాగ్యముల వర్తిలునీయాంధ్రరాజ్య మంతయు నరయఁ జాలక నీకన్నుల మన్ను గొట్టుకొంటివా! అయ్యో! వినాశకాలే విపరీతబుద్ధి యని రాజరాజనరేంద్రా! నీ కింతకే పొడమెనే యంతమున నీబుద్ధి! మహారాజా! మ మ్మెంతచక్కఁగ నాదరించితివి. పాలించితివి. ప్రజలఁ బిడ్డలఁ బోలెఁ బాలింపుమన్ననీతి వీడనివాఁడవు. నీపరిపాలనమున నేయాందోళన మెఱుంగక యుంటిమే! రాజా! నీ.వద్వితీయుఁడవు బాహుబలశాలివి రాజనీతిపారంగతుఁడవు అరిరాత్రిమిరసర్వాపహారచండగభస్తిమండలుండవు కదా! హా! సారంగధరా! సారంగధరా! నీవు నిలిచినను మా కీగోడు లే కుండునే! సారంగధరా! సారంగధరా! మ మ్మెవ్వరి కొప్పఁ జెప్పితివి! చిత్రాంగీ! యెంతపంత తెచ్చితివే! నీకతమున నెందఱు కుందు నొందుచున్నారే! విష్ణువర్ధనమహారాజా! ధీవిశారదా! తేజోనిధీ! సత్యాశ్రయా! రాజకంఠీరవా! రాజమహేంద్రా! నిన్నే నమ్మి యున్నమమ్ము నీనలుబదియొక్కయేండ్లే పాలించి విడవాడు చున్నావా! నావిష్ణుః పృథివీపతి యన్నారు రాజపత

మేశ్వరా! తగదు తగదు. మమ్ము నీతోఁ గొంపొమ్ము. ఆ చోడులయొక్కయుఁ జాళుక్యులయొక్కయు నగర్వపరిపాలనమున మేము నిలువఁ జాలము." అని యనేకవిధములు దీనాలాపము లాడు చుండిరి.

వర్షర్తు వారంభ మయ్యెను. ఆకాశాంగన సమస్త వైభవముల నానందించినయాంధ్రదేశవైభవము క్షీణదశకు వచ్చుటనో లేక యావేంగిదేశదుస్థరావస్థలఁ బరికించియో కంటికి మంటికి నేకధారగా నీరములు జాఱ విడుచు చుండెను. మొత్తమున్న వర్షములకతమునను సరి చూచువారు లేనికారణమునను రాజ్య[illegible] సపరిశుభ్రముగ నల్లకల్లోలముగ నుండెను. ఏరులు పొంగి పాడు చేసిన బాటలఁ జక్కఁ జేయువారు లేరు. మంత్రివర్గము రాజరాజనరేంద్రునివిషయమున రత్నాంగిదేవిగారిస్వాస్థ్యమునకుఁ గలఁత పడుచుఁ దదేకధ్యానమున నుండిరి.

"హా! కుమారా! పూజ లెన్నియో చేసి సారంగధరుప్రసాదమునఁ గన్న నిన్నుఁ గామాంధకారము కన్ను గప్పఁ బూర్వశ్రీమల నైన నెన్నక సుగుణగణముల నైన సరకు సేయక యాసారంగనయనవలఁ జిక్కి యీర్ష్యాళుఁడవై మన్నిగొన్న వాఁడవురా! కొడుకా! నీవు సభాస్థానమున మౌనము దాల్చి యుండ దోషి వని నిర్దేశించితిఁ గాని మానాభిమానములు నిలుపఁ దలఁచితి వనుకొన నయితినిరా! తనయా! నీ మరణమున కొప్పితివే కాని యామారిచావున కొప్ప వైతివిరా!

తండ్రీ! నీస్వార్థత్యాగమే గర్భనిర్భేద మొనరించు చున్నదిరా! కుమారా! మంత్రులు చెప్పిన విన నైతి. విద్వాంసులు బోధించిన నెఱుంగ నైతి. ప్రజలు ప్రార్థించిన దెలియ నైతి. నిన్నుం గనుపారం గన్న నీతల్లి యడుగులం బడిన నేర నైతి. ఎంత జేసితి నెంతం జేసితి! చేతులారం జెట్టంతకొడుకును ఛేదించితి! హా! సుబుద్ధీ! మిత్రునితో నీవును స్వర్గసౌఖ్యము లనుభవింపు చున్నావా! మాకాభాగ్య మలవడదా! చిత్రరేఖా! నీ వైన నప్పుడు పూర్తిగ నాచేం జిక్కిన నింత రా కుందును గదా! ఇంతకు నా తామసమే ప్రధానము. తామసి తామసి యగు నను మాట సార్థక మైనది. కొన్నాళ్లు గడు విచ్చి యైన నేను విచారింప నైతినే! తండ్రీ! సారంగధరా! మాయామోహ వాగురులం బొరలు చున్న నాకుం జెప్ప కున్న మాని నీకన్న తల్లికిని జెప్ప వైతి వేరా! కల్లనిజములు. అయ్యో! చెప్పిన మాత్ర మేమి యీసుగుణమణి చెప్పిన నేను వింటినా! భావము లొక్క టై మెలంగునీనుబుద్ధికిని వినిపింపక వెఱ్ఱి పట్టించితి విరా! పట్టీ! నాకును వెఱ్ఱి యెత్తు చున్నది; యెత్తు చున్న దేమి! యెత్తినది హెచ్చు చున్నది. తనయా! పిహితనయా! అరచేతిలోనియప్పమురీతిం జిన్ననాంట నుండియు నిన్నుం బెంచుట యాచితాంగికి బలి యొనంగుట కేనా! కూనా! నీయొయ్యారియ మడవిం గలుపుట కేనా! నీసౌందర్యము నీసర్వసుగుణములు మమ్ము దహించుట కేనా! కొడుకా! కనుగందనీయక యీంగ

ఇరువదవ ప్రకరణము.

నైన వ్రేల స్త్రీయక యింపు నింప వృద్ధి గావించిననీనూతన జా
తరసాలకిసలయకోమలకరచరణములు రుధిరధారలు చిమ్మ నతి
కించి మశకమక్షికపిపీలకాదుల కెర యిడితినిరా కొడుకా!
అత్తమిల్లిన నొత్త కుందు మెత్తనిసూర్యపటంపుపఱపులు గల
హంసతూలికాతల్పముల నామోదమునఁ బన్నుండఁ జేయు
నిన్ను కఠినవధ్యశిలాఫలకమున నాపన్నుండవై పన్నుండఁ జేసి
తినిరా కన్నతండ్రీ! వెల గలరతనములు జతపఱుపఁ బడిన
బంగరుమురుగులుముకిడీగొలుసులు భుజబందులు తొడగుటకే
సంశయించెడువాఁడను గఱుకుపగ్గంబులును నినుపగొలుసులును
గన్నులయెదురనే పట్టి కట్టి గట్టిగ బిగియింప నొనర్చితిరా
పట్టీ! నిగనిగ లీనుబంగరువ్రాఁతహొంబట్టుపుట్టంబులఁ గట్ట
నిచ్చునిన్ను నిలువునీలివలువలఁ గట్ట నిచ్చితినిరా! తనయా!
కుసుమకోరకములను గోటగిల్ల నేరనికోమలులచేతుల వదా
పెట్టునిన్ను క్రూరఘోరాకారహంతవ్యులచేతుల నిడితినిరా
యాత్మజా! శ్రోత్రానందదాయకము లగుమృదుమధురగీత
ములు నెరపుశుకపికశారికానికాయములను జరణసరసిరుహము
లిడిన వసివాడఁ జేయనిశాద్వలతలములను గలిగి యింపు
నింపునందనోద్యానవనములకు నిర్వృతిఁ గన నంపునిన్ను కర్ణ
కఠోరము లగుభీకరగర్జనములు పఱపుసింహశార్దూలవృకనికా
యములను నడుగడుగునకు నమితబాధఁ గూర్చుకంటకశిలాదు
లను గలిగి దురంతవంత సంతాపింపఁ జేయుసైరంధ్రివనములకు

నిర్వృతిఁ గన నంపితినిగా! తనూజా! నాపారిజాతమా! నా నిలువుటద్దమా! నాప్రతిబింబమా! న్వనాశనమునకై యెంత యెగిరి పడితి నెంత మిడిసిపడితి నెంతవేగిరపడితినిరా! యెన్ని తలఁచినఁ దఱుఁగు నీదివ్యచరిత్రము! నన్నుఁ గా కున్న మాన నాపాదములకడఁ బరుండి నోట మాటయుఁ గంటఁ జూపును నిద్రాహారములును స్వాస్థ్యమును లేక మనోవిచారమున మ్రగ్గు చున్ననీకన్నతల్లి నైన నూరడింప రా రాదా కుమారా! అయ్యో! ఖలుఁడ నగునాకాళులకడ నుండె నని రా కుంటివా నాయనా! ఆసూర్యచంద్రుల నీసువర్ణ పదార్థముల నెట్లు చూడఁ గలనురా పుత్రా! చిత్రాంగీ! చిత్రాంగీ! యెంత చేసితివే! ఛీ! ఛీ! నిన్నన నేమి! ఇంతయు నేన చేసితి. మాయలాడీ! యెన్నిమాయలు పచరించితివే! "నే నేమి బొంకిన నెవరు నమ్మరు! నాయందుఁ బ్రగ్గడల కందఱకు నగ్గల మగుప్రేమ. ప్రజ లన్ననో న న్నెల్లకాలముఁ బ్రీతిమయి నరయుదురు. అశేషాశావకాశముల నాయశము భృశముగ నిదివఱకె పరలి యున్నది. ఆబాలగోపాలము నాపక్షమె వహింతురు కాని నీ వేదే నన్న నిన్ను వెనుకవేసికొని రారు." అని యెన్నెన్నో ధీరవాక్యములు వెలువరించినట్లు తెలిపి నామనమును గలఁత నొందించి కినుకఁ జెందించి తనయు—చిన్నారిపొన్నారితనయు—వరతనయు—విహితనయు—మ్రందించితివి కదే! అయ్యో! చిత్రాంగిసమక్షమున నన్నిమృగ్యవచనములు వచించినవాఁడు

సభాస్థానమున సకలజనసమక్షమున నిరుత్తరుఁ డయి యధో
ముఖమున నున్నప్పు "డెట్టికట్టెఁడి కైన నిఖిలజనసమక్షమున
నిర్భయముగఁ గల్లలఁ గొల్లలుగ వెలువడింప జంకు జనించుఁ
గాదే! మఱియు నింతపర్యంతము సకలసద్గుణనిష్ఠాగరిష్ఠుఁడును
సర్వభూతదయాపరుఁడును సర్వసముఁడును జితేంద్రియుఁడు నని
పించుకొనినవాఁడు కావునఁ జిత్తవిభ్రమమున నమ్మొత్తకాశిని
వాసించినదోన మ్మంతరంగమ్ముఁ బొడుచు చుండ నెట్లు టొంకఁ
గలఁడు! అప్పటిదృఢచపలత్వమున నబలయెదుట నీప్సితసిద్ధి
కట్టు లాడి యుండెనే కాని కానిపని నొనర్చితి నని కటకటం
బడి యొక్కింతజ్ఞానముం బడసినవీఁ డిప్పు డట్టు లాడ సాహ
సింపక మౌనము నూని యుండె" ననియే యూహించితిఁ గాని
"సత్యాలాపబద్ధుం డై తనమానప్రాణములు తొలఁచుమూరి
యొక్కప్రాణమానములఁ నిలుపుతలఁపునఁ బెదవి మెదలుపఁ
డయ్యె" ననుకొన నయితినిరా! కుమారా! కామక్రోధానల
పరివృతధూమరాజిజనితాంధకార మెంతబుద్ధిమాంద్యము నొం
దించె. నమస్తదిగ్వ్యాప్తసహస్రపత్రమిత్రమరీచిప్రభాభాన
మానసమానధీవిభవము లభ్రనిభారిషడ్వర్గముల నింతకాల
మంత మొంది యుండెఁ గదా! ఏమి యాకృత్రిమానునికృత్రి
మవిభావము! మాయ! మాయ! అంతయు మాయ! ఎంత
మాయానాటకము నాడించి మాయమాయికు నపహరించె.
గాటపుమోహంబు నాటించి చాంచల్యము పుట్టించునే కాని

యించుకయు బూటక మీభువననాటక మనిపించఁడు మరణ
కాలమువఱకు. నిజము నిలుకడపైనఁ గాని తేల దనియెద
రిదియ కదా! తేలిన నేమి! తేలకున్న నేమి! నిజము తేలఁ
గాని యపారగభీరగంభీరభూరిపారావారచింతానిమగ్నుల మ
గుమేము తేలఁ గలమే! హా! యింగలసమసంతాప మింగను
మమ్ము మ్రింగక తొలంగి యడంగి యున్న దేమి! హర!
హర! హర! హర! శంభో! మమ్ము త్వరఁగ హరింపుము
సంహరింపుము కరము భరింపుము.

వాస్తవముగఁ గాకున్నను గన్నులకు నాకాశము నీల
ముగను గనుచూపుమేర ధారుణిఁ జేరినట్లును, నెండమావుల
నీరము లుండినట్లును, మెఱుఁగుడుపురుగుల నగ్గి కలయట్లును,
గనుపట్టునట్లు సుకుమారా! యాబోటికల్లబొల్లియేఁడ్పుల నా
నాఁటికైతవసాక్ష్యముల నన్నిఁటికన్న నాకామమదాంధత్వ
మును బట్టి నింద నీయం దారోపించి బొంది నుసురుల వే
రొనర్చితిని. హా! నే నెట్టిక్రూరకర్ముఁడనురా పట్టీ! పట్టి పట్టి
నిన్ను హంతకులు పడ గెంటుక నడిచినప్పుడును నొక్కపెట్టునఁ
గరచరణద్వంద్వములు కఱకుకత్తుల నఱికినప్పుడును నలంత
కాఁగ లేక కలంత.వదుచు హా! సుకుమారా! యెంతవంతపా
లయితివో కదా! కర్మము! కర్మము! ఇది సమస్తముఁ
బ్రారబ్ధకర్మము! ఇంతకు నేన నింద్యుఁడఁ గాకున్నఁ బరమ
పతివ్రతయు శీలవతియు రూపకలాపలావణ్యవతియు నగుసతి

యుండఁగా సకలకళాధురంధరుఁడును సకళంకుఁడును సమితా హ్లాదకరుఁడును వినయవినమితుఁడును నిజయావన తేజోవిరాజితుఁడును నగునుతుఁ డుండఁగా బుద్ధి బుగ్గిఁ బెట్టి భీతి కట్టిపెట్టి నీతి మట్టుపెట్టి సిగ్గు చిముడఁ బెట్టి పాయము ప్రోయిననేను—ఎన్నఁడు లేని కామము కన్నులఁ గప్ప—నీదు లేనిచేడియఁబరిణయ మాడ నేల! కట్టా! పురాకృతకర్మమే కాకున్న నా కాబుద్ధి పుట్ట నేల! పుట్టెఁబో దాని మట్టుపెట్టక మానసకృత్యమున కెడ మిడ నేల! ఎడ మిడితిఁ బో కత్తికిఁ గంకణము కట్టవా రాడఁబడ నేల!* శీలము పోఁ దోలి యాకాంత యంత బాళి పూన నేల! యింతగోల రా నేల! నా బాలు నేకబాలుఁ గోలుపో నేల! ఈసకలము సర్వేశ్వరవంచన. హే! శంభో! యుమాపతీ! మాం పాహి! మాం పాహి!

నాకు బుద్ధి యున్న చిత్రాంగి యేమిచేయు! ఆది నుండి యంతమువఱకు నీవంత కెల్ల నేన నేన ముమ్మాటికి నేన కారణుఁడను. మహాపతివ్రతాశిరోమణి! సర్వసౌఖ్యద! నిర్మల హృదయ! వివేకవతి! కీర్తనీయ యగునీదేవిఁ బో విడిచి కాముకుఁడ నై కలుషమతి నై మూర్ఖుఁడ నై దానిఁ జెట్ట పట్టినందుకు నా కీకుందు రా వలదే! నీయిందుముఖముఖ మెట్లు కనుఁగొందు. వడి తప్పినఁ బెద్దపెండ్లామె దిక్కనియెద రిదియ కదా! హా! దేవీ! రత్నాంగీ! చిత్రాంగి వచ్చినది మొదలు నిన్నుఁ జూడ నరి కదా నీమందిర మైనఁ గనుఁగొన

వై. తి. ఛీ! ఛీ! ముండిగింపరగండఁడా! నీ వింకను నిన్ని తలపోయు చుంటివా! గురువులఁ గూలఁ ద్రోసి మంత్రుల మాపుచేసి సుహృద్వరుల శూన్యము చేసి ప్రజల బాముల ముంచి యే మని నిలిచి యుంటివి! నీకు బలవన్మరణమే విధి విధియించె.

దేవీ! రత్నాంగీ! తీసికొని తీసికొని చచ్చుటకన్న నొక్కసారి యీపావనగోదావరిఁ బడుదము రమ్ము. మరణమే మనకు శరణము; సర్వశ్రేయస్కరము; దివ్యౌషధము. అయ్యో! నామాట వినవా లెమ్ము. వేగమ్ము.

అని యిట్లుగ మతి తప్పి ప్రలాపించి రాజరాజనరేంద్రుఁడు రత్నాంగిదేవి లేవఁ దీయఁ జూచెను. ఆయమ్మ నోటి మాట కంటిచూపు లేక యుండె నని యిదివఱకె తెలిపితి. ఇప్పుడో చదువరీ! నాయుల్లము తల్లడిల్లు చున్నది. నాకలమాఁపకున్నది. వ్రాయఁ జాల వ్రాయఁ జాల. చేతులార నాయమ్మ! యాయకలుషమతి! యాబుద్ధిమతి! యాసుగుణాలవాల! యాపతివ్రతాశిరోమణి! యానారీతిలక మామానినీమతల్లి—రామ! రామ! కన్నులు కనఁబడుట లేదు చేత మఱిగె—వ్రాయ లేను క్షమింపుము.

యజమానునందలిభయభక్తుల నుడువక విడువకయు వత్సము ననుగమించుగోవుపగిది దేవీ రత్నాంగీ! నీవు నీ వరపుత్రి వెన్నాడి యున్నావా! కట్టా! కన్నతానుపు నట్టి

కానిగతిఁ బట్టించినందులకు సకలసద్గుణవిరాజిత వగునీవు కావున సరిపోయెఁ గాని యితరేతరస్త్రీ యయిన నెంతయో యలంత పుట్టించి కలంత పెట్టించి పలవంతఁ దొట్టించి మట్టు పెట్ట నెట్టు లయినఁ బ్రయత్నింప కుండునే!

"హా! దేవీ! దేవీ! పురంధ్రీరత్నమా! ముందే నీ వాయానందమయుఁ గూడితివా! నీనందనుఁ గనుఁగొని యా నందపడు చుంటివా! హా! యీశ్వరా! అంతకు మొండిని నేనేనా! దేవీ యిందు కేనా! మాట లాడ వైతివి! విచా రభరమున నూరడింప కూరకుంటి ననుకొంటిఁ గాని నీవాన ర్వే శ్వరునితో నిదివఱకే యైక్య మొందితి వనుకొన లేదు. నేనును వచ్చు చుంటి. హే! శంభో! శంకరా! అఘనాశంకరా! నాపూర్వపూజల లెక్కగొని నన్ను నీలోఁ జేర్పుము. ఈప్ర పంచమున నే నిఁక నిలువ హా! మాంరక్ష! మాంరక్ష!" యని మఱి మా టాడఁ డయ్యె.

దాసదాసికలు గొల్లు మనిరి. దిక్కులు తెలియక పరుగు లిడిరి. పెక్కండ్రు దిక్కు లేక గౌతమి సంగమించిరి. కొందఱు భర్మహర్మ్యము నుండి నేలఁ గూలిరి.

మంత్రివర్గము తొందరఁ జెంది యడుగులు తడఁబడఁ బడుచు లేచుచు మేడ నెక్కె. అందఱుఁ గన్నీరు మున్నీరు గా భూనభోభాగము లదుర నేడ్చిరి. స్మృతి తప్పిరి.

ఎట్టకేలకు రాజసన్మానముల దుఃఖజలప్రవాహముల

మునింగియే యారాజదంపతులకు దహనాదికార్యములు జరపిరి. దుఃఖదందహ్యమానమానసు లై వారును దోడ్తోన వారి ననుగమించిరి.

పాఠకమహాశయా! యెవ రైన నంతయే. ఇంతయో యంతయో హెచ్చు తగ్గు. చేసినకార్యములే స్థిరము లై యుండు. పాపపుణ్యములే వెంటాడు. కలకాలము కర్మఁ గూడఁ జెట్టక కామక్రోధలోభమోహమదమాత్సర్యములకు దాసుఁడవు గాక సత్వరసప్రధానుండ వై భూతదయాపరుఁడ వై భగవచ్చింతనపరుఁడ వై ఋషుద్రిలఁ గొలువక జీవయాత్ర నడుపుము. ఇహపరసుఖముల నెంతయు ననుభవింపుము. పరమేశ్వరునితో నైక్యము గమ్ము. అదియు నాయాశయము.

ఓం శాంతి శ్శాంతిః

శ్రీరామార్పణమస్తు.

సంపూర్ణము.



Sree Savitri Press, Jagannacikpur, Cocanada.

పాముర్తి బుచ్చిరాజకవి కృత

# మనోహరాంధ్ర గ్రంథములు.

---

## పద్మిని.

ఇది రసవంత ముగురసపుత్రిచరిత్రి. నాటకము. అల్లా యుద్దీనక్రివర్తి పద్మిని మోహించి చిత్తూరు నాశన మొనరుచుట. నవరసభరితము. చక్కనిమేలికాగితము. గోల్డెన్ అచ్చు. మిక్కిలిచౌక. 100 ప్రతులే కలవు. వెల రు 0-10-0.

## చిత్రకేతూపాఖ్యానము.

భాగవతకథ. పద్యములు రత్నములు. వేదాంతమున నిధి. కమల మున్నగువారి దగు చమత్కారము, వినయంధరుని ప్రభుభక్తి చిత్రికేతుసార్వభౌముని వైరాగ్యము నారదాంగిరసాముృతోపదేశము చదువ వలయునే కాని వ్రాయఁ గాదు.

వెల రు 0-14-0.

## కుచేలకృష్ణ.

కుచేలునిచరిత్రి నాటకరూపకముగ నింతపర్యంతము జగమెఱుఁగనిలోప మిప్పుడ తీరె. భక్తిముక్తిదాయకము. సంఘసంస్కారమూర్గము. చక్కనిహాస్యరసప్రధాన మగు

కథతో జోడింపఁ బడి ముత్తెము పగడము చేర్చినహారమునా విలసిలు చున్నది. దళసరికాగితములు పెద్దచ్చు. రు 1-0-0.

# ధ్రువవిజయము

ఆంధ్రభాషాయోషాలలామముక్తాహారమున నాయకో మణి. దీనికిసాటి నాటకమే లేదు. పలుతడవలు ప్రదర్శింపఁబడి 12 బంగారుపతకము లందినది. ధ్రువచరిత్ర ఆంధ్రరంగస్థల మెఱుఁగనికొ్రత్త మాసినది. దీనిఁ గూర్చి తెలుప నెంతయుఁ జాలము. ముద్దులు మూట కట్టు పెద్దచ్చు. పాలమీఁగడవంటి దళసరి తెల్లనికాగితములు, రు 1-0-0.

# సన్మార్గ ప్రదర్శనము.

250 పేజీలు గలమిక్కిలిచక్కనినవల. పెద్దచ్చు. దళసరికాగితములు. ఆంధ్రదేశచరిత్ర. అత్యద్భుతకథాకల్పనము. మృదుమధురశైలి. గంభీరభావంబులు. నీతిదాయకము 1-12-0

# మధుఁడు.

చిన్ననవల. మనోహరము. ది మార్ట్ బార్న్ టుబి కింగు అనుదానియనుసరణము. ముద్దులొలుకుపద్దెములు కలవు. దళసరికాగితములు : పెద్దచ్చు. రు 0-4-0.

## స్వర్ణస్పర్శనము.

"అత్యాశ దుఃఖ" మ్మనునీతిఁ జక్కఁగ బోధించును. గోల్డెన్ టచ్ అను దానియనుసరణము. దళసరి తెల్లని గ్లేజ్ కాగితములు. రు 0-2-0

## అసూయ.

అసూయ స్వనాశనహేతు వని నిరూపించుచిన్న నవల. గోల్డెన్ ఏపిల్స్ ఆఫ్ లఫ్ ఎర్స్ అనుదానియనుసరణము చివర మిత్రస్మృతి పద్యములు కలవు. రు 0-4-0.

## మాతృప్రేమ.

తల్లికి పిల్లలపై నుండుప్రేమ సమంజససీసపద్యములు నిందు వెలయును. రు 0-1-6.

## శుకస్మృతి.

పెంచినచిలుకపై పద్యములు. మనోహరములు. 0-1-6.

## నరపశుశతకము.

ఇది దుర్నీతిజ్ఞుఁడుగా నున్న నరసింహమూర్తిఁ గూర్చి రచియింపఁ బడినది. మిక్కిలిచక్కనిపద్యములు. సులభశైలి. మేలికాగితములు పెద్దచ్చు. రు 0-2-6.

## దీ నా వ న శ త ము.

నరుని యాద్యంతములు చక్కఁగఁ జూపును. వైరాగ్య నిధానము. పద్దెములు వజ్రపుతునుకలు. చక్కనిదళసరికాగితములు. ముముక్షుజనానందకరము. రు 0-2-6.

## సు బో ధి ని.

ప్రస్తుతవైవాహికానర్థములు చక్కఁగ బోధించుకంద పద్యములు. రు 0-1-0.

జగన్మోహినీనాటకము ; శ్రీకృష్ణనిర్యాణనాటిక ; జనార్దనశతకము ; వీనిప్రతులు ప్రస్తుతము లేవు.

చిరునామా:-

పామర్తి బుచ్చిరాజు,

కాకినాడ,

(గోదావరిజిల్లా.)

Sree Savitri Press, Jagannaikpur, Cocanada.